

బెబ్బులి

ఫొటో: ఎస్. హరిహరన్.




ఆరాధన

చిత్రకారుడు : పి. నరేంద్ర—మద్రాసు.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.




సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 51
సంచిక 27
6-3-57

దుర్ముఖ ఫాల్గుణ శుద్ధ పంచమి బుధవారం


## విషయానుక్రమణిక

ముఖచిత్రం : సూర్యకుమారి



# నయాపైసా నాంది

నయాపైసా నాణాలపై ప్రచారంనిమిత్తం ప్రభుత్వంవారు అట్టముక్కలను సప్లై చేశారు. ఏదో వాగుడుగాయనుకదా అని నా స్నేహితుడు డిప్యూటీ తహశీల్దార్ మల్లికార్జునరావు నాకూ ఒక అట్టఇస్తూ, "ప్రచారం చేయవోయ్" అన్నాడు.

ఎందుకైనా మంచిదని ముందుగా ఇంట్లోనే ప్రారంభిద్దా మనుకున్నాను నా ప్రచారం. ఇంటగెలిస్తేకదా, రచ్చ గెలువగలిగేది! మా ఆవిడ మానసికతత్వం తెలుసుగనుక, ముందుగానే జాగ్రత్తి పడ్డాను. ఇంటికొచ్చేసరికి మా ఆవిడ వంటచేస్తూవున్నందున, ఆ సమయం మంచిదికాదని వూరుకున్నాను.

మెల్లగా భోజనాలయి వక్కలాకుల వ్యవహారంలో వున్నపుడు, ప్రారంభించాను, "ఇదుగో కొత్తరకం నాణాలను చూశావా?" అంటూ. "ఇవెక్కడివండి? ఇటువంటి పావలాలు మేము చిన్నప్పు డెక్కడో చూశామే?" అన్నది, పది నయాపైసాల నాణెం చూడగానే.

"అది పది పైసాల నాణెం" అన్నాను.

"అంటే-పది దమ్మిడీలా?"

"కాదు. ఇప్పుడు పైసాలని కొత్తరకం డబ్బులొచ్చాయి. ఇలాంటివి రూపాయకు వంద" అని ప్రారంభించాను నిదానంగా.

"ఏమిటీ-రూపాయకు వంద పైసలా! ఏమన్నా మతిపోయిందా? రూపాయకు 192 పైసలు కాదుటండి!

"ఆ-అదే-ఇకనించి రూపాయకు వంద పైసలే నన్నమాట."

"అయితే అణాకు?"

"ఇక అణాలు, అర్ధణాలు జాస్తేనై!"

"బేడలో?"

"బేడలు, గీడలు గోల్‌మాల్ అయిపోతాయి-ఇక వుండేవల్లా-రూపాయి, అర్ధరూపాయి, పావలా, పది పైసాలబిళ్ళ, ఐదు పైసాలబిళ్ళ, రెండు పైసాలబిళ్ళ, వక్క పైసా! అంతే!"

"ఇదేం పొయ్యేకాలం వచ్చిందీ-అంటా! మేం పుట్టకముందునుంచి వున్న డబ్బులు కాస్తా పోతే, మళ్లీ ఈ ముదరష్టపు లెక్కలన్నీ ఇప్పుడు నేర్చుకోవాలా?"

"తప్పదు—నేర్చుకోవాల్సిందే!"

"నాచేతకాదు బాబూ! వచ్చే నెలనుంచీ ఆ లెక్కా, డొక్కా మీరే చూసుకోండి!"

"శ్రీ మద్రమారమణ గోవిందో హరీ!" అనుకున్నాను. "నీ కందిపప్పు లెక్క, పాల లెక్క, పెరుగులెక్క ఇవన్నీ నేను చూడనా? నాచేత కాదు—కాదంటే కాదు! కావలిస్తే, రోజూ ఒకగంట ప్రైవేటు చెప్తాను. లెక్కలు నేర్చుకో. అంతేగాని నేనేమీ ఆ పాలవాళ్ళతో, పెరుగులవాళ్లతో బాధపడలేను."

"అసలీపని కాంగ్రెస్‌వాళ్ల దేనా?"

"ఇక్కడ కాంగ్రెస్సూ—కమ్యూనిస్టూ అంటూ లేదు. సర్కారువారు మన నాణాలను సవరించారు. ఎందుకంటే.....దేశదేశాల్లో రూపాయలుగాని, ఏవిగాని—వందల లెక్కల్లో వుంటే, మనవి పన్నెండూ, పదహార్లూ అంటూ వున్నాయి—మనమిప్పుడు, దేశదేశాలతో వర్తక వ్యాపారాలు చేస్తున్నాం గనుక కొన్ని ఇబ్బందులు కలుగుతున్నాయి; అవన్నీ లేకుండా వుంటానికే ఈ పద్ధతి తెలిసిందా?"

"అయితే ఇంగ్లీషువాళ్ల పౌనుకు షిల్లింగులు?"

"ఇరవై."

"షిల్లింగుకు పెన్నీలు?"

"పన్నెండు."

"పెన్నీకి ఫార్తింగులు?"

"నాలుగు. నా నాలిక ఎండుతూంది. కాసిని మంచినీళ్లు తెచ్చిపెట్టు."

తాంబూలంవల్ల డెక్కపట్టిం దేమోనని చప్పున లోపలికెళ్ళి మంచినీళ్లు పట్టుకొచ్చింది భామామణి. మెల్లగా నీళ్లు తాగి, మళ్ళీ మొదలుపెట్టాను నా నయాపైసాల నాంది ప్రస్తావన.

"అసలు దేశంలో దశమానపద్ధతులు ప్రవేశపెట్టాలన్నదే ఈ మార్పు ఉద్దేశం. ఖర్చులుకూడా రూపాయిలు, పావలాలు, పదులు, ఐదుల్లో వుండాలేగాని, మూడు, నాలుగు, ఎనిమిది-ఈ విభాగాల్లో వుండరాదు. అందుకనే ఈ మార్పు చేస్తున్నారు మన ప్రభుత్వంవారు."

"అఘోరించినట్లే వున్నది. నీ జీతం

# ★ నయాపైసా నాంది ★

అంతా కలిపి—వందరూపాయలు కదా! ఏమిటి మీరు ఖర్చుచేసేది వందల్లోనూ—పాతికల్లోనూ!"

"ఆ-అలా దారికి రా! వందరూపాయలు అంటే వంద వందలు, పదివేల పైసాలన్న మాట!"

"ఇంకాశోలీల్లోలెక్క కట్టండి-ముప్ఫై వేలవుతాయి."

"అదుగో-అదే-మీ ఆడంగుల మన స్తత్వం! నీ వెప్పుడూ పాత చింతకాయపచ్చడి భావాలే! ఈ మార్పువల్ల మన ఆర్థిక వ్యవస్థలో పెద్దమార్పు వస్తుంది. మన భావాలు మారిపోతాయి. మన పరిస్థితి మారుతుంది. మనం బాగుపడతాం. అసలు సంగతి తెలుసా? భారతం చదివావా? అప్పుడు లెక్కలన్నీ ఇలాగే వుండేవి. కౌరవులు వందమంది, పాండవులు అయిదుగురు-అంతే కాదు అన్నీ పదుల్లోనూ-వందల్లోనే వ్యవహారాలు."

"రామాయణంలోనో?"

"ఊ-అదైనా అంతే! రావణాసురుడికి పది తలకాయలు - రాములవారి సైన్యం పది లక్షల కోతులు, ఏదైనా విచారించుకో అన్నీ పదులు, పాతికలేకాని, మూడులూ, ఏడులూ వుండవు."

"అలాగా!"

"మరేమనుకున్నావు! అందుకనే మీసం మీద చెయ్యేసి-మన ఈ కొత్త నాణాలకు 'నయాపైసా' అని నామకరణం చేశాము."

"పోనివ్వండి-నాకు చిన్న అనుమానం వచ్చింది. బేడలు పోతాయికదా, బ్రాడిపేట బండ్లమూడి హనుమాయమ్మ బడి నుంచి మన వీధికి రిక్షాబాడుగ ఇప్పుడు బేడ. ఇక వాడికెంత ఇవ్వాలో చెప్పండి."

"వాడిక బేడ అడగడు."

"బేడగాక, పావలా అడుగుతాడా? ఇదేగా మీ నిర్వాకం! అడిగినవాడికి అడిగినట్లు ఇవ్వడం-బేరమాడకుండా!"

"అదికాదే-వాడు పైసాల లెక్కల్లోనే అడగాలి. పదిపైసాలు, పదిహేనుపైసాలు, ఇరవైఅయిదు పైసాలు, అని అడగాలి. మీరు-పాతిక అంటే ఇరవై, పదిహేనంటే పది-పది అంటే అయిదు-ఇలా బేరాలాడాలి. అది దర్జాగా వుంటుంది. చూడూ! ఇదివరలో బేడ అడిగాడనుకో. నీవు కాని తక్కువ బేడ అని అడగడం కించపరుమ్తా వుండేది. ఇప్పుడాబాధ లేదు."

"పోనీయండి-వంద పిడకలు పావలా-పాతిక పిడకల ఖరీదెంత?"

"అణా-ఛ!ఛ! వుండు-పావలాకు ఇరవై అయిదు పైసాలు; వందపిడకలూ ఇరవై అయిదు పైసాలు. ఇరవైఅయిదు పిడకలూ ఆరుంబాతిక పైసాలు. బేరమాడితే ఆరు పైసాలకు ఇస్తాడు."

"ఇవ్వనంటే"

"ఏడుపైసా లివ్వు"

"ఎడిసినట్టే వుంది. మన ఆదా చేయడం! వాడికీ - మనకూ ఇద్దరికీ నష్టంలేకుండా వుండాలి కానీ, ఇదేం పీడాకారం?"

"అందుకనే-ఇకనుంచీ - వంద పిడకలు-పాతిక పైసాలని బేరం మొదలెట్టు. పాతిక పిడకలు కొననేవద్దు; కొంటే యాభై, కాదు వందాకొను. లేకపోతే, అసలు మానేయ్!"

"పిడకలు లేకపోతే, పొయి రాజుకోవద్దూ? మీ పాడు పైసాలొచ్చి పిడకలు మానుకో మంటారా!"

"చాలెద్దూ-మహా-పిడకల లెక్క అడుగుతున్నావ్! దేశంలో మహత్తరమైన మార్పు తెచ్చే మన నయాపైసాల విషయం నేను చెప్తావుంటే, నీవు పిడకలబేరం సంగతి తెస్తావా! అసలు మీ ఆడంగుల కెప్పుడూ పిడకల గోడవే!"

"పోనీయండీ. రూపాయకు ఆరుశేర్ల కుంకుడుకాయలు. శేరెంత? అర్ధరూపాయకు మూడుశేర్ల వంకాయలు శేరెంత? మీ సిగరెట్లు - సిసర్ పెట్టె అయిదణాలు-ఇకముందు సిగరెట్టెంత? మీరు కొనితెచ్చుకునే చేబ్రోలు పొగాకు సవాశేరు నాలుగు రూపాయలు. అంటే ముప్పై కొడలొస్తాయి. కొడ ఎంతపడుతుంది? పాచిపనిమనిషి జీతం నెలకు రెండురూపాయలు; పన్నెండు రోజులే పనిచేసింది-ఎంతివ్వాలి?"

"ఆగవే - ఆగు! నీ పాచిపనిమనిషి లెక్కలూ, వంకాయలూ-కుంకుడుకాయల లెక్కలూనూ! తల తిరుగుతోంది" అని తప్పుకో ప్రయత్నించాను.

"అదిగో ఆ పత్రికలో పరివర్తన పథకం వుంది-చదువుకోండి," అంటూ పత్రిక నా మొఖాన పడేసి వంటింట్లోకి పోయింది. ఇప్పటికి నా కర్థమయింది-ఈ పరివర్తన పథకం మనం కంఠోపాఠం చేయాలి. తరువాత ప్రచారం ప్రారంభించాలి. చూశారా! ఇంట్లోగాబట్టి నేనెంత గాబరా తిన్నా సరిపోయింది. లేకపోతే ఈ నయాపైసాలు నామర్దా తెచ్చేవే! ఎందుకైనా మంచిది. ఈ లెక్కలు ఎంత త్వరగా నేర్చుకుంటే అంత మంచిదని నా సాదరీ - కాదు ముంగు సోదర పాఠకులకు వేరె చెప్పాలా? ★

—[శ్రీకంఠం కృష్ణమూర్తి.]

# న్యూఢిల్లీ లేఖ

## జంతుప్రదర్శనశాలల నిర్వహణం

అస్సాం రాష్ట్రంలో తపాలా శాఖోద్యోగుల సమ్మె సాగుతున్నది. రైల్వే ఉద్యోగులలో కొన్ని తరగతులవారి వేతనాలు ఎక్కువ జేస్తున్నట్లు మంత్రి ప్రకటించిన వెనువెంటనే ఈ సమ్మె ప్రారంభం కావడం విశేషం. ప్రధాని నెహ్రూ, తంతి తపాలాశాఖ మంత్రీ ఇద్దరూ, సమ్మెకు దిగవద్దని విజ్ఞప్తి చేసినప్పటికీ వినకుండా, అస్సాంలో ఈసమ్మె ప్రారంభించారు. ప్రస్తుత పరిస్థితినిబట్టిచూస్తే శ్రామికవర్గాలను సంతృప్తిపరచాలనే ధోరణి జాతీయ భద్రతా పరిధులనుసైతం దాటిపోతున్నదేమో ననిపిస్తున్నదని ఇక్కడ పలువురు అభిప్రాయపడుతున్నారు. ప్రతి ఐదేళ్ళకూ ఒకసారి, ఎన్నికలు వచ్చినప్పుడల్లా, ఉద్యోగుల వేతనాలను సవరించడానికి ఉపక్రమిస్తే, ఇక ఈ పెరుగుదలకు అంతెక్కడ? ఇది ప్రాజ్ఞులైనవారందరూ శ్రద్ధాసక్తులతో ఆలోచించవలసిన విషయం.

డెన్మార్కు దేశాన్ని ఒక ఉదాహరణగా తీసుకుని అక్కడి పరిస్థితులను పరిశీలిద్దాం. బ్రిటన్‌లోమాదిరిగానే డెన్మార్కు ఆర్థిక వ్యవహారాలలోకూడా దేశంలో సాగుతున్న ఉత్పత్తికీ, వేతనాలస్థాయికి, నిరుద్యోగ సమస్యకు సమన్వయం సాధించడమే అతి ప్రధానమైనసమస్యగా ఉంటున్నది. వేతనాలస్థాయినిజీవనభృతిసూచితో ముడిపెట్టి వుంచుతారుగాని, ఉత్పత్తిసామర్థ్యంతో ముడిపడి వుండేట్లు చేయరు. అయితే, దిగుమతిసరుకుల ధరల స్థాయినిబట్టి జీవనవ్యయసూచి మాత్రం మారుతూవుంటుంది. ప్రభుత్వపు వార్షికబడ్జెటు ఎప్పుడూ లోటుగా నేవుంటుంది ఇంతే కాదు. లభ్యమయ్యే విదేశీ మారకపు ద్రవ్యం కూడా స్వల్పస్థాయిలోనే వుంటుంది. ఎగుమతి దిగుమతి వ్యాపారంలో తాము ఆర్జించే డబ్బుకంటే, విదేశాలకు తాము చెల్లించవలసిన డబ్బే ఎప్పుడూ ఎక్కువగా వుండి, పరిస్థితి అననాటుగానే వుంటుంది. భారతదేశ పరిస్థితికూడా ఇందుకు ఏమంత భిన్నమైనదికాదు. పదిహేనేళ్ళ క్రితం సర్ బి. ఎన్. రావుకమిటీ మన దేశంలో కూడా వివిధశాఖలలో పనిచేసే ఉద్యోగుల వేతనాలస్థాయి జీవన వ్యయసూచిపై ఆధారపడివుండేలా చేసి అందుకు అనుగుణమైన నిర్ణయాలు చేసింది. అంతే

శ్రీ కృష్ణ

[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

గాని, ఉత్పత్తిని మాత్రం వేతనాలస్థాయితో ముడిపెట్టలేదు. ఇప్పుడు పరిస్థితి అంతా మారిపోయింది. దేశ ఆర్థిక వ్యవస్థ దెబ్బతినిపోతున్నదంటే ఈమార్పే ముఖ్యకారణం.

రైల్వేలలో సామర్థ్యం ఏ విధంగా పెరిగిందో నిరూపించుకోడానికి రైల్వేబోర్డు ఈ మధ్య కొన్నివివరాలు ప్రకటించింది. సగటున ప్రతివ్యక్తి ఉత్పత్తి సామర్థ్యం 1947 ఆగస్టు 15 తర్వాత ఏమైనా పెరిగిందో, తగ్గిందో చెప్పే వివరాలను పేటినీ బోర్డు చెప్పలేదు. ఈవిషయమే తపాలా శాఖోద్యోగులకు కూడా వర్తిస్తుంది. ఈ పరిస్థితులలో జీతభత్యాల సవరణ వ్యవహారాన్ని ఎన్నికలతో ముడిపెట్టడం ప్రభుత్వశాఖలలో రాజకీయాల గొడవను ప్రవేశపెట్టినట్టే అవుతుంది. ఏదైనా ఒకసమ్మె సాగుతున్నప్పుడు, ఆ సమస్యను పరిపాలనా నిర్వహణం దృష్ట్యా అధికారస్థాయిలో ఎదుర్కొని పరిష్కరించడానికి బదులుగా ప్రభుత్వం దాసోహమనే ధోరణ్ని ప్రదర్శించడం జరుగుతున్నది.

*　　*　　*

భారతప్రభుత్వ రవాణాశాఖ కార్యదర్శి శ్రీ నీలకంఠ మహాదేవఅయ్యర్, ఐ.సి.ఎస్. రేపు మార్చి 31-న ఉద్యోగంనుంచి విరమిస్తున్నారు. వీరు ఐ. సి. ఎస్. ఉద్యోగిగా గత 35 ఏళ్ళనుంచీ పనిచేస్తున్నారు. అనేకమంది ఇతర ఉద్యోగులమాదిరిగా తమ ఉద్యోగకాలాన్ని పొడిగించవలసిందని వీరు పెద్దలవద్ద పడిగాపులుగాచి, ప్రాధేయపడ దలచుకోలేదు. తాము ఉద్యోగంనుంచి విరమిస్తే ప్రభుత్వం సమర్థుడైన ఒకఉద్యోగి సేవను కోల్పోబోతున్నది సుమా అని వీరు బెదిరించ దలచుకోలేదు. కంట్రాక్టుప్రకారం తమ ఉద్యోగకాల పరిమితి అయిపోవచ్చిందనీ, ఆఖరయే తేదీన తమ విరమణకు అనుమతించ వలసిందనీ ముందుగానే ప్రభుత్వానికి తెలియజేశారు. ఐ. సి. ఎస్. ఉద్యోగుల పాతసత్సంప్రదాయాన్నే వీరు కూడా అనుసరించారు.

*　　*　　*

గత సంవత్సరం లండన్ "ఎకనమిస్ట్" పత్రిక "పార్కిన్సన్స్ లా" అనే శీర్షిక క్రింద ఒక చక్కటి వ్యాసాన్ని ప్రచురించింది. దానికి అనుబంధంగానే ఈవారం ఇదేపత్రిక "ఉద్యోగ విరమణపై పార్కిన్సన్ భావాలు" అనే శీర్షికతో మరొక వ్యాసం ప్రకటించింది. ఉద్యోగ విరమణ

(55-వ పేజీ చూడండి)



# బుడుగు! చిచ్చులపిడుగు

ఇగో మరేం, నా దగ్గరకూడా అయిడియాలూ అభిప్రాయాలూ ఉన్నాయి తెలుసా?...ఒక్క బాబాయిదగ్గిరే ఉన్నాయి అనుకున్నాగాని.

ఇప్పుడే సినిమా షుడియోకి వెళ్లాకా, నాకు ఈ సంగతి ఖుబుకుని తెలిసిపోయింది.

సినిమా షుడియో నిండా బొమ్మలూ, గుఱ్ఱాలూ, అయిడియాలూ, కిరీటాలూ, నాగేసరావూ, రామారావూ, సావిత్తిరీ, అంజలీ శేలంగీ, అయిడియాలూ సిగరెట్టులూ, రూపాయిలూ, ఇంకా మరేమో, అయిడియాలూ, పెద్ద వెలిట్రీదీపాలూ, కాఫీలు, అయిడియాలూ అవన్నీ ఉంటాయి.

మనం షుడియోకి వెళితే మనికీ బోల్డుబోల్డు అయిడియాలు వచ్చేస్తాయి. హాచ్చరపడి పోయేస్తామన్నమాట. అయిడియాలు అంటే నాకు తెలీదు. కాని నాదగ్గర బోల్డున్నాయిలే.

ఇంఖా మరేమో, మనయిల్లుకన్నా పేద్ధఅద్దాలూ, ఆబద్ధాలూ ఉన్నాయని కూడా బాబాయి చెప్పాడు.

షుడియోలో సినిమాలు చేస్తారన్నమాట.

ఇపుడు లష్మీష్టాకీసు ఉందా. అంజలి, రామారావు, శేలంగి వాళ్లందరూ అక్కడ సినీమా వేస్తారు గదా.

షుడియోలో ముందస్తుగా ఈ సినిమా వెయ్యాలిట. అక్కడ ఫది లష్మీష్టాకీసులు ఉంటాయి.

లష్మీష్టాకీసులో ఓసారే సినిమా వేస్తారుగాని షుడియోలో ఫదిసార్లో ఇరవై పదకొండు సార్లో వేస్తారులే.

ఇప్పుడు యారో యిలా కళ్లు మూసుకోకుండా తోటలో సీతకేసి చూడాలికదా. చూసి పాడాలి గదా.






పాడి నవ్వాలికదా. అప్పుడు సీత మళ్లీ నవ్వుతుందా మరి.

ఓసారి నవ్వాక దీపాలన్నీ ఆరి పేస్తారు.

మళ్లీ కాసేపుండి దీపాలు వెలిగిస్తారా. అప్పుడు మళ్లీ నవ్వు అంటారు.

ఇలా పదిసార్లు నవ్వితే యేడుపు వస్తుందిగా

అంతట్లోకీ, సీతనాన్న వచేసి హేయ్ రౌడీ రాస్కెల్ అని కోప్పడేస్తాడుగా అప్పుడేమో సీత ఝామని ఏడిచేస్తుంది.

యేం. మరి పాపం చిన్నపిల్లలికైతే ఘుబుకుని ఏడుపు రాదుగా. పదిరూపాయి లిస్తానంటే కూడా వాళ్లు యాడవరు.

రేపో మ్యాడ్రోలుకో ఓ షుడియోలో ఓ పిల్లాడిని యేడూ యేడూ అని భలేగా యేడిపించేశాడు పాపం.

అది అసలు మొగాడుకాదు. ఆడది. అనుకో. సినిమాలో ఉత్తినే ఆబద్ధం చెప్పమన్నారు పెద్దవాళ్లు.

యేం? సినిమా అమ్మ వాడి దగ్గిర కూచుని యాడవకు బాబూ అంటోంది గదా. మరి వాడు అస్సలు యాడవటం లేదుగా.

ఇహిహీ అని నవ్వుతున్నాడు గదా.

అప్పుడు ఓ లావుపాటి వాడొచ్చి ఏడవాలి పాపా ఇంచక్కా ఏడూ అన్నాడు. వాడిపేరు డైరెక్టర్ట.

ఎవరేనా ఇంచక్కా ఏడుస్తారా. అసలు ఏడిస్తే మనకి చూట్టానికి ఏడిసినట్టుంటుంది.

ఆ పిల్లాడేమో నవ్వుతున్నాడు. ఛీడూ, సినిమామ్మా యిలా మూతి

(56-వ పేజీచూడండి)



# అపం బుద్ధ

డిటెక్టివ్ సీరియల్

[గతవారం తరువాయి]

చంద్రశేఖర్ ప్రయాణంచేసే రైలు రాత్రి తొమ్మిదిగంటల నలభైఅయిదు నిమిషాలకు బయలుదేరుతుంది. ఆ సాయంత్రం నాలుగు గంటలకు నా సొంత కంపెనీకివెళ్ళి, వాటాదారుల సమావేశంలో కంపెనీ గడచిన అర్థ సంవత్సరంలో చేసిన వ్యాపారాన్ని గురించి నివేదిక సమర్పించాను. ఇంకా ఎక్కువ వ్యాపారం చేయటానికి అనుసరించవలసిన విధానాలు, చేయవలసిన మార్పులు సూచించాను. అక్కడినుంచి ఇంకో ఏజెంటుదగ్గరకు వెళ్లి మోటారుకారు భీమా చేసేవారి ఒక చిరునామా ఇచ్చాను. ఒకరిపేర పట్టాను ఆ తేదీన వ్రాయించటంకూడా జరిగింది. భీమా కంపెనీకివెళ్ళి కొన్ని ఆఫీసు ఉత్తరాలమీద సంతకాలు చేశాను.

ఈ పనులన్నీ చూసుకుని నేను ఇంటికి వెళ్ళేటప్పటికి, ఆరుగంటలైంది. భోజనం సిద్ధంగావుంది. భోం చేశాను. ఆ రోజు రెండవతారీకు. నౌకరుకు జీతం ఇవ్వాలి. ఏదో వంక చెప్పి, బ్యాంకికి వెళ్లలేదనీ, మరునాడు ఇస్తాననీ అతగాడికి చెప్పాను. అతను ఇంటిపనులు అన్నీ పూర్తిచేసి, వెళ్ళిపోయాడు. అతను వెళ్ళేసమయానికి నేను మంచంమీద పడుకుని, ఆ సాయంత్రం పత్రిక చదువుకుంటున్నాను. నేను బయటికి ఎక్కడికీ వెళ్ళననీ, రాతపని వుందనీ అతడితో అంతకుముందే చెప్పాను. మంచంమీదినుంచి లేచి, కొన్ని వ్యాపార సంబంధమైన ఉత్తరాలు వ్రాశాను. వాటన్నిటిమీద ఆ రోజు తేదీ వేశాను.

అక్కడినుంచి లేచి కిందికివెళ్ళి, నాలుగడుగులువేసి ఆఫీసు కాపలామనిషిని పిలిచాను. నా ఆఫీసుగదికివెళ్ళి బల్లమీదవున్న ఊదారంగు భీమాపట్టికల పుస్తకం తీసుకురమ్మనీ, అది నాకు వెంటనే కావలసివచ్చిందనీ చెప్పాను. అతను మేడమీదికివెళ్ళి ఆ పుస్తకంకోసం వెదికి, కిందికివచ్చి కనబడలేదని చెప్పాడు. ఆ పుస్తకం అక్కడ వుంటేగా కనపడటానికి! రాత్రిపూట అక్కడికి ఎవరు వచ్చిందీ అతను డైరీలో వ్రాసి, మరునాడు జనరల్ మేనేజరుకు చూపించాలి. అక్కడికి నేను వెళ్ళినట్టు కాపలామనిషి డైరీలో నా పేరు వ్రాసి వుండటమే నాకు కావలసింది. చేతిగడియారం చూసుకున్నాను. ఏడుగంటల నలభైఅయిదు నిమిషాలైంది.

తుమ్మలపల్లి సీతారామారావు

ఇంటికివెళ్ళి తలుపులు తెరిచానో లేదో, టెలిఫోనుగంట వినపడింది. రిసీవర్ తీశాను.

"ఊదారంగు," అన్నది కోమలం.

"ఊదారంగేనా?", అని బదులుప్రశ్న వేశాను.

"ఔను; ఊదారంగే," అంది ఆమె.

ఊదారంగు సూటు వేసుకున్నాడు, చంద్రశేఖర్. ఈ విషయం తెలుసుకోవటం అవసరం. మేము ఊహించినట్టుగానే అతను ఊదారంగు సూటే ధరించాడు. అతడి ప్రయాణానికి అవసరమైన వస్తువులు పళ్లు తోముకునే బ్రష్, పేస్టు కొనటానికి ఆమె స్టోర్సుకి వెడుతుందని నాకు తెలుసు. అక్కడికి టెలిఫోన్ చేసి ఆమెను పిల్చి అతడు వేసుకున్న సూటురంగును మరోసారి అడిగి నిర్ధారణ చేసుకున్నాను. నా పాదం దగ్గిరనుంచి మోకాలివరకూ దూదివేసి, తెల్లబాండేజి గుడ్డతో కట్టుకట్టాను. పెట్టెలో వున్న ఊదారంగు సూటు బయటికితీసి తొడుక్కున్నాను. కాలికి కట్టిన గుడ్డను టేపుతో బాగా బిగించాను. కాలికి బూట్లు తొడిగాను. దెబ్బతగిలిన కాలికి బూటు లేసుబిగించలేదు. ఇనప చేతికర్రకు పిడిదగ్గర గుడ్డ చుట్టి, దానిని కోలకర్రగా తయారుచేశాను. కొయ్యతో చేసిన మరొక కోలకర్ర సంపాదించాను. గదిలో బల్లదగ్గరకు వెళ్లి, నా సెక్రటరీ ఇంటికి టెలిఫోను చేసి, నేను ఆఫీసులో మరిచిపోయిన భీమా ప్రీమియం రేట్ల పుస్తకం విషయం అడిగాను. అప్పుడు ఎనిమిది గంటల నలభై నిమిషాలు అయింది. నేను లేనప్పుడు ఎవరైనా టెలిఫోను చేస్తే తెలియ

టానికి, రిసీవర్ క్రింద ఒక కార్డు పెట్టాను. గంట మోగితే ఆ కార్డు కిందపడుతుంది. నేను తొడుక్కున్న కోటు చాలా బిగువుగా వుంది. ప్లాస్టిక్ చట్రంలో అమర్చిన నల్ల అద్దాల కళ్లజోడు పెట్టుకున్నాను. అతను కూడా సరిగా ఇలాంటికళ్లద్దాలేవాడతాడు. వీధి గుమ్మం తాళం వేసే చోట కూడా ఒక కార్డు పెట్టాను. ఎవరైనా నా కోసం వచ్చి తాళం కదలించి, గంట మీట నొక్కితే అ కార్డు కింద పడుతుంది.

బంగళా నుంచి బయటికి వచ్చి కారులో బయలు దేరాను. పార్కు దగ్గరగా వున్న రోడ్డుమీద కారు ఆపాను. ఎక్కువదూరం నడవలసిన అవసరంగాని, జనసంచారంగాని లేని స్థలం చూసి కారు నిలిపాను. కట్టుకట్టిన కాలితో ఎక్కువ దూరం నడవటం కూడా కష్టమే. బంగళా దగ్గిరలో రోడ్డు మలుపు తిరగగానే రోడ్డుకి కొద్ది దూరంలోనే ఒక పెద్ద చెట్టు వుంది. అక్కడ బాగా చీకటిగా వుంది. చెట్టుదగ్గిర వున్నవాళ్లు రోడ్డుమీదికి కనపడరు. నేను మెల్లిగా చెట్టుకిందికి నడచి వెళ్లాను. బహుశా రెండు నిమిషాలు కనిపెట్టుకుని వుండి వుంటాను. అక్కడ ఆ కొంచెం సేపు వుండటంకూడా నాకు కష్టమనిపించింది. వస్తున్న మోటారు కారు దీపాల కాంతి కనపడింది. మలుపు తిరిగింది మోటారుకారు. ఆమే కారునడుపుతూంది. ఆమె ప్రక్కగా కారు తలుపు ఆనుకుని అతను కూచున్నాడు. అతడి వొళ్లో ఒక కోలకర్ర వుంది. నేను నిలుచున్న చెట్టుకు ఎదురుగా వచ్చి రాగానే కారు ఆగిపోయింది. మేము నిర్ణయించింది సరిగా ఆ స్థలమే. ఆ పైన జరగవలసినపని చాలా సునిశితమైన వ్యవహారం. ఒక నిమిషంపాటు అతణ్ణికారులోనుంచి కిందికి దిగేట్టుచేయాలి. కారులో వెనుక వైపున అతని పెట్టెలు, సామాన్లు అన్నీ ఉన్నవి. వాటివెనుకకు నేను చేరాలి. అతని కాళ్లు రెండూ మామూలుగా వుంటే, అతణ్ణి కారులోనుంచి కిందికి దిగేట్టు చేయటం ఏమంత కష్టం కాదు. కాలికి కట్టుతో, కోలకర్ర సహాయంతోగాని నడవలేని మనిషిని కారులోనుంచి దింపటంలోనే అసలు చిక్కంతా వుంది.

ముందు ఆలోచించి తయారుచేసిన పథకాన్నే ఆమె అనుసరించింది.

“నా చిన్న డైరీపర్సు కనపడదేం?” అంటూ కోమలం తాను తొడుక్కున్న ఉలెన్ బనియన్ జేబులు తడిమి చూసుకుంది.

“నీవు అసలు తీసుకొచ్చావా?” అన్నాడతను.

“తీసుకొచ్చాననుకున్నాను. వెనుకవైపు కూర్చునేచోట చూడండి. ఒకవేళ అక్కడేమైనా పెట్టానేమో.”

“అక్కడన్నీ నా సామాన్లే.”

“అది ఏమైందో తెలియటంలేదు.”

“పోనీలే. మనకు ఆలస్యమౌతూంది ఇదుగో ఈ అయిదురూపాయల నోటూ తీసుకో దీనితో ఇంటికి చేరతావు.”

“హాలులో సోఫామీద పెట్టి మరిచిపోయివుంటాను.”

“ఇంటిదగ్గిర మరిచిపోతే, ఇప్పుడుదాన్ని తీసుకురావటానికి వెడతానంటావా?”

ఈ క్లిష్టఘట్టంలో ఏం చేయాలో ఆమెకు దాదాపు నలభై సార్లైయినా చెప్పేవుంటాను. కిందికి దిగి దగ్గిరేకాబట్టి ఇంటికెళ్ళి తనపర్సు డైరీ ఉన్న చేతిసంచి తీసుకొని రమ్మని అతడితో చెప్పాలి. అతను, తననే వెళ్ళి తెచ్చుకోమనకుండా, దిగివెళ్లిరమ్మని అతణ్ణి తొందర చేయాలి. ఏమీ మాట్లాడకుండా మొండికేసి కూర్చోవాలి. కారు కదపకూడదు. రైలు బయలుదేరే వేళ కావచ్చిందన్న చిరాకుతో ప్రాణంవిసిగి అతడే దిగేట్టు చేయాలి. నేను చెప్పిన పద్ధతిలోనే ఆమె సంచరించింది.

నాచేతి సంచి కావాలి. “అందులో నాపౌడరు, రంగు డబ్బాలు ఉన్నవి.”

“ఏమిటి ఈమూర్ఖత్వం? వేళకు మనం రైలు అందుకోవాలని నీకు తెలియదా? ఇది కారు ప్రయాణంకాదు, మన ఇష్టంవచ్చినపుడు బయలుదేరటానికి. తొమ్మిదిగంటల నలభై అయిదు నిమిషాలకు రైలు బయలుదేరుతుంది. వేళౌతూంది. కారు కదిలేవిధం చూడు”

“మీరు ఇలా మాట్లాడతారనుకోలేదు.”

“ఇప్పుడు ఏమన్నాను?”

“ఎలాగైనా, చేతిసంచి తెచ్చిపెట్టాలి.”

అతను చాలా చిరాకుపడ్డాడు. విసుక్కున్నాడు. కోలకర్రల చప్పుడు కారుపక్కన వినిపించింది. అతను ఆ కర్రల సహాయంతోనే నడిచివెళ్ళాడు. అతను మలుపు తిరగగానే, నేను కారుదగ్గిరకువెళ్ళి ముందు తలుపు తెరిచి, ఎవరికీ కనపడకుండా సామాను వెనుకవైపున ఇరుక్కున్నాను. వెనుక కూర్చునే చోట అతని పరుపుచుట్ట, కాగితాలసంచి వున్నవి.

“బాగా నటించానా?” అంది కోమలం.

“అద్భుతంగా నటించావ్! అయితే కమలాక్షిని ఎలా వొదిలించుకోగలిగావు?” అని అడిగాను.

“క్లబ్బులో ఏదో పార్టీ జరుగుతూంది. ఆమె అక్కడికి వెళ్ళాలి. అందుకని ఆమెను ఏడుగంటలకే బస్సు దగ్గిరకు తీసుకొనివెళ్లి దింపివచ్చాను.”

“సరే, మీ బంగళా ఎక్కువదూరం లేదు. అతడు ఈపాటికి తిరిగి వస్తూవుంటాడు. కారు వెనుకకు నడిపించు. ఆయన కారులో ఎక్కగానే, చిరాకుపోయేట్టు శాంతింపజేయాలి. తెలిసిందా?”

“సరే.”

ఆమె కారు కొద్దిదూరం వెనుకకు నడిపించింది. అతనిదగ్గరగానే ఆపింది. చంద్రశేఖర్ కారులోఎక్కాడు. భార్యాభర్తలు వొంటరిగా మాట్లాడుకుంటున్నప్పుడు వాళ్లకి కనపడకుండా పక్కన వుండటం చాలా కష్టం. కారులో ఎక్కగానే, కోమలం అతణ్ణి కొంచంసేపు పొగిడింది. కష్టం కలిగించినందుకు ఏమీఅనుకోవద్దని లాలనగా మాట్లాడింది. ఇరుగు పొరుగు వాళ్ళను గురించి కొంచెంసేపు ఏవేవో మాట్లాడుకున్నారు.

తరువాత వాళ్లసంభాషణ అతడు వెళ్లబోయే సమావేశంమీదికి మరలింది. అక్కడ ఎక్కడికైనా వెళ్ళవలసినపుడు టాక్సీలో వెళ్ళమనీ, అనవసరంగా డబ్బు ఖర్చవుతుందని సందేహించవద్దనీ, ఆమె అతడికి నచ్చచెప్పింది. నిజంగా చంద్రశేఖర్ సమావేశానికి వెడుతున్నట్టుగానే అతడికి ఇచ్చకపుమాటలు ఏవేవో చెప్పింది కోమలం. స్త్రీ ఒక వింతస్వభావంగల సృష్టివిశేషం కదా అనిపించింది నాకు.

కారు వేగంగాపోతూంది. సామాను వెనుకగా నక్కివున్న నాకు మేము ఎంతదూరం వెళ్ళిందీ తెలియలేదు. కటికిచీకటిగా వున్న ఆరోడ్డుమీద జనసంచారమే లేదు. మేము మొదట నిర్ణయించుకున్న ప్రదేశం సమీపించగానే, మోటారుకారు హారన్ రెండుసార్లు మోగించింది. సంకేతస్థలం చేరినట్టుగా అదే మాకు గుర్తు. కారును నడిపేప్పుడు మధ్య మధ్య ఆపటంగాని, కుదుపులు కలిగించడంగాన్ని జరుగలేదు. అలాజరిగితే, అతను వెనుకకు తిరిగిచూడటం సంభవించవచ్చు. మేము నిర్ణయించుకున్న స్థలానికి రైలుస్టేషన్ అరమైలుదూరంలో వుంది.

కనబడకుండా, అలికిడి కాకుండా అమాంతం పైకిలేచి, చేతితో అతనినోరు ఘట్టిగా మూసివేశాను. రెండవ చేత్తో అతడి తలకాయను ఘట్టిగాపట్టుకుని, పట్టు విడవకుండా, ఊపిరాడకుండా మెలితిప్పివేశాను. అతడిచేతిలోకాలుతున్న చుట్టను తీసి ఆమెకు ఇచ్చాను. ఆమె దాన్ని జాగ్రత్తపరిచింది. కోలకర్రతీసి అతని గడ్డానికి పోటేపెట్టాను. రెండేరెండు నిమిషాల్లో అతడి శవాన్ని కారు వెనుకభాగంలో పడుకోపెట్టాం. శరీరంమీద దెబ్బలుగాని, రక్తం మరకలుగాని లేవు. కోలకర్ర ముక్కుకు తగలటంవల్ల అక్కడ కొద్దిగా



# అపరబుద్ధి



నీరుమాత్రం కారింది. అంతే.

* * *

నిర్ణీత సమయానికి, పథకం ప్రకారం ఏదైనా హత్యచేయవలసిన సమయానికి అవసరమైన ధైర్యం మాకు సమృద్ధిగా లభ్యమైంది. పని జరిగిపోయింది. తరువాత కర్మకాండ ఎలా జరగాలనే ఆలోచనలో పడిపోయాం. తన చేతిలోవున్న అతగాడి చుట్టపీకను అవతల పారవేయటానికి ఆమె సిద్ధపడింది. అలాచేయవద్దని ఆమెకు చెప్పాను. అతను ఇంటిదగ్గర వెలిగించిన చుట్టను నిప్పు ఆర్పి అలాగే జాగ్రత్తపరిచాను. అతడి శరీరాన్ని తాళ్ళతో గట్టిగా బిగించి కాళ్లు, చేతులు, మెడవరకు కట్టివేశాను.

"మనం స్టేషనుదగ్గరకు వచ్చాం. ఇక్కడ ఆపనా?" అంది కోమలం.

"ఊఁ. మనం సిద్ధంగానే ఉన్నాంకదా" అన్నాను.

స్టేషనుకు కొద్దిదూరంలోవున్న రోడ్డు ప్రక్కన ఆమె కారునిలిపింది. కారు ఎక్కడ నిలపటమనేది కొన్ని నిమిషాలవరకూ ఒక సమస్య అయింది. స్టేషన్లో కార్లు ఆగేచోటికి వెడితే అక్కడి కూలీలు సామాన్లకోసం వచ్చి, తలుపు తెరిచి చూస్తారు. అందుకని వున్నచోటే కారు నిలపటంమంచిదని నిర్ణయించాము.

ఆమె కారులోనుంచి దిగి కాగితాల సంచి, చేతి సంచీ పట్టుకుని నిలుచుంది. కారు తలుపులు బిగించి, కోలకర్ర పట్టుకుని కారులోనుంచి నేనుకూడా బయటికి వచ్చాను. కారు తలుపుకు ఆమె తాళం వేసింది. అతడిని వెనుక సీటులో అడుగున కనబడకుండా పడుకోపెట్టాము. పైన గుడ్డ కప్పివుంది. గుర్తుపట్టటానికి, అనుమానించటానికి ఏమాత్రం వీలు లేదు.

ఆమె చేతిసంచి, కాగితాల సంచి పుచ్చుకుని ముందు నడుస్తూంది. కట్టుకట్టిన కాలితో కోలకర్రల సహాయంమీద మెల్లగా ఆమె వెనకనే నేను నడిచివెళ్ళాను. ఎవ్వరూనన్ను గుర్తుపట్టటానికి వీలులేకుండా ఆమె వెనుక కొంచం దూరంలో వున్నాను. కూలీవచ్చి ఆమె చేతిలో సంచులు రెండూ తీసుకుని "ఏ రైలు ఎక్కాలి?" అని అడిగాడు.

"ఎక్స్‌ప్రెస్" అని ఆమె జవాబు చెప్పింది.

అతడు వెనుకకు తిరిగైనా చూడకుండా త్వరగా నడిచి వెళ్ళాడు.

మేము స్టేషన్‌లోకి వెళ్ళాము. నన్ను ఆనుకుని మెల్లగా నడవమని ఆమెతో అన్నాను. నల్లకంటి అద్దాలు పెట్టుకున్నాను. నెత్తిన ఉన్న టోపీ ముందుకు లాగాను. చుట్టవెలిగించి కాల్చటం ఆరంభించాను. ఎదటివాళ్ళకి నాముఖం వైపు పరీక్షగా చూడటానికి వీలులేకుండా, నోటికి అడ్డంగా కాలుతూన్న చుట్టవుంది. నా చూపులన్నీ నేల మీదే ఉన్నవి. ఎవరికీ నాముఖంలోకి చూసే అవకాశమే లేదు.

పక్కనుంచివచ్చి రైలు ప్లాటుఫారంమీద ఆగింది. సామాన్లు కూలి రైలులో పెట్టాడు. కూలిడబ్బులకోసం ఎదురుచూస్తున్నాడు. ఇతరసామాన్లతో ఇంకా ఇద్దరు కూలీలు వచ్చారు. అతడికి డబ్బులుఇవ్వటం ఆలస్యం అయితే, అంతా నన్ను చూస్తారు. నన్ను ఎవ్వరూ పరీక్షగా చూడకుండా రైలు పెట్టెలో ఎక్కాలి. కూలీ నాదగ్గిరికివచ్చి పెట్టెలో ఎక్కించటానికి నా చెయ్యి పట్టుకున్నాడు. వెంటనే ఆమె అతగాడిచేతిని వొదలించి నా చెయ్యి పట్టుకుని నన్ను రైలు పెట్టెలో ఎక్కించింది. ఆమె ప్లాట్‌ఫారం మీద నిలుచుంది. కొంచంసేపు నాతో మాట్లాడి, ఆమె రెండోవైపు ప్లాటుఫారం మీదికి వచ్చింది. మూడు మొదటితరగతి పెట్టెలనిండా ప్రయాణీకులు ఉన్నారు. అందరు రాత్రి నిద్రపోవటానికి పక్కలు పరుచుకున్నారు. రైల్వేకూలీలు అందరూ పెట్టెలు తీసుకొనివెళ్ళే తొందరలో వున్నారు. చుట్టను పళ్ళసందున బిగించి పట్టుకున్నాను. నిజానికి ఎవ్వరూ నన్ను పరీక్షగా చూడడంలేదు. నా చూపులు నేలమీదేఉన్నవి. నేను ఎవరినీ ముఖంలోకి చూడలేదు. నా చేతిలోఉన్న కోలకర్రలు చూడగానే, నేను లోపలికి రావటానికి అడ్డంగావున్న పెట్టెలను అవతలికిసర్ది దారి చేశారు. వాళ్ళకి వినబడీ వినబడనట్టుగా నాకృతజ్ఞత వెల్లడిస్తూ తలఊపాను.

ఆమె ముఖంలోకి ఒకసారి చూశాను. అవతలివైపు ప్లాటుఫారంమీద ఆమెవుంది. ఏదోపొరపాటు జరిగివుంటుం దనుకున్నాను. ఆ ప్లాటుఫారంమీదే దూరంగా చీకటిలో వొంటరిగావున్న ఒకవ్యక్తి సిగరెట్టు కాలుస్తూ కనిపించాడు. ఒకపక్కగా అతడి వైపు వీపు వుంచి, అతడికి కనపడకుండా ఆమెను దగ్గరకు రమ్మని చేతితో సైగ చేశాను.

ఆమె నా పెట్టె దగ్గిరికి వచ్చి, కిటికీలోనుంచి తనచేతిని జాపి నాచెయ్యి పట్టుకుంది. ఏమి చేయాలని అడగటానికి ఆమె నా ముఖంలోకి చూసింది. కారు, కారు, అని రెండుసార్లు పలికాను. ఆమె గ్రహించింది.

రెండు నిమిషాలు ఆగి, "నేను వెడతాను," అంది ఆమె.

నేను తల ఊపాను. చేతిగడియారం వైపుచూసి ఆమెవైపు దానిని త్రిప్పాను. రైలు ఏడునిమిషాలలో బయలు దేరుతుంది. ఆమె చిరునవ్వుతో వెళ్ళిపోయింది.

కిటికీ దగ్గిర వొంటరిగా కూచుని ఆలోచిస్తున్నాను. చీకట్లో దూరంగా నిలుచుని సిగరెట్టు కాలుస్తున్న వ్యక్తి ఇంకా అక్కడే వున్నాడు. నాపక్కన వున్న ప్రయాణీకుడు మా ఇద్దరి సంభాషణ విన్నాడు. ఆడవాళ్ళ స్వభావాన్ని అతడు చక్కగా వర్ణించాడు. నేను నవ్వి వూరుకున్నాను. అతడు ఇంకా మాట్లాడుతూనే వున్నాడు. రైలు కదిలింది. అప్పుడు నాకొక అభిప్రాయం స్ఫురించింది. నేను కుంటివాడిలా సంచరించాలి. రైలు టిక్కెట్టుకోసం వెతుకుతున్నట్టుగా నాజేబులన్నీ తడుముకున్నాను.

"ఏమైనా పోయిందా?" అన్నాడు అతడు.

"టిక్కెట్టు కనపడలేదు," అన్నాను.

"నాటికెట్టు వుందా? ... ఆ వుందిలే," అంటూ ప్రక్కనవున్న ప్రయాణికుడు తన జేబు తడుముకున్నాడు.

"టిక్కెట్టు నాజేబులో పెట్టమని ఆమెతో చెప్పాను. మరిచిపోయి కాగితాల సంచిలోపెట్టి వుంటుంది. సరే సామాన్లు వెదుకుతాను," అనుకున్నాను నాలో నేను. సామాన్లు వుంచినచోటుకు వెళ్ళి, అక్కడ చేతి సంచిలో వున్న టిక్కట్ తీసుకుందామని పెట్టె చివరికి వెళ్ళాను.

అప్పుడే రైలు వేగంగా నడవడం ప్రారంభించింది. ప్లాటుఫారం దాటిన తర్వాత కొంతదూరంలో ఒక సంకేత స్థలం ఏర్పాటు చేసుకున్నాము. నేను గుమ్మందగ్గర నిలుచుని చుట్ట వెలిగించాను. ఆ ప్రదేశం సమీపించగానే, చేతిలో ఉన్న ఒక కోలకర్రను మెల్లగా నేలమీదికి జారవిడిచాను. రెండో కర్రను చేతితో పట్టుకొని ఒక కాలు బయటికి పెట్టి, తరువాత రెండోకాలును కూడ దగ్గరకు తీసుకుని పట్టాల అవతలికి జారాను. మేమునిర్ణయించుకున్న ప్రదేశంలో నేలమీద పడ్డాను. (ఇంకావుంది)



# "గరబం"

చిన్నపిల్లల్ని మనం ప్రేమించాల్సిందే - కాని మిక్కిలీ గారాం పెట్టడం ఒక్కొక్కప్పుడు మనం అనుకోని చిక్కుల్ని తెచ్చిపెట్టి యిరకాటంలో పడేస్తుంది. ఈ మధ్యనే జరిగిన ఒక సంఘటన వివరిస్తాను.

అతి సన్నిహిత బంధువొకరు కాలం చేశారు. ఆయన ఆస్తిపాస్తులు, చుట్టపక్కాలు, కాగితం కరామతులు, లాటి వ్యవహారాల్లో ఎంతలేదన్నా నాకు కూడా కొంత బాధ్యత ఉందనే చెప్పాలి. అంచేత ఆయన మరణవార్త వినగానే చటుక్కున అక్కడికి వెళ్లాల్సివచ్చింది.

ఉదయం 7 గంటలికి రైలు. అందులోను మా వూళ్ళో ఆ ట్రైనే పోగదది. శీతాకాలమేమో! లేచేసరికి గడియారం 6-30 చూపించింది. వెంటనే ముఖం కడుక్కొని స్టేషనుకి బయలుదేరాను. రైలు టైమునుగూర్చి దర్యాప్తు చేశాను. ఇంకో పదినిముషాల్లో ఒస్తుంది బండి. పోనీ కాఫీ పుచ్చుకొని వెడదామని అక్కడే ఉన్న ఆనందభవనంలో అడుగుపెట్టాను. ఒక ప్లేటు ఇడ్లీకి ఆర్డరిచ్చాను.- అంతలోకే మా యింటినుంచి-మా యిల్లు స్టేషనుకి మహా ఉంటే 25 గజాలుండవచ్చు - చిట్టిబాబు - అంటే మా అబ్బాయి 9 ఏళ్లవాడు, నా కోసం ఆత్రంతో పరుగెత్తుకు రావటం చూచాను. అదేపనిగా వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు వాడు.

నేను అనుకొన్నంత పనీ అయింది. 'ప్రొద్దున్నే వాడు లేవడు. నన్ను ఒక్క క్షణం కూడా విడిచిపెట్టి ఉండని వాణ్ణుంచి ఏలాగో తప్పించుకు ఒచ్చేశాం; కాస్సేపట్లో రైలొచ్చేస్తుంది. ఫరవాలేద'నుకున్నాను. మరి వీడికింత తొందరగా ఎలా మెలుకువొచ్చిందో తెలియదు. ఇలా ఆలోచిస్తూనే ఉన్నాను. చిట్టిబాబొచ్చి బల్లమీద కూర్చున్న నన్ను చుట్టేశాడు.

వాణ్ణి ఎలా వదిలించుకోవాలో నా కొక సమస్యగా పరిణమించింది. "ఇడ్లీ తింటావా బాబూ!" అని బతిమాలాను. 'ఊహూఁ' అన్నాడు. ఏడుపువల్ల మొహం ఉబ్బి, కళ్ళమ్మట నీళ్లు చారికలు కట్టాయి. 'పోనీ కొంచెం కాఫీ యిప్పిస్తా' అంటూ సర్వర్ని పిలిచాను. ఊహూఁ అంటే ఉహూఁ అంటూ కూర్చున్నాడు. చిట్టిబాబుకి పిప్పరమెంట్లంటే ప్రీతి. బాగా గుర్తొచ్చిందను కుని ప్రక్కనే ఉన్న కిళ్ళీకొట్టులో ఒక బిళ్లల ప్యాకట్టు పుచ్చుకొన్నాను. "నే నిప్పుడే ఒచ్చేస్తాను. ఆ బిళ్లలు పుచ్చుకుని, జాగ్రత్తగా ఇంటికెళ్లు మా బాబువి కదూ!' అని బతిమాలుతున్నాను. ఇంతలోకే ఎప్పుడొచ్చేసిందో రైలు ఇట్టే ఊడిపడింది. గంట కూడా కొట్టారు. చిట్టిబాబు బిళ్ళల ప్యాకెట్టు చేతపట్టుకుని, బుక్కింగు ఆఫీసుకు చేరుకున్న నన్ను ఒక్క అంగలో అనుసరించాడు. వెళ్లవలసిన ఊరికి టిక్కట్టు తీసుకున్నాను. గార్డు బిగులూదాడు. పచ్చజెండా రెపరెపలాడుతోంది. గుండెలు బ్రద్దలయ్యేటట్టు 'టూరంటూ' ఇంజను కూతపెట్టింది. ఒక్క లగువు బిగువుగా లాగింది. బండి కదిలింది. నేను పెట్టెకమ్మి పట్టుకుని కదిలే బండి ఎలాగో ఎక్కగలిగాను.

పాగావ్ర సత్యానందరావు

బండి సాగింది. ప్లాటుఫారంకేసి చూస్తున్నాను. చిట్టిబాబు అలాగే ఉన్నాడు ఏడుస్తూ. ఏలాగైనా నాతో రావాలని వాడి పట్టు. నాకు స్పష్టంగా కనిపిస్తోంది. బిళ్ళల ప్యాకెట్టు నేలకేసి కొట్టేశాడు. చిందరవందరగాపడి చితికిపోయాయి ప్యారీకంపెనీ వారి స్ట్రాంగు పిప్పరమెంట్లు. అరెరే! వాడు పరుగెత్తుకొంటూ ఒచ్చేస్తున్నాడే! కొంప తీసి బండిక్రిందకొనీ పడుకదా! రైలు, వేగం హెచ్చిస్తోంది. చిట్టిబాబుమీది ఆప్యాయం కోపంగా మారుతోంది. నిజంగా రైలుకనక ఏ కారణంవల్లనైనా ఆగడం తటస్థిస్తే అక్కడే వాణ్ణిపట్టుకుని చావగొడదామన్నంత ఆగ్రహం కలిగింది మనస్సులో. స్టేషను దాటిపోయింది. ఒకటీ, రెండూ, మూడు రైక్కలు కూడా దాటిపోయాయి. ఇంకా నాదృష్టి స్టేషనువైపే ఉంది. బాబు కనిపించడంలేదు. అయినా నేను చూడ్డం మానలేదు. రైలు, వేగం ఇంకా హెచ్చించింది. చిట్టిబాబు నాఆలోచనలోనే ఉండిపోయాడు.

## 2

అరగంటటయిము పట్టింది రైలు నన్ను నిర్ణీత ప్రదేశం చేర్చడానికి. స్టేషనులో దిగిపోయాను. జట్కా ఎక్కాను. బంధువులింటిముందు దిగాను. మూర్తీభవించిన శోకదేవతలా ఉన్న ఆగృహం భోరుమంటూ నన్ను పిల్చినట్టయింది. నా గుండెలింకా వేగంగా కొట్టుకొంటూనే ఉన్నాయి. మనస్సింకా వెనకనే ఉంది, నలభై నిముషాలు వెనక-ఇరవై మైళ్లు వెనక-మా ఊరి ప్లాటుఫారంమీద-నాకోసం మారాం పెడుతూ రైలుతో సమంగా పరుగెడుతున్న చిట్టిబాబుమీద. ఏవో చుట్టాన్ని పరామర్శించాను. పోయిన ప్రాణితాలూకు కుమార్తెలు, జ్ఞాతులూ, కంట తడిపెడుతూ విలపిస్తున్నారు. సంస్కారాదులప్పటికే పూర్తిఅయిపోయాయి. లోపల కొందరు బంధువులు ఏవో ఏర్పాటులు గురించి తర్కించుకొంటున్నారు. నేను యాంత్రికంగానే లోపలికి నడిచాను. కాలం మహాభారంగా నడుస్తున్నట్టనిపించింది నాకు. ఎక్కడ

# ★ "గారాబం" ★

చూచినా దుఃఖమూ, ఆవేదనా ఎదురౌతున్నాయి.

మధ్యాహ్నం రెండుగంటలకి భోజనాలయిపాయి. పరామర్శకి వచ్చిన పెద్దలు కొందరు నన్ను వేరే ప్రక్కగా పిలిచి కొన్ని ప్రశ్నలు వేశారు. వారితో మాట్లాడ్డంలో నేను ఇంటి దగ్గరే ఊహించుకు, బయలుదేరినట్టు పోయిన వారి తాలూకు స్థిరచరాస్తుల పంపకాలూ, కొడుకులు లేకపోవడంవల్ల ఆయన శ్రాద్ధ కర్మాదికాలు నిర్వర్తించే గురుతర భావాలు, ఇంకా ఎన్నో ఇతర వ్యవహారాలూ చర్చకి వచ్చాయి. సాయంత్రం నాలుగు గంటలయ్యే దాకా తీవ్రమయిన వాదోపవాదాలు జరిగాయి వారిమధ్య. నేనూ నాకు తోచిన ప్రతిపాదన లుంచుతూవచ్చాను.

ఆరుగంటలయింది. అందరిదగ్గరా సెలవు పుచ్చుకోవా లనిపించింది. తిరిగి మా ఊరు వచ్చే బండికి ఒకగంట వ్యవధి ఉంది. ఇంటికి ఒచ్చెయ్యాలి, విధిగా వచ్చి తీరాలి. కాని అక్కడ ఎవరూ నన్ను వదిలేటట్టు లేరు. అక్కణ్నుంచి రావడం పెద్ద చిక్కుగానే కనపడింది. ముందు కుమార్తెల దగ్గరి కెళ్ళాను. 'అమ్మా! వెళ్ళొస్తా!' అన్నా. వాళ్ళు మళ్లీ భావురుమన్నారు. వయస్సు కడచినకొద్దీ మనం అనుకొన్నట్టుగా పెద్దవారిమీద పిన్నవారి ప్రేమాతిశయాలు క్రమంగా తగ్గిపోతాయి అనడం నిజంకాదేమో అని వారి దుఃఖం ఋజువుపరుస్తోంది. పాపం! ఆ తండ్రి బిడ్డల్ని ఎంత గారంగా పెంచాడో! వారిమీద ఎంత మమకారం పెట్టుకొన్నాడో! రేపటి నుండి వీళ్ళ గతేమిటనిపించింది నాకు. వాళ్లు మరీమరీ ఉండమని ప్రాధేయపడ్డారు. 'మళ్లీ వస్తాను కాని ఈవేళ పట్టుపట్టకండి' అని వాళ్లని బతిమాలాను. నాకు చాలా జరూరు పని ఉందన్నాను. నా పిచ్చికాని, నా జరూరుపని వాళ్లకెలా చెప్పగలను? చెప్పినా వాళ్లు వినే పరిస్థితిలో ఉన్నారా? విన్నా నాఅవస్థ అర్థంచేసుకోగలరా? తెగించి లేచి పెద్దలదగ్గిర సెలవుపుచ్చుకుని మళ్లీ తప్పక ఒస్తానని మరీమరీ చెప్పి అక్కణ్నుంచి బయటపడేసరికి తలప్రాణం తోకకొచ్చింది.

స్టేషను చేరుకొన్నాను. రైలు సకాలంలోనే ఒచ్చింది. టిక్కెట్టు తీసుకుని బండెక్కాను. రైలు కదిలింది. నా మెదడులో ఆలోచనలు మెదులుతున్నాయి. నీలినీడల్లాగ ఆప్తులు కదులుతున్నారు. ఊహ వెనక్కి మళ్లుతోంది. నిన్న సాయంత్రం అనగా ఒచ్చిన టెలిగ్రాం; నన్ను హఠాత్తుగా ఆవేదనలో ముంచిన విషాదవార్త; కదలనని పట్టు పట్టినట్టు బహుభారంగా విచిత్ర యోచనల్లో ముంచి తేల్చిన కాళరాత్రి; ప్రొద్దుటి ప్రయాణం-కాఫీహోటేలు-ఎదురుగా రైలు స్టేషను-రైలుతో సమంగా ప్లాటుఫారంమీద పరుగెడుతున్న చిట్టిబాబు-అమాంతంగా ఊడిపడ్డ రైలు-చెల్లాచెదరై చితికిపోయిన పిప్పరమెంట్లు-చెవులు దద్దరిల్లేలా వాడి ఏడ్పు-మరో ప్రక్క ఇంజను గావుకేక-పరంపరలుగా నాలో పెనవేసుకొన్న భావగతులు. మొదటలో ఆప్యాయత, లాలన, బుజ్జగింపు—తరవాత బెదరింపు, హెచ్చరిక—తుదకి చరమస్థాయికి చేరుకుని వాణ్ణి చావగొడితే బాగుండునన్నంతటి కోపం-గంటైనా కాలావధి లేక మళ్ళీ నాలో నాకే మార్పు-పరాస్తచిత్తంతో చేసిన పరామర్శలు—ఒక మూల తండ్రిపోయి, ఏడ్చేకొమార్తెల గోడు-వారి వెనకనే ఆస్తిపాస్తులగూర్చిన గుసగుసలు—ఇంకా లోపలికెడితే తర్కవితర్కాలు-వివిధ రంగుల్లో మెరిసే విచిత్ర మనస్తత్వాల విపరీత ప్రకృతులు-పరుగెత్తే రైలు వేగానికి శ్రుతి కలుపుతూ నన్ను ఊపివారేస్తున్నాయి.

## 3

మా ఊరొచ్చింది. రైలు దిగాను. రైలు కన్నామించిన వేగంతో రెక్కలు కట్టుకుని ఇంటిదగ్గర వాలాలన్నంతగా ఆత్రపడ్డాను. గడప మెట్లెక్కుతున్నాను. ఒకటి, రెండు, మూడు. గుమ్మందాటి మయంహాలులో ప్రేలాడగట్టబడి, నా మనస్థితిచూచి వింతగ నవ్వుతున్నట్లూగుతున్న లాంతరుమీది నిర్లక్ష్యంతోనే గట్టిగా శ్రీమతిని కేకపెట్టాను. ఆమెకి హడలినంతపనయింది. 'అప్పుడే

(48-వ పేజీ చూడండి)

### "నే..న..ం..టే..?"

శ్రీరామచంద్రమూర్తికి ఒక నాటి రాత్రి 'అహమ్' (నేను) అంటే యేమిటో తెలుసుకోవాలనిపించి, రాత్రికి రాత్రే పాన్పుపైనుంచి లేచి వశిష్ఠుడిదగ్గరకు పరుగెత్తాడు. బాగా రాత్రయిందేమో ఆశ్రమంలో వశిష్ఠ మహర్షి నిద్రిస్తున్నాడు. శ్రీరాముడు తలుపు తట్టాడు.

"ఎవరు?" అన్నారు వశిష్ఠుడు లోపల్నుంచి.

"నేను నేను!" అన్నాడు శ్రీరాముడు ఆత్రంగా.

వశిష్ఠులవారికి ఈ గొంతు చప్పున అర్థంకాక—

"నేనంటే?" అని అడిగాడు.

"అది తెలుసుకునేందుకే ఈ రాత్రి ఇట్లా పరుగెత్తి వచ్చాను మహాత్మా!" అన్నాడు శ్రీరామచంద్రమూర్తి సవినయంగా.

—(రేవతి)

నాటిక

# నీలి తెరలు

అంగర సూర్యారావు





గత సంచిక తరువాయి

వామ : (చిత్రతో) ఎలా వున్నాడమ్మ అబ్బాయి ?

చిత్ర : చూపులకు బాగానే వున్నాడు. తెలివైన వాడు అవునో కాదో తెలియదు.

వామ : నువ్వు తొందరపడి మాట విసరకు సుమీ.

(ఎడమవైపునుంచి తిరిగి దండపాణి, కిశోర్ మాట్లాడుకుంటూ వస్తారు.)

దండ : వున్న గదులన్నింటిలోకీ అది ఒకటో నెంబరు గది బాబూ! అందుకే దాని నెంబరు కూడా ఒకటి.

వామ :ఏడీ? ఆ అబ్బాయి ఎక్కడ?

కిశోర్ : వాడికి వంట్లో ఖులాసాగా లేదండి. పడుకున్నాడు. (సోఫాలో కూర్చుంటాడు.)

వామ : అయ్యో పాపం! ఏమైనామందు కావాలా?

కిశోర్ : ఏమీ అక్కర్లేదండి. కొంత సేపు విశ్రాంతి తీసుకుంటే అదే పోతుంది.

వామ : (లేచి) అమ్మాయి నేను వీకాంట్సు చూసుకొని యిప్పుడే వస్తాను. ఈ లోపున అబ్బాయికి మేడమీది గదులు ఫోటో ఆల్బం వగైరా చూపించు (ముందు వామనమూర్తి, వెనుక దండపాణి కుడివైపు నిష్క్రమిస్తారు. హాలులో చిత్ర, కిశోర్ యిద్దరే మిగులుతారు.)

చిత్ర: (లేచి) నేను మిమ్మల్ని కొంచెం పరీక్ష చెయ్యవలసివుంది.

కిశోర్: (ఆశ్చర్యంతో) పరీక్షా? ఎందుకు?

చిత్ర: (కోపంతో) ఇంతకాలం పురుషులు స్త్రీలపట్ల నిరంకుశత్వంతో ప్రవర్తించారు. పెళ్ళికిముందు ఆడదాని యిష్టాయిష్టాలను మీ మగవాళ్లు గమనించలేదు. పెళ్లికూతురును రకరకాల పరీక్షలకుగురిచేసి-ఆమెను అవమానించి విడిచిపెట్టారు. ఇప్పుడలాకాదు. కాలం మారింది.

కిశోర్: మీరు చెబుతున్నది నాకు బోధపడడంలేదు. అంతా అయోమయంగా వుంది.

చిత్ర: (కోపంతో) ఎలా బోధపడుతుంది? విశృంఖల విహారం చేసేవాళ్లకు యిలాంటి విషయాలు బోధపడవు. బోధపడక పోయినా బాధలేదు. నేను వేసే ప్రశ్నలకు జవాబులు చెప్పండి.

కిశోర్: ప్రశ్నలకు జవాబులు చెప్పడానికి నేనెన్నడూ వెనుకాడను. నేను కాలేజీ విడిచిపెట్టినతరవాత హిందూస్థాన్ ఇయర్ బుక్, జనరల్ నాలెడ్జి, డిస్కవరీ ఆఫ్ ఇండియా మొదలైన పుస్తకాలు ఎన్నో చదివాను. యుద్ధానికి సిద్ధమైన సిపాయిలా ఇంటర్వ్యూలో అడిగే ప్రతి ప్రశ్నకు జవాబు చెప్పడానికి సిద్ధంగా వున్నాను. ఇంతకూ మీరు ప్రశ్నలు వెయ్యడంలోగల అంతర్యం నాకు బోధపడకుండా వుంది.

చిత్ర: మీరు వృధా ప్రసంగంతో టైంవేస్టు చెయ్యడానికి వీల్లేదు. ముందు నా ప్రశ్నలకు జవాబు చెప్పండి.

కిశోర్ : (వినయంగా) సరే! అడగండి. ఇంతకూ మీరు యివ్వబోయే ఉద్యోగపు స్వరూపం యేమిటో నాకు తెలియకుండా వుంది.

చిత్ర: తొందర దేనికి? ఇప్పుడే తెలుస్తుంది. ఇక పరీక్ష ప్రారంభిస్తాను. (క్షణం ఆగి) మీకు భావకవిత్వం వచ్చునా?

కిశోర్: అద్భుతమైనప్రశ్న వేశారు. ఇంతవరకూ ఎవరూ నన్ను యిటువంటి ప్రశ్న అడగలేదు.

చిత్ర: (కోపంతో) మీరు కబుర్లలో కాలం గడుపుతున్నారు. అదేం లాభంలేదు. అడిగిన ప్రశ్నకు సూటిగా జవాబు చెప్పాలి.

కిశోర్ : [సూటిగా] నాకు భావకవిత్వం వచ్చును.

చిత్ర: వచ్చును అంటే సరిపోదు. ఉదాహరణ కావాలి.

కిశోర్ : (ఆలోచిస్తూ)

నల్లని సిరాలాంటి రాత్రిలో
తెల్లని గులాబీలాంటి సుందరి
మెలమెల్లగా మంచు బిందువులా
గలగలా పారు సెలయేరులా
నాగకన్యక వలె
సాగిపోతోంది.

చిత్ర: అంత సంతృప్తికరంగా లేదు. మీకు చిత్రలేఖనం వచ్చునా?

కిశోర్ : వచ్చును. నేను పిల్లిబొమ్మ వేసినప్పుడు మా టీచర్ ఆ బొమ్మక్రింద 'పిల్లి' అని రాయమనేవారు.

చిత్ర: ఎందుకూ?

కిశోర్: చూసేవాళ్లు పోల్చుకునేందుకు యిబ్బందిపడతారని.

చిత్ర: అయితే మీకు చిత్రలేఖనం రాదని తేలిపోయింది. పోనీ కూడికలు, భాగారాలు, తీసివేతలతో కూడిన లెక్కలు వచ్చునా?

కిశోర్: వచ్చును. ఎటువంటి లెక్కయినా క్షణంలో చేస్తాను.

చిత్ర: (ముందుకు నడుస్తూ) నాతో కొండ

## ★ నీలి తెరలు ★

మీదికి రండి. నా లెక్కల పుస్తకాలు పైన వున్నాయి.

కిశోర్ : (నిస్పృహతో ఆమె వెనుక నడుస్తూ) ఈ ప్రశాంత సంధ్యాసమయాన్ని లెక్కలుచేస్తూ వ్యర్థం చెయ్యవలసిందేనా?- నాకు లెక్కలు చెప్పిన ఓ గురుదేవా! మీరు యిప్పుడు ఏ క్లబ్బులో పేకాడుతున్నారో కదా!

(ముందు చిత్ర, వెనుక కిశోర్ మేడమీదికి వెళ్ళిపోతారు.)

జయరాం: (నేపథ్యంలోంచి) కిశోర్! కిశోర్! (ఎడమవైపు నుంచి వస్తాడు. ఎవరూ లేకపోవడం చూసి నిస్పృహతో సోఫాలో కూర్చుంటాడు.)

ఆనంద్ : (నేపథ్యంలోంచి) దండపాణీ! దండపాణీ! (ఎడమవైపునుంచి వస్తాడు. జయరాంను చూసి) అయ్యా! తమరెవరు?

జయ : అదే తెలియకుండావుంది. ఏదో ఒకటి తేల్చుకునే ఉద్దేశంతోనే యిక్కడకు వచ్చాను.

ఆనంద్ : అనగా తమభావం?

జయ : భావాని కేముందయ్యా మహానుభావా! నే నెవరినో యింకా తేలలేదు. కొంతలో తప్పిపోయిందికాని లేకపోతే యీసరికి ఒకకంపెనీకి ఏజంటునై వుండే వాణ్ని. ఇకముందు నేను ఏజంటునౌతానో, డాక్టరునౌతానో; కాఫీహోటలులో సర్వరునౌతానో; కారు కండక్టరు నవుతానోకూడా తెలియకుండా వుంది.

ఆనంద్ : ప్రస్తుతం నిరుద్యోగులన్నమాట! (జయరాంను పరిశీలించి చూసి) మిమ్మల్ని యిదివరకు ఎక్కడో చూసినట్లుందే!

జయ : సినిమాహాలు గేటుదగ్గరకానీ, రైల్వే ప్లాట్‌ఫారంమీదకాని ఎక్కడైనా నన్ను చూసి వుండవచ్చు.

ఆనంద్ : మీపేరు?

జయ : జయరాం.

ఆనంద్ : జయరాంకంటే జైసీతారాం అంటే శాస్త్రయుక్తంగా వుండేది.

జయ : మా వివరాలన్నీ తమరి కెందుకో తెలుసుకోవచ్చునా?

ఆనంద్ : ఓ! తెలుసుకోవచ్చును. మా నాటక కంపెనీకి నటులను రిక్రూట్ చేసుకుంటున్నాం. మీ ముఖంలో కొంచెం నటుని

లక్షణాలు కనిపించినై. వెంటనే రెండు ప్రశ్నలు వేశాను. అంతే!

జయ : ఇదివరకు ఎప్పుడూ నేను నాటకాలలో వేషాలు వెయ్యలేదే!

ఆనంద్ : వెయ్యకపోయినా ఫరవాలేదు.

జయ : జీతం ఎంతయిస్తారు?

ఆనంద్ : చావకుండా బ్రతికేందుకు సరిపోయే జీతం యిస్తాం.

జయ : (సంతోషంతో) అయితే నాకీ ఉద్యోగం పూర్తిగా నచ్చింది. యీ రోజులలో అంతకంటె ఎక్కువజీతం ప్రజా ప్రభుత్వంకూడా యివ్వడం లేదు.

ఆనంద్ : (లేచి) ఇవ్వాళనుంచే మీరు ఉద్యోగంలో చేరతారా?

జయ : (లేచి) మహారాజులా!

ఆనంద్ : (ఎడమవైపుచూపిస్తూ) అదే మా ఆఫీసు గది, ఈ హాలును రిహార్సల్సు కోసం యిప్పుడే బుక్ చేశాం.

(ఇద్దరూ ఎడమవైపు మాట్లాడుకుంటూ నిష్క్రమిస్తారు.—మేడమీదినుంచి కిలకిల నవ్వుతూ ముందు చిత్ర, వెనుక కిశోర్ ప్రవేశిస్తారు.)

చిత్ర : ఇప్పటికి మీరు రెండుపరీక్షలలో గెలిచారు. ఒక పరీక్షలో ఓడిపోయారు.

కిశోర్ : ఇంతేనా? యింకా ఏమైనా పరీక్షలున్నాయా?

చిత్ర : ఇంతటితో అయిపోయిందని సంతోషిస్తున్నట్లున్నారు. ముఖ్యమైన పరీక్ష ముందువుంది.—సిగ్గుపడుతున్న అమాయకురాలైన పెళ్లికూతురుతో బలవంతంగా పాటలు పాడించేవారు. దానికిప్పుడు మేం ప్రతీకారం చేసితీరాలి.

కిశోర్ : తరతరాలుగా మగవాళ్లు చేస్తున్న దౌర్జన్యాలకు నేను యీ నాడు సంజాయిషీ యిచ్చుకోవలిసి వచ్చిందికదా!

చిత్ర : (నూటిగా) మీకు పెళ్ళిసంగీతం వచ్చునా?

కిశోర్ : పెళ్ళిసంగీతం అంటూ వేరే నేర్చుకోలేదు. కాని పాటలు పాడడం వచ్చునండి.

చిత్ర : దానినే పెళ్ళిసంగీతం అనవచ్చు ఫరవాలేదు. యేదీ ఒక పాటపాడి వినిపించండి.

కిశోర్ : మీకు నచ్చేపాట పాడమంటారా? నాకు యిష్టమైన పాట పాడమంటారా?

చిత్ర : అది ఒకటి యిది ఒకటి—రెండూ పాడి వినిపించండి.

కిశోర్ : మీకు ఎటువంటి పాటకావాలో ముందు చెప్పండి.

చిత్ర : ప్రకృతి సౌందర్యాన్ని వర్ణించే పాటకావాలి.

కిశోర్ : (క్షణం ఆగి గొంతు సరిచేసుకొని పాడడం ప్రారంభిస్తాడు.)

(పాట) :—

అందాల దీవిలోను
చందమామ వెలుగులోను
అందం వెతికేదానా
అందమైన చిన్నదానా!
సంపెంగ పువ్వు చూడు
సన్నజాజితావి చూడు
చిరుమల్లె పువ్వు చూడు
చిన్నదాని మోము చూడు
నీలాల నింగి చూడు
నింగిమీది మబ్బు చూడు
మబ్బులోని మెరుపు చూడు
మెరుపులోని సొగసు చూడు!!

చిత్ర : (సంతోషంతో) సెహబాష్, చాలాబాగుంది. మీరు యింతబాగా పాడతారనుకోలేదు—యిక మీకు యిష్టమైనపాట మరొకటి పాడవలసివుంది.

కిశోర్ : యీ పాటతో యిక నా పరీక్ష అయిపోతుందా అండీ?

చిత్ర : చాలావరకూ అయినట్లే అనుకోవచ్చు. మొదటిపాటకంటె యీ పాట చాలాబాగాపాడితే యిక పరీక్ష పూర్తిఅయిపోతుంది.

కిశోర్ : (గొంతు సవరించి హాలు ప్రతిధ్వనించేలా బిగ్గరగా రాగంతీసి పాడతాడు.)

(పాట) :—

పూదోటలలో
తిరిగేదానా!
పూబాటలలో
నడిచేదానా!
లోకం పోకడ
తెలియనిదానా!
లోకపువింతలు
చూడనిదానా!
దారినిపోయే
మనిషిని చూడు
వాని ముఖంలో
దైన్యం చూడు
కడుపులో లేచే
ఆకలిజ్వాలా
ఎదలో యేదో
తెలియని బాధా!!
యింటిలో చూస్తే
పిల్లల గోల
బయటకువస్తే
బాకీలవాళ్లు
నూతిలో దిగితే
పోలీసు కేసు
చావాలన్నా
చావగ లేదు
బ్రతకాలంటే
బాధలు తప్పవు!!

(పాటమధ్యలో ఎడమవైపునుంచి తొరగా నిరంజన్, ఆనంద్ వచ్చి పాటవిం నిలుచుంటారు.)

# నీలి తెరలు

నిరంజన్: పాట (పూర్తికాగానే కిశోర్‌ను సమీపించి) మీ నటన అత్యద్భుతంగా, అతిసహజంగావుంది. (పర్సులోంచి నోటుతీసి) మిమ్మల్ని మా నాటకంలో హీరోగా బుక్ చేశాం. ఇదిగో! వందరూపాయలనోటు అడ్వాన్సు! ఇక నా మాటకు ఎదురుచెప్పకండి. (నోటు బలవంతంగా కిశోర్ జేబులో పెడతాడు.)

కిశోర్: ఎదురుచెప్పను. ఎంతమాత్రం ఎదురుచెప్పను. నాకు కావలిసింది ఉద్యోగం. అందుకోసమే తిరుగుతున్నాను.

చిత్ర: ఛ! యిటువంటి ఉద్యోగానికి మీ రెందుకు అంగీకరిస్తున్నారు?

నిరం: (రెండుజేబులలోను చేతులు పెట్టుకొని ఆమె ముఖంలోకి ఓరగాచూస్తూ) మీకేం అభ్యంతరం లేకపోతే మిమ్మల్ని కూడా మా నాటకంలో నాయిక పాత్రకు బుక్ చేస్తాం.

చిత్ర: (కోపంతో) ఏవూరు నీది? నోట్లు దగ్గర పెట్టుకు మాట్లాడు. (సీరియస్‌గా మేడ మీదికి వెళ్లిపోతుంది.)

ఆనంద్: నిరంజన్! కొంపముంచావ్! ఆమె ఎవరనుకుంటున్నావు? వామనమూర్తి గారి అమ్మాయి!

నిరం: ఓహో! అలాగా! నేనామెను టైపిస్టు అనుకుంటున్నాను. పోనీలే! నాటకంలో వేషంవెయ్యమనడం పెద్దఅపరాధం యేమీ కాదు.

కిశోర్: మీ నాటకమండలి ఎక్కడ?

నిరం: ప్రస్తుతం యీ విశ్రాంతి భవనంలోనే!- ప్రయాసలేకుండా మీరు మా నాటకానికి హీరోగా దొరికినందుకు చాలా సంతోషిస్తున్నాం.

ఆనంద్: మీ నాన్నగారు పెట్టిన ముహూర్తం చాలామంచిదిలా కనిపిస్తోంది. తలపెటిన కార్యం చాలావరకూ పూర్తి అయ్యింది.

నిరం: ఇక నేను యింటికివెళ్లి డబ్బు తీసుకువస్తాను. కవిగారితో తెల్లవారేసరికి నాటకం పూర్తిచేయించు. రేపే రిహార్సల్సు ప్రారంభిద్దాం.

(నిరంజన్ తొందరగా కుడివైపు నిష్క్రమిస్తాడు.)

ఆనంద్: (కిశోర్‌తో) రండి. మా ఆఫీసు రూంలో కూర్చుని మాట్లాడదాం.

కిశోర్: (ఏదో స్ఫురణకు వచ్చినట్లు) మీరు వెళ్లండి. నేను తరవాతవస్తాను.

(కిశోర్ తొందరగా మేడమెట్లు ఎక్కుతూవుంటాడు. ఆనంద్ అతనికేసి చూస్తూవుంటాడు—

—: తెర :—

(ఇంకావుంది.)

# నెరవేరిన మనోరథం

"అమ్మా! రుక్మిణీ! తల చిక్కుతీసి సిగ ముడవనా?"

"ఊహుం వద్దు"

"వద్దు అంటే ఎలాగమ్మా? నీ నిడుద వెంట్రుకలన్నీ ఎట్లా చిక్కులు పడిపోయాయో చూడు! ఎందు కిలా వెంబేలుపడిపోతావు?

"........."

"వకుళా! పోనీ దేవి మనసుకి వినోదంగా వుంటుంది పెంపుడు చిలుకను తీసుకురావే! అదీ వద్దంటే అట్లా తోటలోకి వెడదాము. ఏమమ్మా!"

"అబ్బ! వకుళా! నామనస్సేమీ బాగు లేదు. వృథాగా నన్ను విసిగించకండి. పొండి."

అంటూ చివాలున ఊగుతున్న ఉయ్యాల మీదనుంచి లేచి రుక్మిణి నగరమంతా కనబడే గవాక్షంలో ఆసీనురాలయింది. ఆమె యీ తీరున కృశించిపోతూండటంలోని ఆంతర్యం తెలిసిన ఆసఖులిద్దరూ మారుమాటాడక అక్కడినుంచి నిష్క్రమించారు. రుక్మిణీదేవి గవాక్షంలోనుంచి రాజబాట వంక కేసి తీక్షణంగా చూస్తూ, ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టింది. ఆమె ఈవిధంగా సర్వసంగపరిత్యాగినిలా వుండటానికి కారణం ఆమె అన్న రుక్మి మూర్ఖత్వం. ఐదుగురు సోదరుల వెనుక అల్లారు ముద్దుగా పెరిగిన రుక్మిణి యౌవనోదయం అయిననాటినుంచీ, తనతండ్రి కొరకు వచ్చిపోయే అతిథులవలన శ్రీకృష్ణుని గుణగుణాలన్నీ విని అతనినే తనకుతగిన వరునిగా ఎన్నుకున్నది. ఆమె తల్లిదండ్రులూ బంధువులూకూడా రుక్మిణీదేవి అభిప్రాయాన్ని హర్షించి ఆవిధంగానే జరపటానికి నిశ్చయించారు. కాని ఆమె పెద్దన్నగారైన రుక్మిమటుకు మూర్ఖత్వంతో శ్రీకృష్ణుని ఎడల విరోధభావంపూని, అందరి ఇష్టాన్నీ త్రోసిపుచ్చి తన మిత్రుడూ, చేదిదేశాధీశుడూ అయిన శిశుపాలునకు తన చెల్లెలిని ఇచ్చి వివాహంచేయ సంకల్పించాడు. తండ్రి భీష్మకుడుకూడా కన్నకుమారుని మాట కాదనలేక కొడుకునకు వశుడై తగినలగ్నం నిశ్చయించి, పెద్దపెట్టున కుండిననగరమంతా వివాహాలంకారాలు చేయించి వేశాడు.

ఆ వివాహముహూర్తం రేపే. ఈసరికే నానాదేశాల రాజులూ ఆహూతులై వచ్చి విడిశారు. వరుడు శిశుపాలుడుకూడా మహోత్సాహంతో సర్వసేనలతోనూ, సకల బంధువులతోనూ వచ్చి భీష్మకునిచేత తగిన మర్యాదలను పొంది విడిదిలో దిగాడు.

ఈపరిస్థితులన్నీ తలపోయగానే రుక్మిణీదేవి నల్లకలువలవంటి నేత్రాలు, శ్రావణ మాసంలోని నీలిమేఘాలవలె నీళ్లు వర్షించాయి. అద్దాలవంటి ఆమెచెక్కిళ్లపైన కన్నీళ్లు చారికలుకట్టాయి. మెడలో చిక్కులుపడిపోయిన ముత్యాల హారాలమధ్య కన్నీటి బిందువులు చిక్కుపడి తెగిన ముత్యాలవలె భ్రాంతి కలిగించాయి. పడమటి వైపున క్రుంగిపోతూన్న సూర్యుని బంగారురంగు కిరణాలు గవాక్షంగుండా ఆమె ముఖంమీద పడి కన్నీళ్లను వజ్రాలవలె మెరిపింపచేశాయి.

## జమ్మి సుశీలారాణి

తిలకహీనమైన ఆమె గుండ్రని ముఖం కళంకం లేని చంద్రబింబంవలె కాంతులు చిమ్మింది. రుక్మిణీదేవి అట్లాగే రాజబాటవైపు కన్నార్పక చూస్తూ కూర్చుంది. "రేపు చతురంగబల సమేతుడవై వచ్చి శిశుపాల జరాసంధాదులను జయించి, గౌరీ పూజాసమయంలో నన్ను రాక్షసవిధిన కొనిపోవలసింది" అని శ్రీకృష్ణుని ప్రార్థిస్తూ తన కాప్తుడైన అగ్నిద్యోతనుడనే బ్రాహ్మణశ్రేష్ఠునితో ద్వారకకు సందేశం పంపింది ఆమె. అందుచేత ఆమె మనస్సంతా శ్రీకృష్ణునిమీద, తన సందేశాన్ని కొనిపోయే అగ్నిద్యోతనునిమీద మాత్రమే సుడులు తిరుగుతూ మిగిలినవిషయాలను అన్నిటినీ త్యజించివేసింది.

వివాహం రేపే. దగ్గరకు వచ్చివేసింది. అగ్నిద్యోతనుడు శ్రీహరికి తన సందేశం వినిపించాడో! లేక ద్వారకానగర మార్గమధ్యమందే ఉన్నాడో యింకా! ఒకవేళ శ్రీకృష్ణుడు ఆ సందేశం విని తప్పుగా భావించాడేమో! వాసుదేవుడు రాడుకాబోలును. అగ్నిద్యోతనుడు పోయిఉండడు. కృష్ణుని రమ్మని పిలవటానికి అగ్నిద్యోతనుని మించిన ఇష్టబంధువులిక వేరే తనకు లేరు. ఇక ఎవరిని పంప వీలవుతుంది? అసలు బ్రహ్మవ్రాత ఏ విధంగా వున్నదోకదా! అని ఈ విధంగా పరిపరివిధాల చింతిస్తూ శోకమూర్తియైన రుక్మిణీదేవి సూర్యాస్తమయమై, క్రమంగా శ్రీకృష్ణుని ఒంటిరంగువంటి చీకట్లులో కొన్ని కప్పుకోవటం గ్రహించలేదు.

హరియశస్సుధాబ్ధి తుంపురులవంటి చుక్కలు నీలపు ఆకాశంలో ముగ్గులవలె మెరిశాయి. ఆ చుక్కలమధ్య చంద్రుడు కలువ పువ్వులా వెలుగుతూ వెండిదారాలవంటి సన్నటి కిరణాలను కుండిననగర వీధులవెంట పరుగెత్తించాడు. రుక్మిణీదేవికి ఆ వెన్నెలలో నగరమంతా ఒక కర్పూరపు కుప్పవలె కనిపించినది. రాజబాటపైన పౌరులు చల్లిన చిక్కని మంచిగంధపునీటి సువాసనలు గాలిలో తేలి రుక్మిణి నాసికాపుటాలలో ప్రవేశించాయి. ప్రతి గృహమందు నా కర్పూర కుంకుమాది అలంకారాలూ, మామిడాకుల పచ్చనితోరణాలూ దీపకళికల సరసన మెరిసిపడ్డాయి. ఇండ్లలోనుంచి అగరు ధూపాల తెరలు తెలిమబ్బుపింజెల్లా వెన్నెల్లో ప్రయాణంచేశాయి. రుక్మిణి మనస్సులో సంశయాలవలె దూరదూరాన ధ్వజస్తంభాలకు మెలిపెట్టిన పూలచెండ్లు గాలికి వూగులాడినాయి. ఈ అలంకారమంతా రేపు తనకు శిశుపాలునితో జరుగబోయే వివాహార్థమేనని భావించగానే రుక్మిణీదేవి మనస్సులో దిగులు మరీ అధికమయింది. చివరికొక వేడి నిట్టూర్పు విడిచి మరొక్కమాటు రాజబాటవైపు కన్నార్పకచూసి లేచి నిలువబడింది. ఆ క్షణానే ఆమె నయనాలలో, సహస్ర మణిదీపాల వెలుగులు ఒక్కమారు తళతళలాడాయి. చిరునవ్వు మెరుపులు ముఖ

#  నెరవేరిన మనోరథం 

మంతా అలుముకున్నాయి. ఆక్షణానే ఆమె ఎడమకన్ను ఎడమభుజమూకూడా అదిరాయి.

రాజబాటమీదుగా నాలుగశ్వాలు పూన్చిన రథం ఒకటి వాయువేగ మనోవేగాలతో పరుగులుతీస్తూ కనురెప్పపాటులో ఆమె దృష్టిపథాన్ని అతిక్రమించి రాజసౌధాల వేపు సాగిపోయింది. ఆమె అచేతనంగా గవాక్షపు కమ్మీ నానుకుని నిలువబడిపోయింది. చివరకు వకుళ ఆమెనుతట్టి పిలువటంతో స్పృహవచ్చింది రుక్మిణీదేవికి. "అమ్మా! అగ్నిద్యోతనులవారు తమరి దర్శనం కోరుతున్నారు" అన్నది వకుళ ఆమెకు చేయూతనిస్తూ. వకుళ చేతిని మెరుపులా తొలగించి ఆబ్రాహ్మణుని కెదురు నడిచిందామె. అగ్నిద్యోతనుని ముఖలక్షణాలు చూస్తూనే రుక్మిణీదేవికి వెయ్యి ఏనుగులబలం వచ్చినట్లయింది. అగ్నిద్యోతనుడామెతో "అమ్మా! రుక్మిణీ! నీ సద్గుణాలను శ్రీకృష్ణుడెంతో మెచ్చుకున్నాడు. నాకు అపారధనాన్నిచ్చి సత్కరించాడు. నన్ను తీసుకొని తానే ఒక్కరాత్రిలో ద్వారకనుంచి ఇక్కడకు వాయువేగాన వచ్చివేశాడు. ఎందరు అడ్డువచ్చినా నిన్నుతీసుకొని పోయితీరుతాడు. నీచరిత్ర, నీభాగ్యము సర్వం నేడు ఫలించాయి తల్లీ" అన్నాడు. ఈమాటలను వింటూనే రుక్మిణి ఆనందాతిరేకాన కన్నీళ్లు కురిపిస్తూ, మాటలకు తడబడింది. చివరకు "శ్రీహరిని నాసందేశం చెప్పి తీసుకొనివచ్చి నన్ను బ్రతికించావు. విప్రవర్యా! దీనికి నేనేమి ప్రత్యుపకారం చేయగలను?" అంటూ ఆయనకు సాగిలపడి నమస్కరించింది. అగ్నిద్యోతను డామెను చేయెత్తి గంభీరస్వరంతో దీవించాడు. దాసదాసీలు వెలిగించిన దీపావళికి రుక్మిణీదేవి కండ్లవెలుగు తోడై ఆ భవనమంతా మెరిసిపోయింది.

## 2

మరునాడు రుక్మిణీదేవి సర్వాలంకారాలూ అలంకరించుకొని శుచిగా గౌరీపూజ చేయటానికి మౌనంధరించి నగరుకి ఆవతల ఉన్న ఆలయానికి నడిచింది. ఆమె వెనుకా చుట్టుప్రక్కలా అనేకమంది వీరభటులు, కానుకలు తీసుకొని వారవనితలు, అలంకారవతులైన బ్రాహ్మణుల భార్యలూ, సఖులు, తల్లిదండ్రులు, బంధువులు మొదలైనవారంతా పరివేష్టించి నడిచారు. రంగురంగుల కాంతులీనే వస్త్రాభరణాలు ధరించిన ఆ జనసందోహం వసంతకాలంలో రకరకాల పుష్పాలతో శోభించే పువ్వాటికవలె కాంతులు చిమ్మింది. వాయిద్యాల ధ్వనులతో నగరమంతా మారుమ్రోగింది. రుక్మిణీదేవి ఆలయంలోనికి వెళ్ళి పార్వతీదేవిని నిండుమనసుతో తనకు హరినే పతినిచేయుమని మరొక్కమారు ప్రార్థించి యథావిధిగా పూజావిధి నేరవేర్చింది. జరుగవలసిన వేడుకలన్నీ ముగిసిన తరువాత ఆమె మెరుపుతీగలా ఆలయం విడిచి తిరిగి నగరానికి బయలుదేరింది.

లక్ష్మీదేవిఅవతారమైన రుక్మిణీదేవి అందచందాలకు చుట్టూ మూగిన రాజలోకమంతా ముగ్ధమయింది. పాదాల అందెల ధ్వనులువారి మనస్సుల్లో తాళాలువేస్తుండగా రుక్మిణీదేవి తన నల్లని విశాలనేత్రాలతో వారిమధ్య శ్రీకృష్ణుని వెదకుతూ, ముంగురులను ఎడమచేతి గోళ్లతో పైకి త్రోసుకుంటూ ముందుకు సాగిపోయింది. చివరకు ఆరాజవీరుల మధ్య శ్రీకృష్ణునిచూసి సిగ్గుపడి మందహాసం చేసింది. దొండపండువంటి ఆమె ఎఱ్ఱని పెదవిమీద తెల్లని ఆ చిరునవ్వు అప్పుడే వికసించి ఎఱ్ఱని తొడిమతో మెరిసే పారిజాత కుసుమంలాగా వెలుగులు చిందింది. ఆక్షణానే హరి ఆమెకు ఎదురు నడిచి నిర్భీతితో, సర్వప్రజలూ చూస్తూండగా ఆమెను తీసుకొనిపోయి తన రథంపైన కూర్చోబెట్టుకుని విజయశంఖంపూరించాడు. ఆశంఖధ్వానం దిగంతాలవరకూ వ్యాపించి విశ్వమంతా నిండిపోయింది. నెరవేరిన మనోరథంగల రుక్మిణీదేవితో కూడుకున్న ఆ శ్రీకృష్ణుని రథం ద్వారకానగరంవైపు సాగిపోయింది. 

# జరుగుబాటు

ప్లాట్‌ఫారం మీదికి ఎట్లా పరుగెత్తికెళ్ళి రైలులో పడ్డానో తెలియదు. కారణమేమీ లేకుండానే, నాన్న చెప్పే దాంట్లో ఎంత నిజం ఉన్నదో ఆలోచించకుండానే తగాదా పడ్డాను. చాలా చిన్నవిషయం మీదనే ఇద్దరమూ తొందర పడ్డాం.

ముక్కుపచ్చలారని పెద్దచెల్లెలు వితంతువయింది. సంవత్సరమయింది ... వసుమతికి మళ్ళీ పెళ్ళిచేస్తేనేగాని ఇంటికి రానని నాన్నకు రాశాను. నామాట ఆయన వినలేదు...సంవత్సరం దొర్లిపోయిన తరువాత అవసరమయిన సంగతి మాట్లాడాలి రమ్మనమని నాన్న టెలిగ్రాం ఇచ్చాడు.

ఇంకేముంది నేను చెప్పినట్లు చెల్లెలికి పెళ్ళిచెయ్యడానికి నాన్న ఒప్పుకుంటాడని చాలా సంబరపడి స్నేహితుడు సుదర్శనానికి వైర్ ఇచ్చి గుంటూరు వెళ్ళాను.

కాని, నాన్న మారలేదు. నాన్న అభిప్రాయాలు మారలేదు. పైగా అమ్మా, తమ్ముడూ, చెల్లెళ్ళూ, అందరూ తిట్టారు.

వంశగౌరవమనీ, ఆత్మాభిమానమనీ, ఇంకా ఏమిటేమిటో చెప్పారు...ఆ తిట్లు భరించలేక అర్ధరాత్రనయినా లెక్కచెయ్యకుండా స్టేషనుకు వచ్చాను. అంతే పరుగెత్తికెళ్ళి రైల్లో కూర్చున్నాను. తెనాలి స్టేషనులో దిగి ఒంగోలుకు టికెట్టు తీసుకున్నాను.

ఆరోజు మెయిలు ఆలస్యం. చలిలో అట్లాగే కూర్చోగా, కూర్చోగా మెయిలు వచ్చింది. పెట్టెలో కూర్చున్నానేగాని బుర్రంతా వేడెక్కింది. ఏవేవో ఆలోచనలతో ఒంగోలు దాకా గడిపాను.

మిత్రుడు సుదర్శనం స్టేషనుకు వచ్చాడు. ఇద్దరమూ వాడి బసకు వెళ్లాం. పదేళ్లనాడు నాన్న ఒంగోలులో ఉద్యోగం చేశాడు. ఊరంతా నాకు తెలిసినదే.

మర్నాడు సుదర్శనం ఆఫీసుకువెళ్లాడు. ఏమీ తోచక రైలుస్టేషనుకు బయలుదేరాను. అదిగో ఆ బళ్లూ, రిక్షాల మధ్య నుంచున్న ముసలిదానిని ఎక్కడో చూచాను. గుర్తు రావడం లేదు. బాగా ఎరిగున్న మనిషి మాదిరిగా ఉన్నది. దానిచుట్టూ గుర్రబళ్లవాళ్ళూ రిక్షాలవాళ్లూ చేరారు.

ఏమిటేమిటోఖబుర్లు చెప్పుకుంటున్నారు. ఏమి చెప్పుకుంటున్నారో విందామని వాళ్లకు కొంచెందూరంలో నుంచున్నాను. రైలు వచ్చేవేళ కాదు, కనుక అంత హడావుడిగా లేదు.

ఒకళ్ళిద్దరు రిక్షాలవాళ్ళు "రిక్షా కావాలా బాబూ" అన్నారు. వద్దని తలతిప్పి తప్పించుకున్నాను.

"ఏంబాబూ బాగుండావా?" అన్నది ఆ మనిషి. అప్పుడు గుర్తొచ్చింది కోటమ్మ. ఆరోజులలో మా ఇంట్లో పనిచేసినమనిషి కోటమ్మ.

* * *

ఆమెను చూచేటప్పటికే ఆమె గత జీవితమంతా గుర్తొచ్చింది.........

కూటికి లేకపోయినా, గుడ్డకు కరువే అయినా కులమంటే అభిమానంగలమనిషి

## వి. ఎస్. అవధాని

కోటమ్మ. పెద్దపెద్ద చదువులు చదువకపోయినా తండ్రి అదుపాజ్ఞలలో పెరిగింది కోటమ్మ. నీతి, ధర్మం అనే పెద్దపెద్ద సంగతులంతగా తెలియకపోయినా వెకిలిగా తిరిగే మనిషి కాదు కోటమ్మ. కాని, జానెడు పొట్టకోసం రెక్కలు ముక్కలయ్యేట్టు రంగారాయుడి చెరువునుంచి ఊళ్ళోకి మంచినీళ్లు భాగ్యవంతులఇళ్లకు చేరవేస్తుంది.

చచ్చేట్టు నెలపొడవునా నీళ్లుపోస్తే నెలాఖరుకి ఒక్కొక్క ఇల్లాలు దమ్మిడీ ఇవ్వదు. పదిసార్లు తిప్పించుకుని ఇస్తుంది మరొక ఇల్లాలు. ఇస్తే తీసుకుంటుంది. లేకపోతే పస్తులు పడుకుంటుంది కోటమ్మ. పోట్లాడడం చేతనయితేమాత్రం కడుపు నిండుతుందా యేం!

చిన్నతనంలోనే కోటమ్మకు తల్లి కరువయింది. తెలిసీ తెలియని రాజకీయాలలో క్షణం తీరికలేకుండా, దమ్మిడీ సంపాదన లేకుండా తిరిగేవాడు తండ్రి. అందువల్ల పస్తులు అలవాటయినవి కోటమ్మకు.

ఒక్కొక్కరోజు ఎవరికి ఎన్నెన్ని పనులు చేసిపెట్టినా రాజయ్యకు దమ్మిడీ దొరక్కపోతే దిక్కుమొహం వేసుకుని ఇంటికి తిరిగివచ్చి కోటమ్మను చితకకొట్టేవాడు. చితకకొట్టి అది ఏడుస్తుంటే తను కూడా గొంతుకలిపి ఏడ్చేవాడు.

* * *

రాజయ్యతోపాటే జైలుకు వెళ్లివచ్చిన సుబ్బారావు ఒకరోజుపొద్దున్నే రాజయ్య దగ్గరకు వచ్చి "ఏం మామా కులాసాగా ఉండావా?" అన్నాడు.

"ఆ...అదే కులాసా రా...రా ఇటా కూచో" అన్నాడు రాజయ్య.

"ఏం! అట్లా ఉన్నావేం! చుట్ట కాల్చు" అని పొగాకుకాడ ఇచ్చాడు సుబ్బారావు.

అప్పటినుంచీ రాజయ్య ఉన్నా లేకపోయినా సుబ్బారావు కోటమ్మదగ్గరికి వస్తూపోతూండేవాడు.

ఆరోజులలో రాజయ్య ఛైయిర్మన్‌గారి మనిషి. ఆయన సహాయంతో కోటమ్మను సుబ్బారావుకుఇచ్చి రాజయ్య పెళ్ళిచేశాడు. సుబ్బారావుకుకూడా "నా" అనేవాళ్లెవరూ లేరు. కనుక రాజయ్య ఇంట్లోనే కాపరం పెట్టాడు.

సుబ్బారావుకూడా రాజకీయాలలో నేతిరిగాడు. అయితే వడ్రంగంపని బాగా తెలుసు. పని అనేది దొరికితే రోజుకు ఎంతలేదన్నా నాలుగయిదు రూపాయలు సంపాదించేవాడు. కాని, పనిదొరకనిరోజులే ఎక్కువ!!

సుబ్బారావుఅండ దొరికిన తరువాత రాజయ్య కొంచెం సుఖపడ్డాడు. నిజానికి సుఖపడవలసిన మనిషి కోటమ్మ. కాని, సుబ్బారావు సంపాదించిన డబ్బు రాజయ్య సుఖానికీ, ఆ తరువాత సుబ్బారావు సుఖానికీ సరిపోవాలి. ఇంకా మిగిలితే అప్పుడూ కోటమ్మ సంగతి. కాని, సాధారణంగా ఆ డబ్బు వాళ్ళ ఇద్దరిసుఖాలకే సరిపోయేది. కాకపోతే నాలుగు సంవత్సరాలు పస్తుల బాధ కోటమ్మకు కొంచెం తగ్గింది.

 

# జరుగుబాటు



పోనీలే-ఇట్లా అయినా రోజులు వెళ్ళ మారితే అదే చాలని వెయ్యిదేవుళ్ళకు కోటమ్మ మొక్కుకునేది.

తండ్రి పెత్తనంలో ఇంటిచాకిరీ చెయ్యడ మేమీ కష్టమనిపించలేదుకోటమ్మకు. కాని, రోజులతరబడి ఇంటిదగ్గిర ఏకాకి పక్షిగా పడిఉండడమే కష్టమనిపించేది.

చేసేందుకు పనేమీ దొరక్క, తండ్రికి ఎక్కడా దమ్మిడీ దొరకలేదుగదా అని ఎదు టింటి షావుకారింట్లో అంట్లుతోమి గదులు ఊడ్చి కొంచెం అన్నమూ పావలా డబ్బులూ జంకుతూ జంకుతూనే తెస్తే తండ్రి చితగ కొట్టినందుకే కోటమ్మ ఎక్కువబాధపడేది. ఆ తరువాత కొన్నాళ్ళు తండ్రికి తెలియ కుండానే ఆ యింట్లోనూ, ఈ యింట్లోనూ చిన్న చిన్న పనులు చేసి వాళ్ళు ఏమి ఇస్తే అది తీసుకువచ్చి ఇల్లుగడిపేది కోటమ్మ. రాజయ్యకూడా చూచీచూడకుండా పోయే వాడు. తను బతికిఉండగా కూతురు ఇంకొక రింట్లో చాకిరీచేసి ఇల్లుగడపడం రాజయ్యకు ఇష్టంలేదు. ఎన్నికలలో ఛైయిర్మన్‌పార్టీ ఓడిపోయింది. తన “ఉద్యోగం” ఊడింది అదివరకు తనను ఎరిగున్నవాళ్ళు కూడా మొహం తప్పిస్తున్నారు. మొదటినుంచీ భూమీ పుట్రా లేనివాడుకాదు తను. ఛైయి ర్మన్ గోపాలంగారితోనే చిన్నప్పటినుంచీ స్నేహం. ఆయనతోపాటే జమీందారు మాదిరిగా తిరగడంతో తనకున్న మూడెకరాల గడ్డా హారించుకుపోయింది. ఆయనతోపాటే రాజయ్యకూడా జెయిలుకు వెళ్ళి వచ్చాడు. గోపాలంగారికి ‘జేజేలు’ కొట్టి జనం పూల దండలు వేస్తే ఆ గౌరవమంతా తనకు జరిగి నట్టే సంబరపడ్డాడు రాజయ్య కాని... కాల చక్రంలో గిరగిరా తిరిగి రాజయ్య నిరుపేద కావడంతో అహంకారం, అభిమానర బుసలు కొట్టి పైకివచ్చినయ్. ఎవరిమీదనో చూపించాల్సిన ఉక్రోశాన్ని కోటమ్మమీద చూపించేవాడు రాజయ్య. అందు లోనూ తన కూతురు అ ఇంటికీ ఈ యింటికీ వెళ్ళి చాకిరీచెయ్యడం రాజయ్యకు గిటదు. కానిఏం చెయ్యగలడూ? కనుకనే కోటమ్మ ఎవరింట్లోనో పనిచేసి డబ్బు తెస్తుంటే సరి పెట్టుకు పోగలిగాడు రాజయ్య....

* * *

సుబ్బారావు పెత్తనంలో కోటమ్మకు ఆ కష్టంపోయి మరోకష్టం వచ్చింది. రాజయ్య చదువుకోలేదు. సుబ్బారావు మూడవఫారం దాకా చదివాడు. రాజయ్య పూర్వకాలపు మనిషి. సుబ్బారావు ఈకాలపు మనిషి. రాజయ్య మోటుమనిషి. సుబ్బారావుదంతా తెలిసీ తెలియని నాగరికత.

ఎవరింటికయినా వెళ్ళి కోటమ్మ పని చెయ్యడం సుబ్బారావుకు ఇష్టంలేదు. మరి సుబ్బారావు సంపాదనతో ఇల్లు గడవదు. “అదుగో ఆ కోమటాయన కొడుకు కళ్ళు ఎప్పుడూ నీ మీదనే ఉన్నాయి!?” అని సుబ్బా రావు కోటమ్మను తంతాడు. అంటే కోటమ్మను తన్నే అధికారం రాజయ్య దగ్గరినుంచి సుబ్బారావుకు వచ్చింది.

తిండి పెట్టి కొడతామంటే అట్లాగే తన్నులుతింటూ మనేవాళ్ళు భారత నారీ మణు లెక్కలేనన్నో ఈ ప్రపంచంలో! కనుక కోటమ్మకూడా సుబ్బారావు పెట్టే హింసను సహించేది. సహించి ఇట్లాగే అయినా రోజులు వెళ్ళమారితే బాగుండునని అనుకునేది. అనుకుని వెయ్యి దేవుళ్ళకు మొక్కుకునేది. కాని, ఆ దెబ్బలకు తట్టుకో లేకపోయేది అప్పుడప్పుడు.

అట్లా రోజులు వెళ్ళమారుతుండగా రాజయ్య చెల్లెలు కూతురు వెంకమ్మ ఎవడి తోనో లేచిపోయింది. ఏం? తను మాత్రం ఎందుకు లేచిపోరాదూ?? అనిపించేది కోటమ్మకు. కాని, మరుక్షణంలో ఇంకో సంగతి గుర్తుకు వచ్చేది....

కోటమ్మ పిన్నమ్మకూతురు ఇట్లాగే చిన్నతనంలో ఎవడితోనో లేచిపోయింది. ఆ మోజుకాస్తా తీరిన తరువాత దాన్ని వాడు దిక్కూ మొక్కూ లేకుండా వది లేశాడు. తిండికి లేకపోతే చాకిరీ చేసు కోవచ్చు. ఓ పూటయినా కడుపునిండా తిని బతకొచ్చు. కాని, చాకిరీ చెయ్యడానికి కూడా పనికిరాకుండా పోయింది తనపిన్నమ్మ కూతురు. ఆఖరికి ఏదో రోగంతో చస్తే మునిసిపాలిటీవాళ్ళు వచ్చి శవాన్ని స్మశా నానికి తీసుకువెళ్ళారు.

కనుకనే మొగుడు అనవసరంగా అనుమా నించి తన్నినాసరే—అల్లుడిచ్చిన డబ్బులతో తాగొచ్చిన తండ్రి తన్నినాసరే—రెక్కలు ముక్కలయ్యేట్టు చాకిరీచేసి తను తెచ్చిన డబ్బులు వాళ్ళిద్దరికే సరిపోయినా సరే ఇట్లానైనా రోజులువెళ్ళమారితే అదేపదివేలని కోటమ్మ రోజూ వెయ్యి దేవుళ్ళకు మొక్కుకునేది.

కాని, రోజులు అట్లా వెళ్ళమారలేదు. ఇంకోవిధంగా వెళ్ళమారినవి. రాజయ్య ముసలివాడయి చచ్చిపోయాడు. ఏడాది తిరక్కముందే తెనాలి కొల్పులలో సుబ్బా రావు చచ్చాడు.

కోటమ్మ జీవితం మళ్ళీ మొదటికి వచ్చింది.

* * *

తనేమీ చిన్నదీ చితకదీ కాదు. ముప్ఫయి అయిదేళ్ళు వెళ్ళినవి. ఇంతకాలంగా తిన్న దెబ్బలకు ఒళ్ళంతా మొద్దుబారింది. ఎముక లన్నీ గట్టిపడినవి. కష్టపడడమంటే భయం అనేది లేకుండా పోయింది. అందుకనే



ఇళ్లల్లో పని చెయ్యడంతో పాటు రంగా రాయుడి చెరువునుంచి మంచినీళ్లు తీసుకు వచ్చేపనికూడా చేస్తున్నది.

ఓపూట తిన్నా తినకపోయినా హాయిగా



రోజులు గడుస్తున్నవి. అరడిచేసి, దాష్టీకం చేసీ, అయిందానికీ కానిదానికీ అనుమానించి తన్నేవాళ్లు లేరిప్పుడు. ఇట్లాగేనైనా రోజులు వెళ్ళమారితే బాగుండునని కోటమ్మ వెయ్యి దేవుళ్లకు మొక్కుకుంటున్నది. కాని, రోజులు అట్లా వెళ్ళమారడంలేదు. తండ్రి పోయినప్పటినుంచీ సుబ్బారావు స్నేహితులందరూ కొంపకు వచ్చి పోతూండే వాళ్లు. సుబ్బారావు చచ్చింతరువాత కోటమ్మను ఓదార్చడానికి వచ్చినట్టువచ్చిన ఆ స్నేహితులలో కొందరివల్ల కోటమ్మకు చాలా కష్టమే వస్తున్నది.

ప్రాణంపోయినా సరేగాని అటువంటి నీచానికిమాత్రం ఒడిగట్టరాదన్న పట్టుదలొకటి కోటమ్మలో ఆమెకు తెలియకుండానే హటంవేసుకుకూర్చున్నది. అది ఆమె ప్రవృత్తి!

* * *

చెరువునుంచి నీళ్లుతెచ్చే పని పూర్తిచేసుకుని ఆ రోజున కోటమ్మ ఇంటికి తిరిగి వచ్చేప్పటికి షావుకారు రామయ్య ఇంటిముందు నుంచొనిఉన్నాడు. తనను చూచాడు. అయినా చూడనట్టు గడపలోంచి కదలడు.

"దణ్ణాలండి బాబుగారూ" అన్నది కోటమ్మ భయంగానే.

"ఏం కోటమ్మా బాగుండావా?...... హీ...హీ..." అన్నాడు షావుకారు. అంతేకాని దోవతొలగడు. తను కొంపలోకి పోవాలి. పదిమంది పోయేదారనయినా ఆయనకు లేదు. ఎట్లా?

అయినా నిబ్బరించుకుని "ఏం బాబూ?. ఇటొచ్చారూ" అన్నది కోటమ్మ.

"ఆ...ఏంలేదు...చూడూ ఈ స్తలం నాదగ్గర మీనాయన అద్దెకు తీసుకున్నాడు. కంట్రాక్టు పూర్తయింది. మరీ..."

"..............."

"భయపడమాకు. మరేం ఫరవాలేదు." అంటూ షావుకారు దోవతొలిగాడు. కోటమ్మ తలుపు తాళం తియ్యగానే షావుకారుకూడా లోపలికి వచ్చాడు.

చిరిగిన పాత గోనెసంచీ తీసి దులిపింది కోటమ్మ. దువ్వ వచ్చి కళ్లల్లో పడుతుంటే కళ్ళు నలుపుకుంటూ "ఆ...అదంతా ఎందుకే పిల్లా" అన్నాడు షావుకారు పళ్లు ఇగిలిస్తూ.

"కూచోండి బాబయ్యా" అని కోటమ్మ పోయి పొయిదగ్గర చాటుగా నుంచున్నది.

అయిదు నిమిషాలు షావుకారు ఇంటి పైకప్పుకేసి చూచాడు. చూచి నీళ్లు నమలి చప్పరించినట్టు "కొంపంతా పడిపోతోంది కోటమ్మా. బాగుచేయించాలి. రెల్లంతా లేచిపోతోంది. గోడలకు చెదలుపడుతోంది" అన్నాడు.

(43-వ పేజీ చూడండి)

# రాధారాణి

ఆర్. వి. జి. కృష్ణమూర్తి

అప్పుడే వచ్చిన టపా చూడటం ప్రారంభించిన హెడ్‌మాస్టరు, పరంధామయ్యగారు "ఇవన్నీ మామూలే. ఏమీలేదు" అన్నట్టు చూచిపారేశాడు. కానీ, ఆ ఒక్కటే... ఆఖరు కవరు మాత్రం పరంధామయ్యని అలా వదల్లేదు. దాన్లోని ఉత్తరం చూట్టంతోటే పరంధామయ్యకు సంభ్రమమూ, ఆశ్చర్యమూ కలిగాయి. దాన్ని మళ్ళీ పైనుంచి క్రింది వరకూ చదివాడు. మరోసారి నవ్వుతూనే పెద్దగా చదివాడు. కళ్ళద్దాలు తీసి, కాగితాన్ని పరీక్షించి, కళ్ళు నలుపుకుని, మళ్ళీ జోడు పెట్టుకుని ఆఖరిసారిగా చదువుకుని, మిగతా టపాలోంచి దాన్ని వేరుచేసి, తాపీగా ఆలోచించుకుని, హడావుడిగా టేబుల్ మీది బెల్ నొక్కి, గట్టిగా 'ప్యూన్' అని కేకేశాడు. హెడ్‌మాస్టరు ఎంత పెద్దగా, హడావుడిగా, తీవిగా కేకేశాడో, అంత నెమ్మదిగా, నిదానంగా, తూగుతూ, "సార్" అంటూ వచ్చాడు ప్యూన్.

"ఒరేయ్. మన స్టాఫ్ మెంబర్ల నందర్నీ నేను పిలుస్తున్నానని అర్జెంటుగా రమ్మని చెప్పు—"

"అందర్నీ రమ్మంటారా సార్?"

"అవు(నా. అందర్నీ...కాదుకాదు... సీనియర్ అసిస్టెంట్లనీ, తెలుగు పండిట్‌నీ రమ్మను...ఊ...త్వరగా..." తూగుతూ వెళ్ళాడు ప్యూన్. నాలుగు నిమిషాలసేపు కుర్చీలో చేరగిలబడి పైకప్పుకేసి చూస్తూ ఏదో అనిర్వచనీయమైన ఆనందాన్ననుభవిస్తూ అలాగే కూర్చుండిపోయాడు హెడ్ మాస్టరు పరంధామయ్య. ఐదో నిమిషానికి తెలుగు పండితుడు నరసింహశాస్త్రి, సోషల్ సడీస్ టీచరు మధుసూదనరావూ, సైన్సు టీచరు చలపతిరావూ, లెక్కల మాస్టరు రామలింగం, ఇంగ్లీషు మాస్టరు గోపాలకృష్ణ వగైరా లంతా వచ్చి కూర్చున్నారు.

ఈ అత్యవసర సమావేశానికి అధ్యక్షత వహించిన హెడ్‌మాస్టరు పరంధామయ్యగారు లేచి, "ఈ రోజు చాలా సుదినం. ఎందుకంటే, యింతవరకు యీ పాఠశాల ప్రారంభించిన తర్వాత, యిలాంటి విషయం ఎన్నడూ జరుగలేదు. సరి క్రొత్త సమాచారాన్ని మీ కందచేయబోతున్నాను."

మాస్టార్లు ఒకరిముఖం ఒకరు చూచుకున్నారు.

"ఆ విషయం ఏమిటో తెలుసుకోవాలని మీకందరికీ ఆతురతగా వుంది కదూ! అదే. చెప్పబోతున్నాను. మనస్కూలుకు ఒక అమ్మాయిని టీచరుగా వేశారు. ఆ అమ్మాయి పేరు..." కొంచెం ఆగి, కవర్లోంచి ఉత్తరం తీసి చూచి "కుమారి రాధారాణి. బి. ఏ. బి. ఇడి...ఆమె తక్షణం వచ్చి జాయిన్ కాబోతూంది. బహుశా సోమవారంనాడు రావచ్చు..."

*　　　*　　　*

"కుమారి రాధారాణి... ఎవరీ రాధారాణి?...బహుశా ఆమేనా!...ఏమో!!..." అనుకుంటూ ఇంగ్లీసు మాస్టరు గోపాలకృష్ణ ఆలోచనా సముద్రంలో మునిగి పోయాడు.

*　　　*　　　*

"రాధారాణి... — తనూ, ఆమే ఒకే కాలేజిలో చదివేవాళ్లు. తనకంటే రెండేళ్లు జూనియరు ఆమె. కాలేజిలో అందరికంటె అందగత్తె. తన అందానికి తనే మురిసిపోతుండేది. సౌందర్యగర్వం ఆమెలో తొణికిసలాడేది. అందర్నీ నిర్లక్ష్యం చేసేది. ఆమె అనుగ్రహం కోసం, ఆమె చల్లని చూపు కోసం, కనీసం ఆమెమీది నుంచి ప్రసరించే గాలి కోసం, దీపంచుట్టూ తిరిగే పురుగుల్లాగా తహతహలాడుతూ, తనని వెన్నాడే విద్యార్థులను బలాదూరుచేసి ఎన్నో అవమానాలకు గురయ్యేట్టు చేసేది.

ఆమెతండ్రి నూలువ్యాపారస్తుడు. లక్షాధికారి. లేక లేక కలిగిన ఒకేఒక బిడ్డవడంవల్ల అతి గారాబంగా పెరిగింది. జపాన్ చక్రవర్తికూతురు అలా పెరిగివుండదు. రాక్‌ఫెల్లరు మనుమరాలు ఆమురిపాలు పోయివుండదు. అందం, డబ్బు, చదువు, అన్నీవున్నాయి కాబట్టే రాధారాణికి కన్నూ, మిన్నూ కనుపించలేదు. సౌందర్యంలోపించిన తోటి స్త్రీలనుగూడా అవమాన పరచేది. ప్రతి మగాడు తన అందాన్ని చూచి, తనకి దాసుడైపోతాడని ఆమె భావన. అందుకు తగ్గట్టే విద్యార్థి సమూహం ఆమెకై పడిగాపులు గాచేది.

రంభ, ఊర్వశి, మేనకలుగూడా ఆన ముందు ఎందుకూ కొరగారనీ, బ్యూటీ కాంపిటీషన్‌లో వాళ్ళతో పోటీచేసి గెలువగల ధీమా తనకుందనీ, ఆమె కొందరి స్నేహితురాళ్ళతో ఢంకామీద దెబ్బకొట్టినట్టు చెప్తూంటేప్పుడు, గోపాలకృష్ణ లేడీస్ వెయిటింగ్ రూము ముందునుంచి వెళ్తూ స్వయంగా విన్నాడు. విన్నవాడు విన్నట్లుగానే వెళ్లక "ఎవరీమె?" అన్నట్లుగా అటువైపు తిరిగి చూచాడు.

ఆచూపును రాధారాణి చూపు ఎదుర్కొంది. అంతే......తలవంచుకు వెళ్ళిపోయాడు. ఆ చూచిన క్షణంసేపట్లోనే గోపాలకృష్ణ హృదయంలో పెద్దజ్యోతి వెలిగింది. కాని ఆమెమాటలు జ్ఞాపకం రావడంతో ఆజ్యోతి కాస్తా 'ఠక్' మని ఆరిపోయింది. రాధారాణికిగూడా "యితనెవరా?" అన్నప్రశ్న పుట్టుకొచ్చింది. "తనలోవుండే బాడీగార్డ్సులో యితన్నెప్పుడూ చూళ్ళేదే! ఏం చదువుతున్నాడు? చూచిగూడా ముఖంత్రిప్పుకు వెళ్ళిపోయాడే! సిగ్గుపడ్డాడా!!...లేక భయపడ్డాడా!!!" అని ఆలోచించుకుంటూ వెళ్ళింది.

పరీక్షలన్నీ అయిపోయాక, గోపాలకృష్ణ సినిమాకెళ్ళి వస్తూంటే వెనకాల్నుంచీ ఓకారువచ్చి ప్రక్కన్నే సడన్‌గా ఆగింది. కార్లోంచి ఆ అమ్మాయి తలుపుతెరచుకుని "గోపాలకృష్ణగారూ! పాపం నడచి వెళ్తున్నారు. వచ్చి కారెక్కండి. మిమ్మల్ని దిగబెట్టి వెళ్తాను" అంది.

"అక్కర్లేదండీ నడిచే వెళ్తాను. నాకలవాటేగా! మీరెళ్ళండి. చాలా థాంక్స్." అని తప్పించుకోబోయాడు గోపాలకృష్ణ.

"ఫరవాలేదు. ఎక్కండి," అంటూ కారు దిగివచ్చి చెయ్యిబట్టుకుంది.

ఆ సుకుమారమైన వేళ్ళు తగలడంతో గోపాలకృష్ణకు "యిది కలా, నిజమా" అనిపించింది. కాని, ప్రత్యక్షంగా కనబడ్తూంటే యిది కలని నమ్మలేక, నిజమేనని నిశ్చయించుకున్నాడు. రాధారాణి తనని కారెక్కమని బలవంతం చేయడమేమిటి?— అందులోనూ చెయ్యిబట్టుకు లాగడమేమిటి?—ఇక మొగమాటమి బాగుండదని కార్లో వెనకసీటులో కూర్చోబోయాడు.

"ఆ. ఆ... అలాకాదు...యిక్కడ

కూర్చోండి" అంది తన ప్రక్కనే స్థలం చూపిస్తూ రాధారాణి.

ఆ అందాలబరిణె సరసన కూర్చుని కార్లో వెళ్తుంటే గోపాలకృష్ణ పుష్పక విమానమెక్కి బొందితో స్వర్గానికెళ్తున్నట్టు ఫీలయ్యాడు.

కారు నేరుగా గోపాలకృష్ణ రూముదాటి పార్కువైపు వెళ్ళింది. కారునిలిపి, పార్కులోకి దారితీసింది రాధారాణి. మంత్రముగ్ధుడిలా అనుసరించాడు గోపాలకృష్ణ.

లోపలికెళ్ళడంతోటే "ఏవండీ, నేనందంగా లేనూ?" అని ప్రశ్నించింది రాధారాణి. తలవని తలంపుగా వచ్చిన యీ ప్రశ్నకు ఏమని జవాబివ్వాలో అర్థంగాక వెర్రిగా చూస్తూ అలా నిల్చుండిపోయాడు.

మళ్ళీ అదేప్రశ్న అడిగింది రాధారాణి.

"ఏవండీ, నేనందంగా లేనూ?"

"లేవని ఎవరన్నారు?" ముక్తసరిగా జవాబిచ్చానని మురిసిపోయాడు గోపాలకృష్ణ.

"మీరు చెప్పండి మీకళ్ళకి అందంగా వున్నానా?"

"కాదని నేననడం లేదుగా!"

"అంటే నేనందంగా వున్నానని మీరు ఒప్పుకుంటారా?"

"నేను ఒప్పుకోవడ మెందుకు? మీరు అందగత్తె అని కాలేజి అంతాఘోషిస్తూంటే నేను ఒక్కడ్నీ మీరు అందగత్తె కావంటే ఎవరైనా నమ్ముతారా? లోకం నన్నో వెధవ క్రింద జమకట్టేయదూ?"

"లోకం కోసం మీరు నన్ను అందగత్తె నంటారు. కాని మీదృష్టిలో నేను అందగత్తెను కానన్నమాట." కండ్లనీళ్ళు వచ్చాయి రాధారాణికి. ఆసంగతి గోపాలకృష్ణ గమనించకుండానే యీసారి ఘాటుగా జవాబివ్వాలనుకున్నాడు.

"నేనలాగని ఖచ్చితంగా చెప్పలేను రాధారాణిగారూ. మీరు అందగత్తె లన్నమాట వాస్తవమే. కాని, స్త్రీకి సహజమైన "సిగ్గు" అందాన్ని యినుమడింప జేస్తుంది. ఆడది సిగ్గుఅనేది కించిత్తయినా లేకుండా, నేనందగత్తె ననుకుంటూ, ఎగబడి వీధిని తిరగటం మూలాన్ని సహజమైన అందం గూడా దెబ్బతింటుంది—ఇది నా స్వంత అభిప్రాయమే రాధారాణిగారూ. క్షమించండి. మీరు అందత్తెలు కారని నేనన లేను."

రాధారాణి కన్నీరు చెంపలమీదుగా జారిపోతోంది. పరిపూర్ణ యౌవనంతో మిలమిల మెరిసిపోతున్న ఆయువతిని లైట్ల వెలుగులో చూచాడు. గోపాలకృష్ణ చలించిపోయాడు.

"ఏమి యీమె అందం! ఇలాంటి సౌందర్యవతికి గాక గర్వం మరెవ్వరికుంటుంది? పాపం. నామాటవల్ల ఎంత బాధపడింతో—రాధారాణిగారూ—"

"చాలు. మీరు నన్నింతగా అవమానించారు. వెళ్ళొస్తాను. నమస్తే—" అంటూ వడివడిగా వెళ్ళిపోయింది. దిగ్భ్రాంతుడై వున్నచోటనే నిల్చుండి పోయాడు గోపాలకృష్ణ. కొంచెంసేపటికి కారు బయల్దేరిన శబ్దం వినవచ్చి మళ్లీ యీలోకంలోపడి, నడిచి రూముకు చేరుకున్నాడు.

* * *

"ఆ రాధారాణేనా యీమె. ఆమే అయితే ఈ స్కూలు మాస్టరుద్యోగానికి ఎందుకు వస్తుంది? లక్షాధికారి బిడ్డకు యీ వుద్యోగాలెందుకూ?"... ఈ ఆలోచనలతో ఆరాత్రి నిద్రపట్టలేదు గోపాలకృష్ణకు.

* * *

తెలుగుమాష్టరు నరసింహశాస్త్రి భార్య పోయి సంవత్సరం దాటింది. అంటే ఆమె యీ లోకాన్నే విడిచిపోలేదు. ఒక్క తెలుగు మాస్టార్నే, ఆవూరిని విడిచి జట్కాబండితోలే చెంగయ్యతో పట్నంలో వుంటుంది. ఆమె పోయినరోజునుంచి తెలుగుమాస్టారుకి చేతులు కాలుతున్నాయి. భార్యపోయిన తర్వాత అతనికి కష్టమనిపించే పనుల్లో యీవంట జేసుకోడమే ముఖ్యమైనది.

ఈనాడు ఒక ఉపాధ్యాయిని తమ స్కూల్లో చేరబోతోందంటే సంతోషపడి, ఎగిరి గంతేసినవాళ్లలో తెలుగుమాస్టారే ప్రథముడు. ఇంటికిపోయి జంధ్యాలు చిక్కువిడదీస్తూ సంతోషంతో ఆలోచించుకోవడం మొదలెట్టాడు.

"కుమారి రాధారాణి... పెండ్లిగాలేదేమో పాపం. కుమారిగానే వుండిపోయింది. ఏమైనాగాని మిగతా ఉపాధ్యాయులూ, విద్యార్థులూ, మరీ తన్ను లెక్కజేయడమే లేదీమధ్య. ఈమెవద్ద కొంచెం బెట్టుసరిగా వుండాలి. మొన్న—ఓ స్కూల్ ఫైనల్ కుంక నన్నుజూచి 'జట్కావాలా' అని కూస్తాడు. ఆ ముండ జేసిన వెధవముండాపనికి నేను తలెత్తుకోలేకుండా వున్నాను. యీ అమ్మాయి గనక నాకు యీడుసరిపోతే హెడ్‌మాస్టరుగారితో మాట్లాడి ఆమూడు ముళ్ళూ పడేస్తాను" అనుకుంటూ కాలం గడిపాడు. ఇలా ఎన్నోసార్లు ఎందరినో చూచి పెండ్లిచేసుకోవాలనుకున్నాడు. కాని ఒక్కటీ కలిసిరాలేదు. అందుకనే తెలుగు మాస్టారి ద్వితీయవివాహం వాయిదాలు పడిపోయింది.

అంతా ఎదురుచూచిన సోమవారం రానే వచ్చింది. పదిగంటలప్రాంతంలో ఓఅమ్మాయి గేటుదాటి లోపలికొస్తూంది. స్టాఫురూములో టీచర్లు కిటికీల్లోంచి చూస్తున్నారు. ఆ అమ్మాయి నేరుగా హెడ్‌మాస్టరు రూంలో కెళ్లింది.

కొంతసేపటికి హెడ్‌మాస్టరూ, ఆమె కలిసి స్టాఫురూంలోకి రావడంతో, ఏదో లోకాభిరామాయణం మాట్లాడుకుంటున్న టీచర్లంతా లేచి నిల్చున్నారు. గోపాలకృష్ణ మాత్రం అప్పటికింకా రాలేదు.

"ఈమె కుమారి రాధారాణిగారు. మన స్కూలుకు క్రొత్తగా వచ్చిన టీచరు," అని హెడ్‌మాస్టరు టీచర్లందర్నీ పరిచయం చేయడం ప్రారంభించాడు. పరిచయం చేయడమైపోయాక వెళ్లిపోబోయారు, హెడ్‌మాస్టరూ, రాధారాణి. కాని గోపాలకృష్ణ అప్పుడే రావడంమూలాన్ని అతణ్ణిగూడా పరిచయంచేశాడు హెడ్‌మాస్టరు.

"ఇతను మిస్టర్ గోపాలకృష్ణ. ఇంగ్లీషు అసిస్టెంట్" అన్నాడు హెడ్‌మాస్టరు. గోపాలకృష్ణవైపు తిరిగి "ఈమె మనక్రొత్త టీచరు మిస్. రాధారాణి."

గోపాలకృష్ణ ఆమెవైపు పరీక్షగా చూచాడు. ఆమె సిగ్గుతో తలవాల్చేసింది.

'టీచర్ రాధారాణిలో కాలేజిస్టూడెంట్ రాధారాణి లీలామాత్రంగా కనబడుతూంది. కాని, పూర్తిగా పోలికల్లేవు, ఈరాధారాణికి ముఖంపైన మశూచికపు గుంటలున్నాయి. శరీరం చామనచాయలోవుంది. వినయం, నమ్రత, సిగ్గు యీమెలో మూర్తీభవించివున్నాయి. ఆ రాధారాణిలోని చలాకీతనం, ఆమెలోని మిడిసిపాటు, ఆగర్వపు చూపులు



చిత్రం: అర్జునుడికి పాశుపతాస్త్ర ప్రదానం.

యీ మెలో మచ్చునైనా లేవు కాని ఆరాధారాణి యీ మెలో రేఖామాత్రంగా కనిపిస్తూంది.'

ఈ ఆలోచనలోనే క్లాసుకెళ్ళాడు గోపాలకృష్ణ. క్లాసులో పిల్లలకేమీ చెప్పకుండా కూర్చున్నాడు. ఆనాటిరాత్రి తనని కారులో కిలాగి కూర్చోబెట్టడం — పార్కులో కెళ్లడం — అన్నీ గుర్తుకొస్తున్నాయి.

ఛీ. ఛీ. ఆ రాధారాణి ఏభవనంలోనో హాయిగా విహరిస్తూంటుంది మత్తెక్కిన యవ్వనంతో, వేలెట్టిచూపలేని సౌందర్యంతో, మితిమీరిన సౌభాగ్యంతో తులతూగుతూంటుంది. ఈ రాధారాణి పొట్టచేత బట్టుకు వచ్చిన రాధా రాణి, ఆ రాధారాణి గాదు" అనుకుంటూ కూర్చుని వున్నాడు స్టాఫ్‌రూంలో ఒంటరిగా.

"ఏమండీ, గోపాలకృష్ణగారూ!"

సన్నని, మంధుర కంఠస్వరం తన ఆలోచనలకి భంగం కలిగించింది వెనుదిరిగి చూడక మును పే ముందుకువచ్చి నిల్చుంది క్రొత్త ఉపాధ్యాయిని.

"కూర్చోండి" అన్నాడు గోపాలకృష్ణ కుర్చీ చూపిస్తూ.

"ఏమండీ, నేను జ్ఞాపకమున్నానా?"

"లేకేం రాధారాణిగారూ? అప్పట్నుంచీ అదే ఆలోచిస్తున్నాను. సరేగాని, మీకీ మహూచిక మెప్పుడువచ్చిందీ?"

"రెండేళ్ళయింది. దీనితో యిలా అయిపోయాను. అప్పుడే మానాన్న చనిపోయాడు." రాధారాణికి కళ్ళనిండా నీళ్లు తిరిగాయి

ఇంతిసేపు ఆ రూములో ఎవ్వరూ లేరు. ఆ సమయంలో తెలుగు మాష్టారు ప్రవేశించి వీళ్ళనిచూచి తిటాలున వెనక్కెళ్ళాడు.

"పూర్కోండి రాధారాణిగారూ! జరిగిపోయినదానికి విచారించి ఏం లాభం? — సరే, మీ ఆస్తిపాస్తు లేమైపోయాయి. ఈ వుద్యోగానికి వచ్చారే?"

"మా నాన్న దేశమంతా అప్పులుచేసి పోయాడు. చనిపోయిన తక్షణం అప్పులవాళ్ళొచ్చి ఎవరెవరికి రావలసింది వాళ్ళు స్వాధీనపరచుకున్నారు మా అమ్మ నాన్నకంటే రెండు నెలలు ముందే చనిపోయింది ఇక నాకు 'నా' అన్నవాళ్ళెవ్వరూ లేకుండా పోయారు ఆస్తి పోవడంతో బంధువులంతా తప్పుకున్నారు జీవనాధారం లేక బి. ఇడి. చదివేను జీవితమంటే ఏమిటో యిన్నాళ్లకు తెలుసుకున్నాను.

గోపాలకృష్ణ నెమ్మదిగా నవ్వుకున్నాడు.

"మీకు నవ్వొస్తుంది గోపాలకృష్ణగారూ ఇప్పటికే నన్ను చూచి అందరూ నవ్వారు ఆ రోజుల్లో నా అందాన్ని చూచి అసూయపడ్డ వాళ్ళందరికీ యిప్పుడు సంతోషంగా వుంది. నిజం చెప్పాలంటే, నాకు ఆస్తి పోయిందనుకూడా దిగుల్లేదు. నా అందమిలా అయిపోయిందనే దిగులుతో చస్తున్నాను," అంది రాధారాణి.

"క్షమించండి రాధారాణిగారూ! మిమ్మల్ని కష్టపెట్టాలని నవ్వలేదు. కాని ఆరోజు పార్కులోని సంఘటన జ్ఞాపకమొచ్చి నవ్వాను," అన్నాడు గోపాలకృష్ణ పశ్చాత్తాప పడుతూ.

"మీకిప్పుడు జ్ఞాపకమొచ్చింది కాని, నాకు మశూచికే మొచ్చిందీ మొదలు యీనాటివరకూ ప్రతినిమిషంలోనూ ఆ సంఘటన నా గుండెల్ని పిండుతూంటుంది గోపాలకృష్ణగారూ"

స్కూలు గంట కొట్టారు తరవాత పీరి

యడుకు క్లాసు కెళ్ళేందుకు లేచాడు గోపాలకృష్ణ. రాధారాణి వెళ్ళి హెడ్‌మాస్టరు రూములో కూర్చుంది.

రెండురోజుల తర్వాత రాధారాణి గోపాలకృష్ణవద్దకు వచ్చి "నాకిక్కడేమీ ప్రొద్దుపోవడం లేదండీ. తెలిసినవాళ్ళు గూడా ఎవ్వరూ లేరు. కాస్త మీ ఆవిడని పరిచయంచేస్తారూ?" అంది ప్రాధేయపూర్వకంగా.

గోపాలకృష్ణ గట్టిగా నవ్వేశాడు.

"ఇంకా నాకో ఆవిడంటూ ఎవరూ లేరండీ. హోటలు భోజనం, రూము నిద్ర," అంటూ క్లాసు కెళ్ళిపోయాడు.

* * *

తెలుగుమాస్టరు నరసింహశాస్త్రి రాధారాణినిగురించి ఆరాలుతీయడం ప్రారంభించాడు. ఆమె కులం, గోత్రం అన్నీ బాగున్నాయని తెలుసుకున్నాడు. ఇక తన్ను వివాహమాడేందుకు ఆమె అంగీకారమే తరువాయి—

'అయినా తనకేం. నిక్షేపంలాంటివాడు. ఒకటో తేదీకి కరక్టుగా ఖంగున నట్టింట్లో మ్రోగే జీతపు రూపాయలు, దేవిడీలాంటి యిల్లు, అయిదెకరాల మాగాణీ...ఎటొచ్చీ తన కుండే ఆ ఒక్క మచ్చ...ఆ వెధవ భార్యముండ లేచిపోవడ మొక్కటే...దీనికింతగా ఆ అమ్మాయిగూడా ఆలోచించాల్సిన అవసరం ఉండదు. ఈ కాలంలో ఎందరు లేచిపోవడం లేదు? అయినా అది ఇప్పుడు పరిపాటై పోయింది. ఇక అది లేచిపోయినా తను యిలా మడిగట్టు కూర్చుంటే ఎలా?'

తెలుగు మాస్టారు రాత్రి భోంచేసి అలా హెడ్ మాస్టరుగారింటివైపు వెళ్ళాడు. హెడ్‌మాస్టరు కుర్చీ చూపించి కూర్చోమన్నారు. తెలుగుమాస్టారు తన కష్టసుఖాలు యింట్లో తను వంటచేసే బాధ, తన ఆరోగ్యము, అన్నీ ఏకరువు పెడుతూ "త్వరగా ఓ పిల్లనుచూచి కట్టుకొంటే నాకు శాంతి లభించదండీ. పెద్దలు—మీరీ భారంవహించి నన్నో ఇంటివాణ్ణి చేసేందుకు కంకణం కట్టుకోండి" అని దీనాతిదీనుడై, ముకుళిత హస్తుడై, ప్రార్థించాడు పరంధామయ్యను.

హెడ్‌మాస్టరుకు పెళ్ళిళ్ళు జరిపించడమన్నా, పెళ్ళిలో పెత్తనం వహించడమన్నా మహా సరదా. "ఒక ఇల్లు నిలబెట్టేందుకు నూరబద్ధాలేమిటి ... వెధవది ... లక్ష అబద్ధాలయినా నిరాటంకంగా ఆడేయవచ్చు ...ఎలాగయినా పెండ్లి జరిగేట్లు చూడాలి గాని" అన్నాడు పరంధామయ్య యీమధ్య జరిగిన ఓ వివాహ సందర్భములో.

తెలుగుమాస్టారి యీ ప్రార్థనతో పరంధామయ్య మనసు కరిగింది; కళ్ళు మూసుకుని ఓ రెండునిమిషాలు ఆలోచించి—

"నీ ఎరికలో ఎవరయినా కన్యలున్నారూ?" అన్నాడు పరంధామయ్య.

"లేకేమండి. ఉన్నారు. కానీ...అతకదేమో?"

"ఆ. అతకడ మేమిటయ్యా......ఎవరు? చెప్పు?"

తెలుగు మాస్టారికి కొద్దిగా భయంపుట్టింది తీరా అసలుపేరు చెప్పాక ఆయనకేమి కోపం వస్తుందో! "పో. పోవయ్యా. దౌర్భాగ్యుడా. ఒక పెళ్ళాన్ని అదుపులో పెట్టుకో లేకపోయ్యావ్. మళ్ళీ పెళ్ళట...పెళ్ళి... అందులోనూ చదువుకొంది. నీకంటె ఎక్కువ సంపాయించే పిల్లాయె. వెర్రి వెర్రి ఆలోచనల్చెయ్యక గుట్టుగా వుండు" అని చీవాట్లేస్తాడేమో.

"చెప్పవయ్యా. ఎవరేమిటి ఆ అమ్మాయి?" మళ్ళీ అడిగాడు పరంధామయ్య.

"తమకు కోపం రాదుగదా—మరి...మన క్రొత్త టీచరుందే — ఆమెను చేసుకోవాలనుందండీ."

పరంధామయ్య ఆశ్చర్యంగా చూచాడు తెలుగు మాస్టారివంక. మాస్టారు గుటకలు మ్రింగడం ప్రారంభించాడు.

"అయితే. ఆమె ఒప్పుకుందా?"

"అబ్బె. యీ విషయం నేనింకా కదపలేదుగా ఆమెవద్ద."

"ఆమె చేసుకుంటుందని నమ్మకముందా అని. తీరా అడిగిన తర్వాత ఆమె నిరాకరిస్తే నా గౌరవ ముంటుందీ?"

"అవునవున్లెండి. కాని మీ రడిగేకంటే వేరే మధ్యవర్తులద్వారా జరిపించడం మంచిది గదండీ."

"ఆమెతో చనువుగా మాట్లాడే వాళ్లెవరున్నారండీ?"

"ఆ గోపాలకృష్ణ లేడూ. అతడూ, ఈమే ఒకేచోట చదువుకున్నారటండీ. వచ్చిన రోజే వాళ్ళు గుసగుస లాడుకుంటున్నారండీ ఉపాధ్యాయుల గదిలో..."

"అయితే నే కనుక్కుంటాలే. నువ్వెళ్ళు" అని పడుకునేందు కెళ్ళాడు పరంధామయ్య తెలుగుమాస్టారు తిన్నగా ఇంటిముఖం పట్టాడు.

* * *

రాధారాణిని తెలుగుమాస్టరు పెళ్ళాడాలనుకుంటున్నాడని రాధారాణికంటే ముందుగా విద్యార్థులకీ, ఉపాధ్యాయులకీ, వూళ్ళో వాళ్ళకి తెలిసిపోయింది. తను దారినవెళుతూంటే వూళ్ళో వాళ్లు తనని చూపిస్తూ ఏదో గుసగుసలాడ్తూంటే ఆశ్చర్యపోయింది రాధారాణి. క్లాసులో పిల్లల ముసి ముసి నవ్వుల్లోని కొంటెతనాన్ని కనిపెట్టేసింది. తోటి ఉపాధ్యాయులందరూ ఒకవిధంగా తనవైపు చూచి ముఖం త్రిప్పుకెళ్ళిపోతూంటే తన వంటిమీద తేళ్లూ, జెఱ్ఱులూ ప్రాకినట్లయింది గోపాలకృష్ణ ఒంటరిగా వుండే సమయం కనిపెట్టి "ఏమిటీ వింతవైఖరి?" అని అడిగింది రాధారాణి.

అప్పటివరకూ హెడ్ మాస్టరు తనపై మోపిన భారాన్ని ఎలా బైటపెట్టడమా అని ఆలోచిస్తున్న గోపాలకృష్ణకు చక్కటి సమయం దొరికింది.

"రాధారాణిగారూ. మీకూ నాకూ పరీక్షా సమయం వచ్చింది. ఇప్పటివరకా విషయాన్ని ఎలా బైటపెట్టడమా అని ఆలోచిస్తున్నాను."

"చెప్పండి. ఏమిటది?"

"ఏమీ లేదు. 'తెలుగు మాస్టార్ని మీరు వివాహమాడేందుకు అంగీకరిస్తారా' అని తెలుసుకోమని నన్ను నియమించాడు హెడ్

#  రాధారాణి 

మాస్టరు. ఈవిషయం అప్పుడే విద్యార్థులకూ, ఉపాధ్యాయులకూ తెలిసిపోయింది. పైగా యీ వూరు అటు బస్తీగాదు, యిటు చిన్న పల్లేగాదు గాబట్టి వూళ్లో అప్పుడే మీమీద గుసగుసలు ప్రారంభమైనాయి."

రాధారాణితల గిర్రున తిరిగిపోయింది. "వీళ్లు మానవులేనా? యిరవై రెండేళ్ళయినా నిండని నేను ఆ ముసలాడ్ని పెళ్లాడాలా? ఆ పిలకా, ఆ నస్యం...ఆయనా,... నేను వీళ్ళకళ్ళకి అంత నీచంగా అగుపిస్తున్నానా? ఆడదంటే వీళ్లి కింత చులకనా?... ఆ పాడు మహూచికం నాకే రావాలా?..." ఏడుస్తూ పడిపోయింది. చాలాసేపు వరకూ లేవలేదు. విద్యార్థులంతా గుమిగూడారు. సైన్సు టీచరు వచ్చి అందర్నీ వెలుపలికి వెళ్ళమని రాధారాణి ముఖంమీద చల్లటి నీళ్లు చల్లాడు. కొంచెం సేపటికి లేచి కూర్చుంది.

ఆ రోజు జ్వరం బాగా వచ్చింది. ఇంట్లో తనకి తోడెవ్వరూ లేరు. అప్పుడప్పుడూ ఫిఫ్త్ ఫారం చదివే పార్వతి వచ్చి సహాయం చేస్తూంది.



తెలుగు మాస్టారు గోపాలకృష్ణని పీక్కుతినడం ప్రారంభించాడు. "గోపాలకృష్ణ గారూ, నన్ను పాలలో ముంచినా నీటిలో ముంచినా మీరే! మీమీద పంచరత్నాలు వ్రాస్తాను. జరీకండువా బహుమతిచ్చుకుంటాను. నా ఆశలన్నీ మీ మీద నే వున్నాయి. మీరు తలచుకుని పట్టుబడితే ఆమె నాదైపోయిందన్నమాటే" ఇలా అంటూ వెంటబడుతున్నాడు.

వారంరోజుల్లో రాధారాణికి జ్వరం నయమై స్కూలుకు రావడం ప్రారంభించింది. హెడ్‌మాస్టరు తెలుగు మాస్టారితో మాట్లాడి ఆయనింట్లో ఉపాధ్యాయులందరికి ఓటీపార్టీ యివ్వమని చెప్పాడు. డబ్బు ఖర్చుతోగూడిన ఏ పనయినా, యీ టీపార్టీ వలన రాధారాణితో తనకు కొంతగాకపోతే కొంతయినా సన్నిహిత మేర్పడుతుందనీ, కాబోయే పెండ్లి కదే ముఖ్యమనీ, తెలుగు మాస్టారిందుకు వప్పుకున్నాడు.

టీపార్టీకి వెళ్లడం రాధారాణికి సుతరామూ యిష్టం లేకపోయినా, పరంధామయ్య పట్టిన పట్టువల్ల వెళ్ళక తప్పిందిగాదు.

తెలుగు మాస్టారింట్లో రాధారాణికి ఎదురుగా గోడమీద ఓ ఫోటో కన్పించింది. ఆ ఫోటో సగానికి కత్తిరించబడివుంది. మిగతా సగంలో తెలుగు మాస్టారు కుర్చీ మీద కూర్చుని వున్నాడు. కుర్చీమీద మరో చెయ్యి కన్పిస్తూంది. ఆ చేతికి గాజులున్నాయి. మిగతాభాగం మాత్రం కత్తిరించబడివుంది. రాధారాణికి ఓ చిలిపి ఆలోచన పుట్టింది.

"మాస్టారూ! ఆ ఫోటో ఎవరిదండీ, బాగుందే" అంది రాధారాణి.

"అది నాదేనండీ. మరి నన్ను అంతా పెద్దవాణ్ణి అనుకుంటారేగాని, ఆ ఫోటో గ్రాఫు చూడండీ. నే నెంత చిన్నవాణ్ణో. రెండేళ్ళక్రితం నే నచ్చం అలాగే వుండేవాణ్ణి." అంటూ ఫోటోను పై కండువాతో తుడిచి ఆమెచేతి కిచ్చాడు.

ఆమె నిదానంగా చూచి "మరి. మీ కుర్చీమీదవుండే యీ చెయ్యి ఎవరిదండీ?" అంది.

"అదా...అది మా తమ్ముడిది లేచని పోయాడీ మధ్యనే. ఉత్త దొంగవెధవ..." అన్నాడు కంగారుగా. అసలతనికి తమ్ముడే లేడు. అది తన లేచిపోయిన భార్యతాలూకు చెయ్యి అని చెబితే ఏమైనా వుందీ!!

"మీ తమ్ముడు గాజులు తొడిగే వారటండీ!"

అందరి నవ్వులతో మారుమోగి నట్లయింది యిల్లంతా. పరంధామయ్య చేతులు నెత్తి మీద పెట్టుకున్నాడు. త్వరగాలేచి "ఇక వెళ్దామా, ప్రొద్దు పోయింది." అన్నాడు పరంధామయ్య. అంతా లేచారు. తెలుగు మాస్టారికి 'థాంక్సు' చెప్పి వెళ్ళారు.

నాలుగురోజుల తర్వాత హెడ్‌మాస్టరే స్వయంగా ఎత్తాడు పెళ్ళిసంగతి. ఆమె "ససేమిరా. వల్లకాదు" అంది "చూడమ్మాయ్. నీవు చిన్నపిల్లవుకాదు. మనమంతా కడుపు చేతపట్టుకు వచ్చిన వాళ్ళం. అందులోను నీవు స్త్రీవి. మనదేశంలో స్త్రీ ఎప్పుడూ ఒకరిమీద ఆధారపడి వుండాల్సిందే. ఈ సమయంలో నీకు అండగా మగాడు లేకపోవడం విచారకరం. నన్ను తప్పుగా అర్థం చేసుకోకు. నీకు తండ్రిలాంటి వాడిని. తెలుగు మాస్టరు యీ వూళ్లో అందరికీ తల్లో నాలుకలాంటి వాడు. ఆస్తివుంది. మాట నెగ్గించుకోగల స్తోమతవుంది. అలాంటివాడిని కాదనడం శ్రేయస్కరంగాదు..."

"క్షమించండి. ఈ ఆస్తిపాస్తుల విషయం నాకు చెప్పక్కర్లేదు. కాలం కలిసిరాక యిలా అయ్యానుగాని, లేకుంటే యీ తెలుగు మాస్టార్లాంటివాళ్లను వంద మందిని పోషించగలిగి వుండేదాన్ని—"

"ఆ విషయాలన్నీ నాకు తెలుసు నమ్మాయ్. జరిగిపోయినదానికి వగచి ఏం లాభం చెప్పు. నీ వొకప్పుడెంతో అందగత్తెవని నాకు తెలుసు. కాని నీవు యిప్పుడిల్లా అయ్యావంటే ఎవరిది తప్పు?...ఖర్మ... అందుకు తగ్గట్టే మనము నడుచుకోవాలి... కానీ, ఒక్కమాటమ్మాయ్ నీయిప్పటి అందచందాల మీద నీకు పెద్ద అభిప్రాయాలున్నాయేమో...అవేం ఏం పెట్టుకోకు... నిజం చెప్పాలొస్తే యింతకంటే గొప్ప వరుడు నీకు దొరకడు..."

"షటప్" గట్టిగా అరచింది రాధారాణి వచ్చే ఏడుపు నాపుకో నేందుకు ప్రయత్నించింది. కాని ఆపుకోలేక ఏడ్చింది. ముఖం జేవురించింది. ఆ కోపంలో ముఖం మరీ అసహ్యమై పోయింది. ప్రక్కకు తిరిగి నిల్చుంది. ఎదుట అద్దాలబీరువాలో తన ముఖం కనిపించింది. భరించలేకపోయింది. "ఏమిటే! తన ముఖం యింత వికృతంగా వుందే?" కళ్లుగట్టిగా మూసుకుంది.

రాధారాణికి వచ్చిన కోపానికి, ఆమె షటప్ అన్నందుకు హెడ్‌మాస్టరు భయపడలేదు. కాని జాలితో నిండిపోయింది ఆయన హృదయం. ఆయన అంత కఠినంగా మాట్లాడడంటే ఆమెమీద ద్వేషభావంతోనూ కాదు, లేక ఆమె మనసు నొప్పించాలనీ కాదు. కాని, ఒక పెండ్లి జరిపించాలనే ఆతురతతోనే అలా అన్నాడు. "తన కూతుర్నే ఎవరైనా యిలా అడిగుంటే..."

## ★ రాధారాణి ★

అన్నిటినీ ఆత్మవిమర్శన చేసుకునే అలా ప్రవర్తించాడు పరంధామయ్య.

"నిజం చెప్పాలంటే... యింతకంటే మంచివరుడు నీకు దొరకడు" అన్నమాటలు యింకా ఆమెలో ప్రతిధ్వనిస్తున్నాయ్. అద్దంలో ముఖం చూచుకున్న రాధారాణికి తనమీద తనకే నమ్మకం పోయింది. "నేనింత వికృతంగా వున్నానా? నేనంటే పిల్లలంతా భయపడుతున్నారా? నాకు యింతకంటే మంచిభర్త దొరకడా?"... కన్నీరు కారుస్తూంటే రాధారాణికి దగ్గరగా వచ్చిన పరంధామయ్య పాదాలు కనుపించాయి.

"పాపం ... పెద్దవాణ్ణి పటప్ అన్నాను. ఏమనుకున్నాడో"... తటాలున ఆయన పాదాలు పట్టుకుని "క్షమించండి. ఆ వేశంలో ఏదో అన్నాను" అంది.

"పరవాలేదమ్మాయ్ నాకూ బిడ్డలున్నారు. నా బిడ్డల్లో నీవూ ఒకదానివి. నీవేమన్నా నాకేం బాధలేదమ్మా" అన్నాడు ప్రేమగా.

"అయితే నీవు అంగీకరించావా అమ్మాయ్?" అడిగాడు పరంధామయ్య కొంచెం ఆగి.

రాధారాణి మౌనంగా, నిశ్చలంగా వుండిపోయింది.

మౌనంగా అంగీకారసూచకంగా భావించాడు పరంధామయ్య.

* * *

'రాధారాణి తెలుగు మాస్టార్ని పెళ్ళాడేందుకంగీకరించింది' అనే వార్త క్షణంలో అందరికీ తెలిసిపోయింది.

తెలుగు మాస్టారు రెక్కలుగట్టుకు వచ్చి వాలాడు పరంధామయ్య వద్ద.

"ముహూర్తం చూడండి మాస్టారూ?" అన్నాడు చుట్ట వెలిగించి పరంధామయ్య.

"మాచే వుంచానండి. సరిగ్గా నాలుగో నాడు శుక్రవారంనాటికి బహు భేషుగ్గా వుంది. దేవాలయంలో గానిచ్చేద్దాం" అన్నాడు ఆత్రంతో.

"ఈకొద్ది వ్యవధిలో నీవు అన్నీ సమకూర్చుకోగలవూ?"

"ఓ..." అన్నాడు ధీమాగా. ఎలాగైనా పెండ్లే అతడికిక్కావలసింది.

గోపాలకృష్ణ యీ విషయం మొదట నమ్మలేకపోయాడు. కాని ముహూర్తం విషయంగూడా తెలిసిన తర్వాత ఏమిటో అయోమయంలోపడిపోయాడు. మళ్ళీ పాత కథలన్నీ స్మృతిలోకి వచ్చాయి. ఎక్కడి రాధారాణి—ఎక్కడి తెలుగు మాస్టరు—అందాల రాధారాణి—ఆమె ప్రేమకోసం పడిగాపులు కాచిన కాలేజి విద్యార్థులూ—రెండో పెళ్ళి తెలుగు మాస్టరూ—యివన్నీ ఆలోచిస్తూ అతని బుర్ర తిరిగిపోయింది. ఇంకా యీ వూళ్ళో వుండి ఆ పెళ్ళి చూడకూడదనుకుని స్కూలుకు శలవు పెట్టి వెళ్ళాడు. వెళ్ళేముందు రాధారాణికి ఓ ఉత్తరం వ్రాశాడు.

"మీరు యింతటి హైన్యానికి పాల్పడతారనుకోలేదు. పురుషుడి అండ లేకపోయినంత మాత్రాన మీరు యిప్పుడు పడే కష్టాలేమీ లేవు. కాని మీరు మీ జీవితాన్ని చేజేతులా నాశనం చేసుకున్నారని తెలుసుకోండి. మీ వివాహాన్ని చూడలేకనే వెళ్తున్నాను. మళ్ళీ వచ్చేది గూడా లేదు. పోస్టులోనే రాజీనామాను పంపుతున్నాను. శెలవు...శీఘ్రమే సంతానప్రాప్తిరస్తు..."

అని వ్రాసి ఓ కుర్రాడిచేత పంపాడు రాధారాణికి.

ఆ ఉత్తరం చదువుకున్న రాధారాణికి కడుపులో చెయ్యిపెట్టి దేవినట్లయింది. తన అస్థిపంజరం తనముందు నాట్యంచేస్తూంది. దాని ప్రక్కనే పూర్వపు రాధారాణి తెల్లటి గుస్తుల్లో మెరిసిపోతూ ప్రత్యక్షమైంది. పూర్వపు రాధారాణి వెక్కిరిస్తూ కిలకిలా నవ్వుతూంది. రాధారాణికి ముచ్చెమటలు పోసాయి. కెవ్వుమని కేకేసి పడిపోయింది. మర్నాటికి వళ్లు తెలిసి కళ్లు తెరిచేప్పటికి పరంధామయ్య, ఆయన భార్య వచ్చి కూర్చునివున్నారు. అయోమయంగా వాళ్ళవేపు చూస్తూ కూర్చుంది రాధారాణి. భార్యతో ఆమెను కనిపెట్టి వుండమని చెప్పి బయటికెళ్ళాడు పరంధామయ్య.

* * * *

వేణుగోపాలస్వామి ఆలయంలో పెళ్ళి పందిట్లో మంగళవాద్యాలు మ్రోగుతున్నాయి. వధువు రాధారాణి, వరుడు నరసింహశాస్త్రి పీటలపై కూర్చున్నారు. రాధారాణి, గుప్లప్ప జెప్పి పెండ్లికుమారుడివైపూ, పురోహితుడివైపూ చూస్తూంది. సకాలంలో తెలుగుమాస్టారు వణికేచేతుల్తో రాధారాణి మశూచికపు మెడలో మాంగల్యధారణ చేశాడు...స్కూలు ప్యూను ఓకవరు తెచ్చి పరంధామయ్య చేతిలోపెట్టి వెళ్ళాడు. పరంధామయ్య దాన్లోని ఉత్తరాన్ని చదివి పెండ్లికొడుకు చెవిలో వూదాడు "గోపాలకృష్ణ రాజీనామా చేసాడు" అని. ఆమాటలు రాధారాణి గూడా విన్నది.

రాధారాణి గుండె దడదడలాడింది. శరీరం కంపించింది. తక్షణం మైకం కమ్మి క్రిందబడిపోయింది. అయిదు నిమిషాల్లో కళ్ళు తెరచింది. గుడ్లు పెద్దవిచేసి చుట్టూ అందరివంకా చూచింది.

చేతికుండే వేళ్లన్నిటినీ లెక్కబెట్టింది.

"మాస్టారూ ద్రౌపతికి భర్తలెందరు?" అని ప్రశ్నించింది పెండ్లికొడుకుని.

బిక్కమొగం పెట్టాడు తెలుగు మాస్టరు. పెండ్లికి వచ్చిన వాళ్లకిదంతా ఆశ్చర్యంగా వుంది.

"చెప్పవయ్యా పండితుడూ...హు... ద్రౌపతికెందరు భర్తలో తెలియనివాడికి పెళ్ళాం గావాలీ!...పెళ్ళాం!! చూడండయ్యా మీరు చెప్పండి న్యాయం. ద్రౌపదికి భర్తలెందరో తెలీనివాడా నాభర్త" అంది ఏడుస్తూ అక్కడ కూర్చున్న పెద్దలతో.

"చెప్పండీ పరవాలేదు" అన్నాడు పరంధామయ్య పెళ్లికొడుకుతో.

"అయిదుగురు" అన్నాడు నెమ్మదిగా తెలుగు మాస్టరు.

"అయిదుగురా...కరెక్టు...నీకు సెంట్ పర్సెంట్...సరే...యీ తాళి కట్టిందెవరు? అంది తన మెళ్ళో అప్పుడే కట్టబడిన మాంగల్యాన్ని చూపుతూ.

"నేను"

"నువ్వా...హా...హా...హా...నువ్వా"

అంతే పరంధామయ్య డాక్టర్ని వెంటబెట్టుకువచ్చాడు. డాక్టరుపరీక్షించి "ఈమెను త్వరగా విశాఖపట్నం తీసుకెళ్ళి పిచ్చాసుపత్రిలో చేర్పండి. పిచ్చి యింకా ముదరలేదు. త్వరగా నేకుదరవచ్చు" అన్నాడు. తెలుగు మాస్టరు లబోదిబోమని ఏడ్చాడు. ★

# చూడామణి

అర్ధరాత్రివేళ హాయిగా గుండెలమీద చేతులు వేసుకుని అమాయికంగా నిద్రపోతున్న తన కుమారుల నందరినీ అశ్వత్థామ ఘోరంగా సంహరించివేశాడన్న వార్త చెవినిపడగానే ద్రౌపది వలవలా వాపోయింది. ఏపాపమెరగని ఆ పసివాళ్లలాంటి అపమృత్యువువాతపడిన దుర్వార్త తలుచుకుని ఆమె మాటిమాటికీ కుమిలికుమిలి ఏడ్చింది.

భీమసేను డనేక సాంత్వనవచనాలతో ఆమె నోదార్చాడు. అయినా ఆ వీరమాత హృదయశోకం అలాగే కట్టలు తెంచుకుని ప్రవహించింది. భీమసేనుడంతటివానికికూడా తన కుమారుల ఘోర దుర్మరణం నివారించే అవకాశమైనా కలగలేదే అని ఆమె తన దురదృష్టాని కెంతో విచారించింది. బాష్ప పూరిత రూక్ష దృష్టితో భీమసేనునివైపు చూచింది.

ఆ మహాపాపాత్ముడు అశ్వత్థామను సంహరించి అతని శిరోభూషణమైన చూడామణి తనకు కానుకగా తీసుకొని రావలిసిందనీ, అది కళ్లారా చూచేవరకు తన ప్రాణాలు నిలవని ఆక్రోశించింది.

ధర్మరాజుకు కూడా అశ్వత్థామను కఠినంగా దండించవలెననే సంకల్పం కలిగిందని భీమసేను డంతకుపూర్వమే గ్రహించుకొన్నాడు. అందుచేత ద్రౌపది ఆవిధంగా ఆక్రోశించిన ఉత్తర క్షణంలోనే అశ్వత్థామ మీదికి బయలుదేరాడు. అన్నగారి సంకల్పం గ్రహించిన నకులుడు వెంటనే ఒక రథం ఆయత్తంచేసి తీసుకువచ్చి అతని ఎదట నిలబెట్టాడు. స్వయంగా రథసారథ్యం నిర్వహించాడు. అయితే వారిద్దరికీ కూడా అశ్వత్థామ ఎక్కడ ఉన్నాడో తెలియదు. కురుక్షేత్ర ప్రాంతాలలో సంచరించేవారిని కొందరిని "అశ్వత్థామ జాడ ఎరుగుదురా?" అని ప్రశ్నించారు.

వారిలో కొందరతడు కృప కృతవర్మలతో కలిసి భాగీరథీ తీరంవరకు ప్రయాణంచేశాడనీ, పిమ్మట కృపకృతవర్మ లిద్దరు విడిపోయి వేరొక్కచోటికి వెళ్ళిపోయారనీ, అశ్వత్థామ





"అపాండవ మగుగాక!" అని ఆ అస్త్రం భీమసేనునిమీదికి ప్రయోగించాడు.

# ప్రాచీన గాథాలహరి

ఒక్కడు కృష్ణద్వైపాయనముని ఆశ్రమ సమీపానికి వెళ్ళిపోయాడనీ అతడా ప్రాంతంలోనే నివసిస్తున్నాడనీ అన్నారు. భీమసేనుడామాటవింటూనే అటువైపు రథం నడిపించవలసిందని నకులుని కాజ్ఞాపించాడు.

భీముడావిధంగా కళ్ళుమూసుకొని అశ్వత్థామ మీదికి బయలుదేరాడన్నవార్త వాసుదేవుని చెవిని పడింది. ఆతడెంతో ఆత్రంగా ధర్మరాజుతో ఆ విషయం ప్రస్తావించాడు:

"భీమసేనుడొక్కడు అశ్వత్థామతో యుద్ధం చెయ్యడానికి బయలుదేరినట్లున్నాడు. దీనివల్ల ఏదైనా పెద్దప్రమాదమే సంభవించవచ్చును. కనుక వెంటనే మనం అందరం బయలుదేరివెళ్ళి అతనికి తోడుపడడం అత్యావశ్యకం!" తరవాత శ్రీకృష్ణుడొకక్షణం సేపాగిఆప్రమాద విషయం అతనికి విస్పష్టంగా వివరించాడు:

"ధర్మరాజా! అశ్వత్థామ తనవద్ద బ్రహ్మశిరోనామకాస్త్రం ఉన్నదనే అహంకారంకొద్దీ కన్నూమిన్నూ కానకుండా మిడిసిపడుతున్నాడు. అది ప్రపంచం అంతా దహింపజాలిన దివ్యాస్త్రం. ఆచార్యుడు శిష్యవాత్సల్యంకొద్దీ అర్జునునికి కూడా ఆ అస్త్రం ప్రసాదించాడు. అయితే అశ్వత్థామ అర్జునునిమీది మాత్సర్యంకొద్దీ ఆ అస్త్రం ఎప్పుడైనా ప్రయోగింప వచ్చుననే భయంతో, మానవులమీద అస్త్రం ప్రయోగింప కూడదని కట్టడి చేశాడు. కాని అశ్వత్థామ తండ్రి ఆ విధంగా కట్టడిచేయడానికి గల కారణం వేరు విధంగా గ్రహించుకొన్నాడు. అదీగాక తను చిరంజీవిననే అహంకారంకూడా దానికి తోడైనది. అశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రంవల్ల భీమసేనునికేవిధమైన ఆపత్తు రాకుండా మనం అతని నిప్పుడు సంరక్షించుకోవాలి."

అని చెప్పి శ్రీకృష్ణుడు సాత్యకి సహదేవు లిద్దరినీ పాండవ శిబిర సంరక్షణకోసం అక్కడనే నిలిపి రథం అధిరోహించి ధర్మరాజుతోను, అర్జునునితోనుకలిసి భీమసేనుడు వెళ్ళినదారినే రథం నడిపించాడు. క్షణంలో ఆ రథం భాగీరథీ తీరానికి వెళ్ళిపోయింది.

మరి కొంతసేపటికి వారందరికీ వాయువేగంతో మున్ముందుకు సాగిపోతున్న భీమసేనుని రథం కనిపించింది.

శ్రీకృష్ణుడు తన రథం మరింతవేగంగా మున్ముందుకు నడిపించుకు పోయాడు. కాని అంతలోనే భీముడు రథందిగి ఆప్రాంతంలో మునివేషం ధరించి ముక్కు మూసుకుని కూర్చున్న అశ్వత్థామ దగ్గరకు వెళ్ళి

పి. గణపతిశాస్త్రి



# చూడామణి



పోయాడు.

ఆలోగా ధర్మరాజు, వాసుదేవుడు, అర్జునుడు అతన్ని ఎలుగెత్తి గట్టిగా పిలిచారు. తొందరపడవద్దని హెచ్చరికలు చేస్తూనే ఉన్నారు. కాని భీమసేనుడు వారి హెచ్చరికలు పెడచెవిని పెట్టాడు.

## 2

తన కెదురుగా ఆశ్రమంలో మునివేషంతో ఉన్న అశ్వత్థామను చూడగానే భీమునిహృదయం క్రోధావేశంతో ఘూర్ణిల్లింది:

"బ్రాహ్మణాధమా! ఎంతటి పాపకార్యాని కొడిగట్టి చిట్టచివరి కెలాంటి కపట నాటకం అభినయిస్తున్నావు! చూస్తూండగానే నీవొక మహాఋషీశ్వరుడవై పోయావే! ఇలాంటిమాయానాటకం అభినయిస్తే చావు తప్పిపోతుందని భ్రమిస్తున్నావేమో. చాలు! చాలులే! ఈనాటకం ఈ పాటికి కట్టిపెట్టు! యుద్ధానికి సిద్ధంగా నిలబడు!"

అశ్వత్థామ అలాగే నిశ్చలదృష్టితో భీముని ఉద్ధత ధోరణి అంతా జాగ్రత్తగా గమనించాడు. అనతిదూరంలో అతని కెదురుగా ధర్మజ వాసుదేవార్జునులు ముగ్గురు ప్రత్యక్షమైనారు. వారందరు రథం దిగి తొందర తొందరగా అశ్వద్ధామవైపే నడిచి వస్తున్నారు.

అశ్వత్థామకు వారంతా దివ్యాస్త్రరహస్యవేత్తలన్న విషయం తటాలున స్ఫురణకు వచ్చింది. అర్జునునివద్దకూడా బ్రహ్మశిరోనామకాస్త్రంఉన్న సంగతి అతన్ని మరింత వేధించింది. ఇక ఆ మహాపత్సమయంలో తన బ్రహ్మశిరోనామకాస్త్రం తప్ప మరి వేరేదిక్కేమీ లేదని అత డొక్క క్షుటిలో గ్రహించి వేశాడు. వెంటనే పక్కనే ఉన్న గడ్డిపోచ తుంచి దానిపై బ్రహ్మశిరోనామకాస్త్రం అభిమంత్రించాడు. క్రోధావేశంతో




అతనిముఖం మెలికలుతిరిగి చింతనిప్పులు చెరిగింది:

"అపాండవ మగుగాక!"

అని ఆ అస్త్రం భీమసేనునిమీదికి ప్రయోగించాడు.

ఆ గడ్డిపోచలోనించి భయంకరాగ్నిజ్వాలలు పైపైకి లేచాయి. ఆ అగ్నిజ్వాలలొక్కక్షణంలో ఆకాశం అంతా దహించి వేసేటట్లువ్యాపిస్తుగా విజృంభించాయి. ఇంకొక్క క్షణంలో భీమసేనుడా జ్వాలలో శలభమై భస్మీపటలమై పోవలిసిందే!

కాని క్షణంలో వాసుదేవు డర్జునుణ్ణి హెచ్చరించాడు:

"అర్జునా! అర్జునా! ఇది బ్రహ్మశిరోనామకాస్త్రం! దీనిమీద ఏ అస్త్రం ప్రయోగించినా అది ఎందుకు కొరగాదు! కనక నీవుకూడా నీ దగ్గరఉన్న బ్రహ్మశిరోనామకాస్త్రం దీనిమీద ప్రయోగించు! అది ఒక్కటే దీనిని అడ్డగించగల మహాస్త్రం! నీ సోదరులను, నిన్ను సంరక్షించుకోవాలంటే ఇక ఇంతకన్న గత్యంతరం లేదు! త్వరపడు! త్వరపడు!"

క్షణంలో వారుముగురు రథంమీదినించి కిందికి దిగారు. అర్జునుడు వింట బాణం సంధించాడు. మనస్సులో ద్రోణాచార్యునికి నమస్కారంచేసి బ్రహ్మశిరోనామకాస్త్రం అభిమంత్రించాడు. తన అస్త్రంవల్ల అశ్వత్థామ కేవిధమైన అపకారము కలగకూడదని సంకల్పించాడు. తనకు, తన సోదరులకు శుభ పరంపరలు కలగవలెనని ప్రార్థించి అశ్వత్థామ అస్త్రానికి ప్రతిగా తన అస్త్రం విడిచిపెట్టాడు.

తన అస్త్రంవల్ల అశ్వత్థామఅస్త్రం ఉపశమింపవలెననీ, అనంతరం తన అస్త్రంకూడా ఉపశమింప వలెననీ అతని అభిలాష.

కాని ఆ అస్త్రంవల్ల అశ్వత్థామ అస్త్రం ఉపశమించలేదు. ఆ రెండుఅస్త్రాలు ఆకాశంలో కల్పాంతజ్వాలలవలె భీభత్సంగా ప్రజ్వలించాయి. ఆకాశంఅంతటా అత్యంత భయంకరంగా పిడుగులు పడుతున్న సవ్వడి వినబడింది. శరపరంపరగా తోకచుక్కలు నేలమీద విరుచుకుపడ్డాయి. దూరదూరంగా హస్తినాపురంలో ఉన్న జనంఅందరు ఆనాటితో మరి మహాప్రళయమే ప్రారంభమైనదని భయపడ్డారు.

అంతలో నారదుడు వ్యాసమహర్షి కట్టెదట సాక్షాత్కరించాడు. వారిద్దరు తొందర తొందరగా నడిచివచ్చి అశ్వత్థామార్జునుల మధ్య నిలబడ్డారు:

"అస్త్రరహస్యవేత్తలైన మహావీరులెందరెందరో ఈ ప్రపంచంలో ఉద్భవించారు. వా రెన్నడైనా ఈ బ్రహ్మశిరోనామకాస్త్రం ఇలాగ మానవులమీద ప్రయోగించారా? ఇది న్యాయమేనా?"

అని ఎలుగెత్తి హెచ్చరించారు.

## 3

అర్జునుడు వారిద్దరికీ సవినయంగా నమస్కరించాడు:

"ఈ అస్త్రాలు రెండు ఉపశమింపవలెననే సంకల్పంతోనే నేనీఅస్త్రం ప్రయోగించాను. అంతేగాని నాకు మరి ఒక దుష్ట సంకల్పమేమీ లేదు."

అని వెంటనే తన అస్త్రం ఉపసంహరించి వేశాడు.

ఆవిధంగా ఆ అస్త్రం ఉపసంహరించి వెయ్యడం సామాన్యుల కసాధ్యం! మహాధర్మాత్ముడైన అర్జునునికే అది సాధ్యపడింది. అన్యులెవరైనా తొందరపడి బ్రహ్మశిరోనామకాస్త్రం ఉపసంహరిస్తే అది వనువెంటనే వారినే అణిచివేస్తుంది. అర్జునుని శక్తిసామర్థ్యాలవలోకించిన మహామునులిద్దరు అతని ననేకవిధాల అభినందించారు.

అశ్వత్థామ తాను ప్రయోగించిన బ్రహ్మశిరోనామకాస్త్రం ఉపసంహరింపవలెనని ప్రయత్నించాడు. ఎంతగా ప్రయత్నించినా అతని కది సాధ్యపడలేదు. దానితో అతని ముఖం వెలవెలబోయింది. వెనువెంటనే వ్యాసమహర్షివైపు చూచి సవినయంగా విన్నవించుకొన్నాడు:

"మహర్షీ! భీమసేను డన్యాయంగా నా తండ్రిమృతికి కారణభూతుడైనాడు. అంతటితో ఊరుకోక నన్నుకూడా సంహరించి వెయ్యవలెన నేదురుద్దేశ్యంతో నామీదికి విరుచుకుపడ్డాడు. కేవలం ప్రాణభయంవల్లనే నేనీ అస్త్రం ప్రయోగించాను. ఇది వెనకముందు లాలోచించకుండా మునీంద్రా! నేను సంకల్పించినటిది పాండురాజకుమారులందరినీ సంహరించి తీరవలసిందే! దీనికిక తిరుగు లేదు. నాకిక దీనివల్ల వచ్చే మహాపాతకానికి ఒడిగట్టక తప్పడం లేదు! నేనేమిచెయ్యను?"

ఆ ప్రత్యుత్తరం విని వ్యాసమహర్షి కొంచెంసేపాలోచించి అశ్వత్థామ కొకచక్కని సదుపదేశం చేశాడు:

"అశ్వత్థామా! ద్రోణాచార్యుడు శిష్యునిమీది వాత్సల్యంకొద్దీ అర్జునుని కీఅస్త్రం ప్రసాదించాడు.

"కనకనే నీవెంతటి ద్రోహానికొడిగట్టిగా అతడు నీకెటువంటి అపకారము సంకల్పించి ఉండడం లేదు. నీ అస్త్రానికి మారుగా తన అస్త్రం ప్రయోగించాడు. అంతేగాని తానై మొట్టమొదటగా ఆ అస్త్రప్రయోగాని కుపక్రమించలేదు.

"మేము వలదన్నవెంటనే అది ఉపసంహ

రించివేశాడు. ఇటువంటి ధర్మాత్మున్ని సంహరింపవలెనని సంకల్పించడం నీకు న్యాయం కాదు.

"ఇంకొకవిషయం! ఈ మహాస్త్రం మనుష్యులమీద ప్రయోగించేవారికి తప్పక అశుభం కలుగుతుంది. అదిన్నీగాక, నీ అస్త్రం చిట్టచివరి కితని అస్త్రంచేత ఎలాగైనా ఉపసంహరింపబడి తీరుతుంది. కాని ఆవిధంగా నీఅస్త్రం ఇంకొకరి అస్త్రంచేత ఉపసంహరింపబడడం మంచిదిగాదు. అలాగ ఉపసంహరింపబడినట్లయితేఈ దేశంలో పంద్రెండేళ్లపాటనావృష్టిదోషం కలుగుతుంది.

"ఇది నీకు, ఈదేశానికి క్షేమంకోరి నేను చాలాదూరం ఆలోచించి చెబుతున్నాను. జాగ్రత్తగా విను నాయనా! ఈ అస్త్రం ఉపసంహరించివెయ్యి. ఇక వెనక ముందు లాలోకుంచకు! నామాట విను!

"అదీగాక నీకొకసామరస్యమార్గంకూడా ఉపదేశిస్తున్నాను. అదికూడా శ్రద్ధగా విని నాసంధిమార్గాని కంగీకరించు.

"నాయనా! నీవు తపస్సుచేసుకోవాలని సంకల్పించావు! అటువంటివాడికి నీకిరోషద్వేషాలెందుకయ్యా! నీకు, అర్జునుడికీ అంగీకారయోగ్యమైన మార్గం ఒకటి ఆలోచించి చెబుతున్నాను. అన్నీ నీవన్నట్లే సాగిపోవాలనడం న్యాయం కాదుగదా! సామరస్యమార్గం అర్జునునికీ నీకు ఉభయతారకంగా ఉండడం న్యాయం!

"నీ చూడామణి అర్జునునికిచ్చివెయ్యి. దానితో అర్జునుడేకాక పాండవులందరు నీ ప్రాణం అపహరించినంతగా సంతోషిస్తారు. ఆపైన నీవు సుఖంగాతపస్సు చేసుకోవచ్చును. కనుక వెంటనే నీ అస్త్రం ఉపసంహరించివేసి నీచూడామణి వీరికర్పించు. ఇది చక్కని సామరస్యమార్గం! ఇట్లాగ చెయ్యి నాయనా! నామాట విను!"

ఆమాటలన్నీ అశ్వత్థామ అతిశ్రద్ధగా విన్నాడు. కొంతవరకు వ్యాసమహర్షి చెప్పిన సంధిమార్గం అతనికి సమంజసంగానే స్ఫురించింది. కాని అతని అంతరాంతరాలల్లో పాండవులపై బయలుదేరిన అక్కస్సింకా అలాగే రాజుకుంది:

"మహర్షీ! పాండవేయులకు రత్నాలకేమైనా కొదవా! వారు నాచూడామణి కోసపడడం ఎందుకు? ఇది ధరించినవారికి సర్పభయము, తస్కరభయము, దేవరాక్షసభయము, క్షుద్బాధ తృష్ణ మొదలైనవేవీ ఉండవు! నా మట్టుకు నాకు వీరికి చూడామణి సమర్పించడం సుతరాము ఇష్టంలేదు. కాని నీమాట తీసివేయలేక నీకీరత్నం సమర్పిస్తున్నాను. ఇక నా అస్త్ర











# చూడామణి

లక్ష్యం మాట! ఇది పాండవేయ పత్నీగర్భాలన్నీ దహించివేసి వెంటనే ఉపశమిస్తుంది. అంతవరకు దీని కిక తిరుగులేదు. అంతే!"

అతని ప్రత్యుత్తరం వింటూనే వ్యాస మహర్షి తటాలున ప్రత్యుత్తరం ఇచ్చాడు.

"సరే! అలాగే చేద్దువుగాని! అంతేగాని ఇక వేరే ఆశ పెట్టుకోకు! నాయనా!" అని ఎంతో ఆప్యాయంగా అతన్ని బతిమాలుకొన్నాడు.

కాని ఆ మాటలో ఏదో మెలత ఉన్నట్టశ్వత్థామకు స్ఫురించింది:

"మునీంద్రా! నీవు పాండవ పత్నీగర్భాల ధ్వంసంతోనే సన్మానరట పొందవలసిందని ఆజ్ఞాపిస్తున్నావుగాని నా సంకల్పం అంతటిలో ఆగిపోయేదికాదు. ఇది పాండవ కుమారుల పత్నీగర్భాలను కూడా దహించి తీరుతుంది. నీ సంకల్పం నేను గ్రహించలేదనుకొన్నావేమో! గ్రహించివేశాను! నా సంకల్పాని కిక తిరుగులేదు!"

అని బింకంగా మాతి ముడుచుకుని కూర్చున్నాడు.

౪

శ్రీకృష్ణుడశ్వత్థామకు, వ్యాస మహర్షికీ మధ్య నడిచిన ఉత్తరప్రత్యుత్తరాలన్నీ అతి శ్రద్ధగా ఆలకించాడు. అశ్వత్థామ క్రూర ప్రవృత్తి అంతా అతనికి అవగాహన అయిపోయింది. ఒక్క చిరునవ్వు నవ్వాడు:

"అశ్వత్థామా! నీ అస్త్రాగ్నితో పాండుమహారాజు పౌత్రుల నందరినీ సంహరించివేశావు. అంతటితో ఊరుకోక వారి పత్నుల గర్భాలన్నిటిలో చిచ్చుపెట్టవలెనని నిశ్చయించావు! నే నాగర్భాలలో ఉన్న ఒకే ఒక్క శిశువును సంరక్షింపవలెనని నిశ్చయించాను. అతడు మహాధర్మాత్ముడై పృథివి అంతా పరిపాలింపవలెనని అభిలషిస్తున్నాను! నీవు కూడా నా సంకల్పానికి తోడుపడవలసింది!"

అని అశ్వత్థామను సగౌరవంగా ప్రార్థించాడు. ఆ ప్రార్థనవిని అశ్వత్థామ ఒక వికపు నవ్వు నవ్వాడు:

"వాసుదేవా! నీ వేదో పక్షపాతంకొద్దీ ప్రసంగిస్తే నేను దాని కంగీకరిస్తానని అనుకొన్నావా? నీవు అభిమన్యుని పత్నియైన ఉత్తరగర్భం సంరక్షింపవలెనని సంకల్పించావు! నే నాగర్భంకూడా భస్మంచేసి వేస్తున్నాను! దినికిక తిరుగులేదు!"

అని ఆ అస్త్రమంత్రం తిరిగి ఇంకొకమారు పునశ్చరణ చేశాడు.

అంతలోనే కృష్ణుడొక్క నవ్వు నవ్వాడు:

"వ్రిరివాడా! నీ అస్త్రం కాల్చివేసినంతమాత్రాన ఆ శిశు వలాగే మరణిస్తాడనిఅనుకొన్నావా? నీ అస్త్రదగ్ధుడై మరణించినవెంటనే నే నాశిశువును బ్రతికిస్తాను! ఆ పసివానితో పాండవవంశం శాశ్వతంగా వర్ధిల్లగలదు. అదిన్నీ గాక అతడు చిరకాలం పూర్ణాయుర్దాయంతో జీవింపగలడు. త్రికాలవేది అయిన బ్రాహ్మణు డొకడు ఉత్తరా గర్భంలోనించి మృతశిశువుద్భవింపగలడని ఆదేశించాడు. అందుచేత అతనికి పరీక్షిత్తనే నామధేయం ఏర్పడగలదని కూడా అన్నాడు. ఇంతా చేస్తే దినిలో నీవు చేసినదేమి ఉంది?"

అని చెప్పి నిశ్చలదృష్టితో అశ్వత్థామవైపు చూచాడు. ఆ పరమపాపాత్ముని ముఖం చూడగానే వాసుదేవుడంతటివానికి క్రోధజ్వాల నఖశిఖపర్యంతము దహించివేసింది:

"నీవు శిశుహంతవు! ఇందువల్ల నీ కిక అన్నపానాలుకూడా కరువైపోతాయి. నా అన్నవారు లేకుండా నీ విల్లాగే ఇంకా మూడువేలేళ్ళవరకు జీవచ్ఛవంలా, జీవింపగలవు!

"నేను రక్షించిన పరీక్షిత్కుమారుడు నీ కళ్ళఎదటే పెరిగి పెద్దవాడౌతాడు. కృపాచార్యు డతనికి ధనుర్వేద రహస్యాలన్నీ అనుగ్రహింప గలడు. పరీక్షిత్తైంతో కాలం ఈభూమి పాలింపగలడు. ఆ పరీక్షిత్తుకు జనమేజయుడనే కుమారు డుద్భవింపగలడు. అతడు నీవు చూస్తూండగానే ఈ పృథివి అంతా ఏకచ్ఛత్రాధిపత్యంతో పరిపాలింప గలడు! తెలిసిందా! అప్పటికి నీకు నా ప్రభావం ఎటువంటిదో తెలిసి వస్తుంది లే!"

వ్యాసమహర్షి కూడా పాపకర్ముడైన అశ్వత్థామ ముఖంచూచి తన క్రోధం నిగ్రహించుకోలేకపోయాడు:

"నీ నెత్తినది బ్రాహ్మణజన్మ! ఆ పైన నే నెన్నోవిధాలుగా నీ కుపదేశించాను! నా మాటలన్నీ పెడచెవిని పెట్టావు! అందుచేత వాసుదేవుని వాక్యాలక్షరశః సత్యములగు గాక!"

అని అశ్వత్థామను మళ్ళీ శపించాడు. ఆ పైన అశ్వత్థామ ముఖం మరి చూడలేకపోయాడు:

"నీచుడా! నా యెదట మరి నిలబడకు! పో!" అని కసిరి వేశాడు. అయినా అశ్వత్థామ అక్కసింకా పూర్తిగా సమసిపోలేదు:

"వ్యాసా! నీ వెంతటి బ్రహ్మణ్యుడవయినా నీ కిక మానవ జన్మవిముక్తి లేదు! నీ వెప్పటికీ మానవులలోనే ఉండి పోదువుగాక! నే నెక్కడికీ వెళ్ళిపోవడంలేదు! మీ ఇద్దరి శాపాలు అనుభవిస్తూ నీ సన్నిధినే ఉండి పోతున్నాను!"

అని వ్యాసమహర్షికి ప్రతిశాపం ఇచ్చాడు. వెంటనే పాండవులకు తన శిరోమణి సమర్పించి తపోవనంలోనికి తరలిపోయాడు.

పాండవులు, కృష్ణుడు వ్యాస మహర్షికి సవినయంగా నమస్కరించి, సెలవు తీసుకుని తిరిగి తమ శిబిరానికి మరలిపోయారు.

ధర్మరాజా చూడామణి భీమసేనుని కిచ్చి అది ద్రౌపదీదేవి కీయవలసిందనిపంపించాడు.

ఆ చూడామణి కళ్ళారా చూచి ద్రౌపదీదేవి ఉసూరుమని ఒకనిట్టూర్పు విడిచిపెట్టింది. 

# మంత్రాలు: నమ్మకాలు

## మహారాష్ట్రుల 'భానుమతీ' ప్రయోగం

నేను ఈ మంత్రాలలో ఎంతవరకు సఫలీకృతుడనైనది సంక్షిప్తముగా వ్రాయుచున్నాను. ప్రస్తుతము అనగా 1957 ఫిబ్రవరి నెలలో నేను నయముచేసిన ఒక భూతకృత్యమును ఉదాహరణగా ఇచ్చుచున్నాను. ఇది "పూనా" పట్టణములో జరిగినది. భూతకృత్య బాధకు పాల్పడినవారు హోదాలో వున్న గవర్నమెంటు ఉద్యోగి. మహారాష్ట్రభాషీయుడు.

మా స్వగ్రామమయిన కంకిపాడులో ఇదివరకు అనేకమందికి పాముకాట్లకు, తేలు విషములకు మంత్రములు వేసి కాటు పొందిన వారిని 5 నుండి 10 నిమిషములలో హాయిగా ఇంటికి పంపితిని. ఇది ఆగ్రామ ప్రజలలో చాలామందికి, చుట్టుపట్ల గ్రామ ప్రజలలో కొంతమందికి తెలిసిన విషయమే.

"పూనా" నగరములో మొన్న జనవరి 27 న నామిత్రుడు ఒకరు వచ్చి నాతో, తన బంధువులలో నూతనముగా కళ్యాణమయిన వధూవరులకు ఈక్రింది విచిత్రములు జరుగుచున్నవని చెప్పి వాటిని బాగుచేయవలసినదని కోరినాడు.

జరిగిన విచిత్రములు : రూ 150/. విలువ చేయు, పది; ఐదు, ఒక రూపాయినోట్లు మూడుసార్లు భార్యాభర్తల జేబులలోను మనీపర్సులలోను బూడిద అయివున్నవి. ఆనోట్లను కప్పివుంచిన పక్క కాగితములకు ఏవిధమైన హానీ కలుగలేదు.

నిమ్మకాయలు, కుంకుమ, పసుపు, బొగ్గులు అనేకమార్లు నడుచుచున్నప్పుడు అకస్మాత్తుగా వారి జేబులలోకి వచ్చినవి.

మనిషి చేతిఎముకలు నడుచుచున్న వారి చేతిసంచులలోకి, తాళము వేసి పెట్టినవారి ట్రంకుపెట్టెలలోనికి మూడుసార్లు వచ్చినవి.

ఈ విషయములు విన్న తదుపరి (ఈప్రాంతములో దీనిని భానుమతీప్రయోగం అని పిల్చుదురు.) నేను భానుమతీప్రయోగమునకు విరుద్ధమైన మంత్రమును భార్యాభర్తలపై ప్రయోగించాను. తదుపరి ఏవిధమైన వస్తువులు భార్యాభర్తల జేబులలోను, చేతిసంచులలోను రాలేదు. నోట్లు తగులబడలేదు. కాని, పసుపు, కుంకుమ బూడిద రంగుల వికృతహస్త ముద్రికలు వంటఇంటిలోను, ఇంటిగోడలపైనను, బట్టలపయినను కన్పడినవి. ఇటువంటి హస్త ముద్రికలు రాకుండుటకై మంత్రము లుపయోగించినాను. ఫిబ్రవరి 8 వ తేదీ రాత్రి పడకగదిలో రేగి పళ్లు, పసుపు, కుంకుమలు 3 శేర్లవరకు ప్రక్కక్రింద నున్నవి. ఇంటి యజమాని వాటిని జాగ్రత్తగా ఒక పాత్రలో వుంచి మూత పెట్టి ఆమూతపై బరువులు పెట్టినాడు. ఉదయం 4-30 గం॥ లేచి చూడగా పాత్రలో ఆవస్తువులు లేవు. అదృశ్యమైనవి. మూత, మూతపై బరువులు పెట్టినవి పెట్టినట్లే వున్నవి. 9-2-57 రాత్రి భార్య ఒంటిపై "సైతాను" ఆవేశించినది. నేను మంత్రప్రయోగముచేసి మరాఠీ భాషలో నీ వెవరవని అడుగగా మరాఠీ భాషలోనే "మనిషిని" అని బదులుచెప్పి ఆ పిశాచము బయల్పడినది. అంతట యిది "భానుమతి" మరియు "అఘోరీ" అను విషమ ప్రయోగమని గ్రహించి, ఎప్పటికిని ఏవిధమైన ప్రయోగములు ఇంటియందుగాని, ఇంటిలో నున్నవారినిగాని ఆవేశించకుండ ప్రక్రియలు చేసినాను. 10-2-57 రాత్రి ఇంటివారు ఎల్లరు ఇంటిబయట ఉరుములు ఉరిమిన శబ్దమువచ్చుట, ఇల్లు (వారున్న భాగము) భూకంప సమయమున కదిలినట్లు కదలుట, ఆకంపమునకు వారు కంపించుట, ఆపై బయటనుండి వికారమయిన ఆర్తనాదములు వచ్చుట విన్నారు. ప్రత్యక్షముగ అనుభవించినారు.

ఇది అవతలి మంత్ర ప్రయోగమునకు, నేను చేసిన మంత్ర ప్రయోగమునకు జరిగిన సంఘర్షణ.

ఇది ప్రత్యక్ష నిదర్శనము. ఆదినమునుండి యింటిలోని వారు ఎల్లరు హాయిగా, సుఖముగా, ఏవిధమయిన కలతలు లేకుండా వున్నారు.

మేదిండ్రావు కమలాకర గాంధి,
ఖడకవాసలా, (హవేలీ తాలూకా,
పూనాజిల్లా.)

* * *

## విషమాక్షరాలు

మంత్రాలలో పాముమంత్రం, తేలుమంత్రం, నప్పిమంత్రం, బెణుకుమంత్రం, చెల్దిమంత్రం, అవిరిమంత్రం వగైరా మంత్రాలెన్నో యుండటం అందరు ఎరిగినదే. కాని వాటికి నిజంగా ప్రభావం యున్నదా? అది అట్లుండగా; ఒకవేళ ఏపిల్ల వాడికైనా చెల్లి లేచినా, కుటుంబంలో ఎవరైనా తేలు కుట్టి బాధపడుతున్నా మంత్రాల ప్రభావాన్ని చర్చిస్తూ ఊరుకుంటున్నారా? లేక వెంట నేపోయి మంత్రాలు వేయిస్తున్నారా? అంటే అది తరువాతసంగతి. కడుపులో నొప్పి కలిగితే గచ్చాకని, పుచ్చాకని, వామని, ఉప్పుని వాడకుండా ఊరుకుంటున్నారా? ఆ మాదిరిగానే మంత్రాలకు సంబంధించిన వ్యాధులొస్తే మంత్రగాళ్ళకోసం పరుగులెత్తుతున్నారు.

అసలు మంత్రాలనేవి - ఓషధులనేవి- నిజమా? అబద్ధమా? రెండూ అబద్ధమే నంటే వెఱ్ఱి బాగులవాడంటారు. ఓషధుల్లో మాత్రం ధన్వంతరి నాటినుంచి యిప్పటి వరకు సత్తా యున్నదని కచ్చితంగా ఒప్పుకు తీరాలి. ఈ విషయం కాదంటే ఆత్మవంచనకూడ. రవ్వంత నిజమైన ఈశ్వరీవేలు లభించినట్లైతే వెయ్యి మంత్రాలకు కూడ ఝుడవని కోడె త్రాచుసైతం గడగడ వణకిపోతుంది. మంత్రాల వల్ల పామును కట్టివేయుటలేదా? అంటే అది అనుభవానికి మించిన విషయం.

సాధారణంగా మనవద్దకు త్రాచుపాములను బుట్టలోనుంచి ఆడిస్తూ బిచ్చమడుక్కుని మంత్రా లుపదేశిస్తామంటూ తిరిగే వాళ్ళందరకు నిజంగా మంత్రాలు రావని వాదించవచ్చును. మొండి ధైర్యంతో త్రాచుపాము తలకాయ నదిమిపెట్టి, విషముపిండీ కోరలుపీకీ ఆడించే సాహసులను చూస్తున్నాము. పాము నాడించడానికి మంత్రాలే అవసరము లేదన్నమాట.

ఆమధ్య యీ బాపతు మనిషి వకడు త్రాచుపామును బుట్టలో పెట్టి తీసుకొని వచ్చి "దీన్నిప్పుడే పట్టుకొని వచ్చాను.

# ★ మంత్రాలు, నమ్మకాలు ★

"నామంత్రమహిమను పరిశీలించవచ్చు" రంటూ దానిమూతను తొలగించుటే తడవుగా బుస్సున లేచి తోకమీద నిలబడినది. అప్పుడు తానేదో మెల్లగా నోటితో పరిస్తూ, దాని శిరమున ఒక చిన్న చరుపు చరవగానే తిరిగి అది బుట్టలో అణకువగా ప్రవేశించినది. వెంటనే తన్మంత్రోపదేశమందు కోరిక నాకప్పుడు కలిగినది. అంతట నావల్ల తృప్తికరంగా ప్రతిఫలమందిన యాతడు ఫలితం లేకపోతే తన సోదరితో సంపర్కంపొందిన పాపాన్ని తా ననుభవిస్తానంటూ నాకీ క్రింది మంత్రాన్నుపదేశించాడు. దీనివలన ఎంతలావుపాము కరచిననూ; నిమిషములో నివారణ కాగలదని నొక్కి వక్కాణించాడు. "ఉశో; బశో; ఛీ! పో! చిచ్చుపులారిబంద్" ఆ యీమంత్రం పాము కొక్కదానికే కాకుండా తేలుక్కూడ అమోఘంగా ఉపకరిస్తుం దన్నాడు. కాని పాము కఱచిన వారెవరు నావద్ద కింతవరకు వచ్చుట తటస్థించలేదు. తేలు కుట్టిన వానికి వాడెడము, ఆమనిషి పూర్వంకంటె ఎక్కువ బాధతో వెళ్ళటము జరిగినది. మిగతా బెణుకువగైరా మంత్రప్రభావాల లక్షణం కొంత కాకపోతే కొంతైనా ఇంతేనని తెలుసుకోవచ్చు.

ఒకప్పు డొక మంత్రశాస్త్రం తెలిసిన మిత్రుణ్ణీవిషయమై కదల్చితిని. అప్పుడాయన మడిమంత్రాలనీ, మైలమంత్రాలనీ మంత్రాలలో రెండురకాలున్నాయనీ, మడిమంత్ర ప్రయోగాలు చేసేవారు తమ ప్రతిపక్షుల గోత్రనామాలతో (భగళామంత్రం కాబోలు) మంత్రాలు ప్రయోగించి కక్షతీర్చుకుంటూరని చెపుతూ, ఇప్పుడట్టి సిద్ధపురుషులు లేరంటూ పెదమవిరిచారు. ఇతర క్షుద్రమంత్రాల విషయంలో తమవిరోధి దొడ్లలో కొబ్బరికాయ వగైరాలు పాతిపెట్టి స్మశానములలో వారి పేరుమీదేవో తంతులు చేస్తారని చెప్పి అట్టివారుకూడా చాలాఅరుదు; అంటే కేవలము మృగ్యమేయనియూ చెప్పినారు.

ఇక కవిత్వాలనబడే వాటితోగూడ మంత్రాలంటిపెట్టుకున్నట్లు తోస్తుంది. తురగారామకవీ, వేములవాడ భీమకవీ వగైరా కవులేవో విషమాక్షరాలను పద్యంతో జతచేసి విరోధులను సాధించేవారని ప్రతీతి. వాటి నిజానిజములు మన కెఱుకపడవు. కవులలో నాధునికులు నేడు చాలామంది యున్నారు కాని యీవిషయానికి ప్రాధాన్యత లేదు.

కాస్తో కూస్తో కవిత్వంవ్రాసే అలవాటు కలుగుటచేత ఎప్పుడైనా అట్టి విషమాక్షరాలు పొరపాటున దొర్లుతాయేమో అన్న భయంతో కీ॥ శే॥ శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిలవారు విజయవాడ క్షీరసాగర్ బిల్డింగ్సులో నున్నప్పుడు శ్రీ వారికి నాకవిత్వ పరిశ్రమ విషయంతోపాటీ విషయాన్ని కూడా మనవిచేస్తూ ఎఱుకపర్చాను. ఏదో భగవత్ సంబంధమైన పద్యాలు వ్రాసుకునేవాడివి కాబట్టి ఏతద్విషయమై ఏలాటి భయమూ లేదని శెలవిచ్చారు. మఱికొందరి కవులలో కూడ ఈవిషయమై ప్రసక్త్యనుప్రసక్తిగా కొన్ని పద్యములు దొర్లినవి.

జాషువకవి "నాకథ"అను తనపుస్తకములో-శా. "ఛందశ్శాస్త్రముమీద నేర్పడిన విశ్వాసంబునన్ దుష్టులన్ మ్రందింపన్‌బరు పాకురంబులిడి కూర్పంబూనితిన్ బద్దెముల్; సందేహింపక; దద్విరుద్ధముగ నస్మజ్జీవితం బందు నిబ్బందుల్ దాపరమైకలం సౌహృదయ స్వాస్థ్యంబు నత్యంతమున్" అంటూ విషమాక్షరాల విషయం కొంతచెపుతూ చేతబడి ప్రయోగాల్ని గురించికూడ "చేతబడుల్ పొనర్చి నిరసించినవారిని సంహరించు నజ్ఞాతశక్తి ప్రచండులని నమ్మి యొకప్పుడు మాయదారులన్ కోతలరాయలన్ గుఱుచగోచుల దొంగలమేపుకొంటివా భీతి నశించెనో" అంటూ వినుకొండపట్టణంతో ప్రస్తావించారు.

కీ॥ శే॥ చెళ్ళపిళ్ళ శాస్త్రిలవారు "సౌభాగ్యకామేశ్వరి"లో "ఒకవిద్వాంసున కోడి చేయునదిలే కొండొక్క విజ్ఞుండు దుర్వికల స్వాంతునొనర్చు శాంబరము చేవేఱొక్క విజ్ఞుండు కాశికి దాదాపుననుండి వచ్చి మరలించన్ దప్పెయోగంబు; కొంకక యోడందిన పెద్దలిట్టి పనులన్ గావింత్రు కామేశ్వరీ!" "అసలేలేవివియంచు గొందఱనగా నాలింతు; లేకేమి? యున్న సమాచారము నిక్కమే! తఱచుగా నన్ రావు భ్రాంతాత్ములే విషయంపున్ గదమేనిగల్గునెడ నీవిభ్రాంతికిన్ లోగుటే వసుధంగన్పడు మృగ్యమిద్ది యిపుడీప్రాంతాన కామేశ్వరీ!" "ప్రకృతం బీకళచేతగాని నెవియో పాటిల్లి పూహింతురూరక" అంటూ వారీవిషయమై తమ అభిప్రాయాన్ని స్పష్టీకరించారు. విషయం విషయాంతరంలోనికి దిగి ఇంతవరకు నడిచింది. ప్రకృతం ఓషధుల్లో సత్తాయున్నమాట వాస్తవమేగాని మంత్రాల్లో యీ కొలాన్ని బట్టి సత్తా (ప్రభావం) లేదని తేలుతోంది. చల్లకొచ్చి ముంతదాచటమేల? అన్నట్లు 'మా రామప్రభు శతకంలో నీప్రసక్తికి సంబంధించిన రెండు పద్యాలను కూడ నుదహరిస్తున్నాను. "ఏదో చేతబడుల్ పొనర్తురట దామెంతేభయం బందుచున్ వారు నీవ్వరని తంతుగాండ్ర నొక తొంభైమంది నిర్జిరి; ఎంతో రాద్ధాంతమొనర్తు రెందులకు? భక్తుండౌచు నెవ్వేళ; నిన్నారాధింపమి నిట్టి భ్రాంతులకు లోనైయుంట రామప్రభూ! భూత ప్రేత పిశాచ ఢాకినుల రూపున్ మాపు దక్షుండవనన్ నీతాలుకు విధేయుడట్టి యెడ నిన్నే నమ్మి సేవింప వేరేతా యెత్తులతో బనేమియగు నా యీ తంతులున్ సర్వమున్ "తూతుక్కా మఱి బొల్లిమేక" యనివిందున్నేను రామప్రభూ' పై విషయాలకు తగినట్లుగా ఉదయమునే నిద్రలేచి స్నానసంధ్యానుష్ఠానములతోపాటుగా ఆదిత్యహృదయం నవగ్రహస్తోత్రం అంజనేయాష్టోత్తర శతనామస్తోత్రం వగైరాలు పఠించుకుంటూ సహృదయుడైయుంటే అట్టివాని మీద ఆ యీ ప్రయోగాలు బొత్తిగా పని చేయవనీ నాకు గట్టినమ్మకము. భవతు. ప్రయోగాలంటే నామతి సమ్మతింపదు.

బాచిమంచి శ్రీహరిశాస్త్రి.

# వనితా లోకం

## పెద్ద మనుషులా: చిన్న మనసులా.

రెండు నెలల కిందట క్రిస్టమస్ సెలవులకని పిన్ని గారింటికి వెళ్లాను. ఇష్టపడి వెళ్లలేదు. అంతా నాన్నగారిబలవంతం. చుట్టాలింటికి వెళ్లడమంటే ఏమిటోలా వుంటుంది. తప్పదనివెళ్ళేను. వెళ్ళిన రెండు రోజులు పిల్లలతో సరదాగానే గడిచింది.

ఆవేళసాయంత్రం మా ఇంటికెవరో వచ్చారు. పిన్నిని పలకరించారు. ఆమాటా ఈమాట అయ్యాక, నన్ను చూపించి 'ఎవరు?'అని అడిగారు.

'మాబావగారి అమ్మాయి.' ముక్తసరిగా సమాధానం చెప్పింది.

'ఆ అమ్మాయి?'...నా ప్రక్కనే కూర్చున్న శశిని చూపించి అడిగారు.

'మా అన్నయ్యగారి అమ్మాయి ఇంటర్ చదువుతోంది. డాన్సుచేస్తుంది. సినిమాలంటె సరదా!...'ఇంకా ఏమోచెప్పబోతు వస్తోంది. పిన్నిమాటలకి చిరాకేసిన బేబీ. 'మా అక్క కూడా పాడుతుంది' అంది.

'ఆ...ఏంపాటలెండి,' తీసివేసింది పిన్ని. మామనస్సుకు చివుక్కుమంది. అడిగినా నాగురించి చెప్పడానికి మనస్సురాని పిన్ని మీద చాలాకోపం వచ్చింది.

ఎందుకో ఆ ఈర్ష్య. నో రార ఫలానా అని చెప్పుకుందుకు తగనా అనిపించింది.

పిన్ని లాంటివాళ్లు చాలామంది ఉంటారు. ఆయనవైపు చుట్టాలువేరు. ఆవిడవైపు చుట్టాలువేరు. ఈభేదభావాలు ఎందుకో? ఏమీ బాగుండలేదు. మనస్సంతా అదోమాదిరిగా మారిపోయింది. కులాసాగా నాలుగురోజు లుందామనకున్న నాకు మర్నాడే పోవాలనిపించింది.

అరోజునాకు బాగాజ్ఞాపకం. సాయంత్రం బయలుదేరి ఒకఫ్రెండుఇంటికి వెళ్లాను. అదృష్టవశాత్తు ఇంట్లో నేఉంవుది.

'ఓ...ఏప్పుడురావడం' నవ్వుతూ పలకరించింది లీల.

'నిన్ననే వచ్చాను. రెండురోజులలో వెళ్ళిపోతున్నాను.'

'అప్పుడే!...' ఆశ్చర్యపడింది.

'అవును. వెళ్లాలి...'అన్నా నసుగుతూ.

'అయితే నాదొక చిన్నరిక్వెస్టు. కాదనకూడదు' అంది లీల.

'అలాగే...'

"ఇక్కడ" మాఫ్రెండ్సుకి పరిచయం చేస్తాను. ఏమైనా అభ్యంతరమా?

'లేదు. ఇప్పుడెందుకు? అని అడిగాను.

'తనఫ్రెండ్‌గా యింతవఱకు లీలఎవరిని, ఎవళ్ళకీ పరిచయం చేయలేదు. 'కాదనకు' ప్రక్కనేకూర్చున్న వాళ్లి నాన్నగారు అన్నారు. మాట్లాడకుండా మంత్రముగ్ధలా

### మంచి-చెడ్డా

లీలతో కొరకొక్కాను. అప్పుడర్థమయింది.

కావాలని తనవారికి పరిచయం చెయ్యాలని తహతహలాడే స్నేహితురాలు, యితరులు తఱచితఱచి అడిగినా చెప్పడానికి మాటలురాని పిన్ని. ఒక్కసారి మనసులో మెదిలారు.

చుట్టరికంకన్నా స్నేహమే ఎక్కువని పించింది. రక్తసంబంధంలేని స్నేహబంధమే విడిపోవని లింక్ అనుకున్నాను. పరిస్పరం అర్థంచేసికొనే అందం స్నేహితులకి చెల్లింది గాని చుట్టాలికి కాదు.

'తప్పులెన్నువారు తమతప్పు లెరుగరు' అన్నట్లు తరతరాల జీవితాలుతిరిగేసి మనస్సుకి బాధ కలిగించే బంధువులు, ఒకవేళతప్పుజరిగినా ఒప్పుగాభావించి కిలకిలాకబుర్లు చెప్పేస్నేహితులు ఎవరుగొప్ప.

ఫలానాపదవిలోవున్న వ్యక్తి నాప్రాణ సమానమైన ఫ్రెండ్ అని సగర్వంగా వెల్లడించే వారికున్నతృప్తి, ఆనందం, ఆవ్యక్తి మాపినతల్లితోటికోడలు ఆడబడుచు కూతురు భర్తఅని చెప్పుకునేవారికి ఎలావుంటుంది.

ప్రతిఫలంకోరని పవిత్రప్రేమ స్నేహానికి ప్రథమలక్షణం. అదేవుండదు చుట్టరికానికి. ఇంతకి రెండితలు పెట్టినవారే అసలైన బంధువులు. కావలసినకులదైవాలు. "మాఅబ్బాయి పుట్టు వెంద్రులకు రెండు రూపాయలేయిచ్చారు, వాళ్ళమ్మాయి బారసాలకి వద్దనా వినకుండా మావారు పాంజీవుపట్టాలు తెప్పించారు' అంటుంది యిల్లాలు పుసిక్కున. అంతేగాని, అవతలవారి ఆర్థికస్తోమత, అవసరాలు గుర్తించరు. ఒకరు పెడితేనేగాని పెట్టకూడదు అనేగుణం చుట్టాల్లోనే ఎక్కువగా వుంటుంది. ఫ్రెండ్సుఅంతగా పట్టించుకోరు.

సహజంగా,బంధుప్రేమకంటే స్నేహమే బాగుంటుందనిపిస్తుంది. స్నేహం అనేమాట ముచ్చటగొలిపే ఆ మూడక్షరాల్లో యిమిడివున్నప్పుడున్న మాధుర్యం, నాలుగక్షరాల బాంధవ్యంక్రింద మారినప్పుడు వుండదు. స్నేహంవేరు. చుట్టరికంవేరు. రెండింటికి రెండు ధృవాలవ్యత్యాసంవుంది.

చుట్టాలసంబంధం శారీరకంగాను, స్నేహితుల సహచర్యం మానసికంగాను కనబడుతుంది.

ఆ వేళ జరిగిన మాక్లబ్ పార్లమెంటు చర్చలో, చుట్టాలా? స్నేహితులా? ఎక్కువఅనే విషయం ఏ అడ్డుప్రశ్నలు, వాయిదాలురాకుండా నిరాఘాటంగా సాగిపోయింది. స్నేహితులే ఎక్కువ అనేక్లాజ్ ప్రతిపక్షసభ్యుల అభ్యంతరానికి గురికాకుండా, ఏకగ్రీవంగా పాస్ అయింది. ★

# తప్పెవరిది? - చిక్కెక్కడ?

అవిభక్త కుటుంబాలలో సాధారణంగా కలహాలకి, అత్తకోడళ్ళో, తోడికోడళ్లో కారణం అవుతూండడం పరిపాటి. దీనిలో కొంత సత్యం లేకపోలేదు. కాని, ఆ కలహాలకి కారకులెవరని తెలుసుకో ప్రయత్నించే కన్న, వాటి నిజమైన కారణాలు ఏమిటీ అని అన్వేషించి తెలుసుకొంటే, అందులో ఏ ఒక్కరినీ నిందించ సాహసించలేము. సాధారణంగా అలాజరుగక ఏ ఒక్కరి పక్షమో అవలంబించి మిగిలినవారిని నిందించడము, వారికి, వీరికి మధ్య పుల్లలు పెట్టడం జరుగుతూ వుంటుంది.

అవిభక్త కుటుంబాలలో వ్యక్తులసంఖ్య హెచ్చుగా వుంటుంది. ఆ కుటుంబానికే చెందిన మగవారిని మినహాయిస్తే, ఇక మిగిలినవారిలో అత్త ఒక ఇంటిపిల్ల; కోడళ్లు వేరు వేరు కుటుంబాలకు చెందినవారు. ఆడపడుచులు ఆకుటుంబానికే చెందినా వీరందరికీ భిన్నంగా ఉంటారు.

వేరువేరు సంప్రదాయాలలో పెరిగి, ఆచార వ్యవహారములలోను, నిత్యజీవనంలోను విభిన్న మనస్తత్వాలు కలిగినవారిమధ్య సామరస్యం చాల తక్కువగా వుంటుంది. అత్తగారి కాలంనాడు ఆమె పుట్టి పెరిగిన వాతావరణం వేరు. ఆమె అత్తింట కాలు పెట్టేసరికి ఉన్న సాంఘిక పరిస్థితులు వేరు. మారుతూన్న కాలంతో, సాంఘిక


## ద్వివేదుల విశాలాక్షి
(విజయనగరం)


మర్యాదలతో ఆమె అంత త్వరగా మారలేక పోవచ్చు. తనపిల్లలు తనలాగే పెరగాలనీ, తనకోడళ్లు తాను అత్తవారింట మెలగిన రీతినే మెలగాలనీ ఆమె ఆశించడం సహజం. అందుకు ఏమాత్రం భిన్నంగా జరిగినా ఆమె సహించదు. నేటిస్త్రీలు వినయ విధేయతలూ, సిగ్గూ లజ్జా లేక పూర్తిగా చెడిపోతున్నారంటుంది. "అయ్యో! మా కాలంలో ఇలా ఎరుగుదుమా" అని ప్రారంభిస్తే, ఇంక దానికి అంతన్నది ఉండదు. అత్తమామల ఆజ్ఞల నెలా పాలించినది, భర్తకు ఎలా సేవ చేసినది, చుట్టపక్కాలను, ఆడపడుచులను ఎలా ఆదరించినది. తూచా తప్పక అంతా వర్ణన జరుగలవలసినదే. దీనికి ఆమె నేమనగలం? ఆమె పెరిగినవాతావరణం నేడు లేదు కదా; తానుజీవించిన ప్రపంచానికి ఇదేదో భిన్నంగా తయారయిపోతున్నదనే ఆవేదనే ఆమెచే అలా అనిపిస్తుంది.

అత్తగారిమాటలు కోడళ్లి చెవికెక్కవు. ఇంట్లో పనిపాట్లు ఆమెకన్నా తామే ఎక్కువగా చేస్తున్నామే, తిని తిన్నగా కూర్చుండక ఈ సాధింపులు ఎందుకు? ఆమె కాలంనాటి వేషభాషలు తామెందుకు అనుసరించాలి? కాలానుగుణంగా మనుషులు మారాలి కాని, పూర్వపు అలవాట్లే మంచివి అంటే సబబు ఏమిటి? వారు చేసేరు కాబట్టి అవే ఆచరణీయాలంటే అర్థం

---

## చిత్తు కాగితముల ఉపయోగం

మా ఇల్లు శుభ్రము చేయబోతూ మా ఇంట్లో వున్న తట్టెడు చిత్తుకాగితాలు వీధిలో పారేయబోతుంటే మా ఇంటిప్రక్క సుందరమ్మగారొచ్చి "ఇల్లు శుభ్రముచేస్తూ చిత్తుకాగితాలు అడ్డమనుకున్నావుగా మాలక్ష్మీ. వాటితో చాలా అవసరముంది" అన్నది. నాకు నవ్వువచ్చింది. కానీ తరువాత ఆమె జెప్పిన పద్ధతిప్రకారము ఆ చిత్తుకాగితాలు వాడేసరికి నాకు అవి చాలా ఉపయోగపడుచున్నవి.

రానున్నది వేసవికాలముగాబట్టి కాగితములను రుబ్బి బుట్టలు తయారుచేసుకుంటే త్వరలో ఎండుతవి. నా అనుభవమువలన చెబుతున్నాను. మామూలుగా మనవారంతా చేటలకు, జల్లెడలకు పేడపూసి ఎండబెట్టిన అసహ్యంగా వుంటాయి. కాగితములు రుబ్బి గుజ్జుపూస్తే గట్టిగావుండి ఖంగున మ్రోగి చాలా అందంగా ఉంటవి. అయితే పేడరాసినవానికిమాత్రము మరల, రుబ్బినది రాయకూడదు. కొత్తవాటికే ఉపయోగపడుతుంది.

అరవీశె చిత్తుకాగితములు, ఐదుఫలముల మెంతులు, 15 మినపబేడలు తీసుకొని కాగితములు ముక్కలుముక్కలుగాజేసి పెదకుండలో వారమురోజులు నానవేయాలి. ప్రతిరోజూ పాతనీళ్లు తీసివేసి క్రొత్తనీళ్ళు పోయాలి. మెంతులు, మినపపప్పు మాత్రము, రేపు రుబ్బుతామనగా ఈరోజు నానబెట్టాలి.

8-వ రోజు ఉదయం, కాగితములను గట్టిగా పిండి రోట్లోవేసి చిదర బదరగా త్రొక్కి, తరువాత దానిని తీసి ఒక్కొక్క వాయిలో కొంసిని మెంతులు రెండు మినపబద్దలూ వేసి రుబ్బాలి. జిగురు, మెత్తదనం వచ్చిందాకా నీళ్ళు జల్లుతూ రుబ్బాలన్నమాట. మెత్తగావచ్చినట్లు తెలియగానే చేటలకు, జల్లెడలకు పలుచగాపూస్తే చాలాబాగుంటవి. మందముగామాత్రము పూయవద్దు.

## గిన్నెలు చేయు విధము

ఇత్తడిగాని, నికెల్ గాని గిన్నెలు తీసుకొని దానికిసరిపడే తెల్లటి మందపాటి గుడ్డను తీసుకొని నీళ్ళలో తడిపి పిండాలి. గిన్నెను క్రిందబోర్లించి ఈ గుడ్డను గిన్నెమీద వేసి అది గిన్నెకు అంటిపెట్టుకునేలా సర్ది మిగిలిన గుడ్డను గిన్నెలోకి మడవాలి. దానిపైన రుబ్బిన కాగితాలపిండి సమముగా ఒక అంగుళం మందముగా రాయాలి. నాలుగురోజులు ఎండబెట్టి ఖంగున మ్రోగినాక గిన్నె లంచు పట్టుకొని లాగవలెను. రానియెడల చిన్నగా నేలకుకొట్టిన ఊడివస్తుంది. తరువాత రుబ్బిన పిండిని మరలరాసి ఎండబెడితే చక్కగా ఉపయోగపడుతవి. ఏ ఆకారములో కావాలన్నా తయారుచేసుకోవచ్చు. వాటికి నీళ్లుమాత్రము తగలరాదు. తగిలితే నానిపోతవి.

ఉపయోగములు : తయారైన డబ్బాలలో పప్పులు, బియ్యము మొదలగునవి పోసుకొనవచ్చును.

పొత్తూరు సీతామహాలక్ష్మి, తెనాలి.

వుంటాలా, అక్కరలేదా? పూర్వపు రోజులలో అతి సహజంగా జరిగిపోయే, సహగమనాలూ, బాల్యవివాహాలు నిషిద్ధాలని నేడు తొలగించలేదా? తమ పూర్వీకులవలె తమ అత్తగారు సహగమనం చెయ్యగలిగిందా? ఎందుచేత, ఆమె కాలం నాటికే అది దూష్యంగా పరిగణించబట్టి. మరి అలానే వచ్చే మార్పులను ఆమె ఎందుకు అర్థం చేసుకోకపోవాలి? ఆమె కూడా ఈ ఇంటికి ఒకరోజున కోడలుగానే వచ్చిందే; తనలానే వచ్చిన మమ్మల్ని సాధించి, బాధించడం ఎందుకు? ఇలా ఉంటాయి కోడళ్ళ భావాలు.

మళ్లా ఇందులోనూ చిన్న పెద్దల తారతమ్యం ఉండనేఉంటుంది. పెద్దకోడలు తనకి కొంత అధికారం కావాలంటుంది. అత్తగారి తరువాత తనదే ఆధిపత్యం. మిగిలిన వారందరూ తనకన్నా వెనుకవచ్చినవారే; సరి, ఆవిడ భర్త పెద్దఆర్జనపరుడయ్యాడా ఇహ చెప్పేందికేలేదు. తను పెట్టింది తిని, చెప్పింది చెయ్యాలంటుంది. అత్తగారిపై కూడా ఆవిడ ధాష్టికం చెల్లవలసిందే.

ఇక మిగిలినవారు ఆడపడుచులు. వీరూ ఒకఇంటి కోడళ్లేఅయినా, పుట్టింటిగాలి తగిలేసరికల్లా దేవతలై కూర్చుంటారు. అన్నలు, వదినలు, తల్లిదండ్రులు అంతా తమనేలాలించాలంటారు. అందులో వదినలపై వీరి అధికారం చాలగానే వుంటుంది. అందుకే మనవారు "ఆడపడుచు అర్థభర్త" అన్నారు. నిజానికి కొన్ని కుటుంబాలలో భర్తలకన్న వీరి హాయమే ఎక్కువ చెల్లుబడిగా ఉంటుంది.

ఒకే జాతికి చెందిన మనుషులలో ఇన్ని భేధాలు ఎందుకొస్తాయా, అంటే ఒక్కగా ఒకే కారణం కన్పిస్తుంది. అదే...అధికార వాంఛ. తాము మిగిలిన వారందరికన్నా అధికులమనీ, తమ ఆజ్ఞలనే అందరూ

(42-వ పేజీ చూడండి)



—డిజైన్: ఎస్. నాగేశ్వరి (చోడవరం)

ఇంటి కెవరేనా వస్తే:

# నిమ్మ షరబత్ తయారు చెయ్యడం

మనం ఎవరింటికైనా వెళ్ళినా, ఎవరయినా మనింటికొచ్చినా, గబుక్కున కాఫీచేసి యివ్వడం అలవాటైపోయింది. అతిథులు ఇంటికొస్తే ఏదయినా పానీయం యివ్వాలనే అలవాటు మంచిదే. కాని ఇంటికెవరొచ్చినాసరే, కాఫీ, టీ యిల్లాంటి వేడి పానీయాలే ఎప్పుడూ ఇవ్వడం, అంత మంచిదికాదేమో! ఎండలోనుండి వచ్చినమనిషికి, కాళ్ళు కడుక్కొని, మంచి తీర్థం పుచ్చుకోండి, మజ్జిగ దాహం కావాలా? అని ఆదరించి అడిగేవారు మనవాళ్లు. చల్లని పానీయం (అనగా ఐస్ డ్రింక్ కాదు) ఇవ్వడం పూర్వంనుంచీవస్తున్న ఆచారం. ఈ మధ్యకాలంలో పాశ్చాత్య సంస్కారంతో కలిగిన అలవాట్లలో కాఫీ-టీలు ఒకటి. తెల్లవారిదేశాలలో మంచు, చలీ ఎక్కువ. అందువలన వారికి, వేడి పానీయం సుఖం, హాయి కలిగించడం సహజం. మన దేశంలో ఉదక మండలం, కాశ్మీరు మొదలయిన చల్లని దేశాలలో కాఫీ-టీలు ఎప్పుడుపడితే అప్పుడు, త్రాగినా అర్థం వుంది. పిడుక్కీ, పిచ్చుకకూ ఒకే మంత్రంలాగా, ఈ ఉష్ణమండలంలో మనుష్యులు ఎప్పుడూ కాఫీ త్రాగడమేమిటి?

(39-వ పేజీ చూడండి)



గదులపెట్టె

నందివాడ శ్యామల

# ముగ్గులు



కాకరపూవత్తులు

కె. విలాస్ కుమారి
పిఠాపురం

# చమత్కారి దారి

[చిన్న అడవి. చిరుచీకటి. ఆ అడవిలో భోజరాజూ, మాఘుడు నడుస్తూఉంటారు.]

భోజరాజు: అయితే, మనం దారి తప్పినట్టేనా?...

మాఘుడు: చిత్తం! మనం మాటల సందడిలో ఎటొచ్చేశామో...ఏమో!

భోజ: కవిత్వంలో పడి...చీకటి పడుతోందన్న విషయాన్నే మరిచి పోయాం!

మాఘు: ఎవర్నయినా అడిగితే?...

భోజ: ఎవర్ని అడుగుదామన్నా... అడవిలో ఎవరుంటారూ? అసలు మనం ఎట్నుంచి వచ్చాం...అని?

మాఘు: అదే తెలియకుండావుంది! దారులయితే చాలా కన్పిస్తున్నాయి, కానీ...రాచనగరుకు ఏది వెళ్తుందో మరి!

భోజ: అదిగో...చూడండీ, అక్కడేదో ఇల్లు వున్నట్టుంది కదూ!

మాఘు: (అటుచూసి) అవుననుకుంటాను. లేకుంటే, దీపం ఎవరు వెలిగిస్తారూ?...

భోజ: సరే, అటుపదండి వెళ్దాం!

(వెలుగువేపు నడుస్తారు.)

భోజ: ఇల్లేనండీ!

మాఘు: ఔనండీ! ... పూరిల్లూ, ఎవరో పేదవాళ్లయి వుంటారు.

(ఇంటిదగ్గరకువెళ్లి-)

మాఘు: ఎవరండీ యిందులో...

(అవ్వ ఒకర్తి బయటకువస్తుంది)

అవ్వ: మనుషులండీ...

భోజ: అవ్వా! ఈదారి ఎక్కడికి పోతుందీ?...

అవ్వ: దారి ఎక్కడికి పోతుందో దారిన పోయేవాళ్లకి తెలుస్తుంది గానీ...దారికెలా తెలుస్తుందినాయినా! - అయినా, మీరెవరు బాబూ?

మాఘు: అమ్మా! మేం ప్రయాణికులం!

అవ్వ: అరె......మీరు సూర్యచంద్రులా?

భోజ: అంటే?...

అవ్వ: అంటే......ఏంలేదు! ఈ సృష్టిలో ప్రయాణికులు సూర్యచంద్రులిద్దరే ఉన్నారు. మీరు వాళ్లేనా... అని!

మాఘు: అహా...కాదు! మేము క్షణకాలం ఆగి వెళ్లే అతిథులం!

అవ్వ: అయ్యో! ప్రపంచంలో క్షణకాలం ఆగేవి రెండే! అవి-డబ్బు,



## పాత్రలు:

భోజరాజు

మాఘుడు

అవ్వ



యౌవనంమాత్రమే. మీరు కాదు!!

భోజ: (అదోలా చూసి) మేమూ... పాలకులం!

అవ్వ: (నవ్వి) అబ్బాయిలూ! ఇంద్రుడూ, యముడూమాత్రమే పాలకులు! మీరు అలా లేరే!...

భోజ: అవ్వా! మాకు 'సహనం' ఉంది!...

అవ్వ: మీకేం తెలీదు బాబూ! సహనం భూమికి ఉంది; స్త్రీకి ఉంది! అంతే.

మాఘు: అవ్వా! మేము 'విరాగులం'

అవ్వ: మరీ బాగుంది! మీరు అలా చెప్పుకుందుకే వీల్లేదు! అహంకారానికి, సంతృప్తికీ మాత్రం ఉంది! అవిరెండే విరాగులు!

మాఘు: కాదు...కాదు! మేము 'పరదేశీయులం'!

అవ్వ: జీవాత్మ, చెట్టు తీసుకొనే నీరూ...ఈ రెండిటికే ఆమాట.

భోజ: మేము 'సమర్థులం'!

అవ్వ: అదీ కాదు! సామర్థ్యం గలవి అన్నమూ, నీరూ మాత్రమే!

మాఘు: మేం 'పేదవాళ్ళం' అవ్వా!

అవ్వ: మీరు పేదవాళ్లు కారు! పేదరికానికి, ఆడపిల్లా, ఆ తరవాత గొడ్డుపిల్లా...అని చెప్పుకోవాలి.

మాఘు: (మనస్సులో) ప్రాణం తీస్తోందే ...! ఇక లాభం లేదు! (అవ్వతో) అవ్వా! మేం ఓడిపోయాం.

అవ్వ: మీరెందుకు ఓడిపోయారూ!—ఈ లోకంలో ఆడపిల్లని కన్నవాడూ, అప్పులబాధ ఉన్నవాడూ తప్పితే మరెవ్వరూ ఓడిపోరు!

భోజ: అవ్వా! మాప్రాణం తీస్తున్నావు! చీకటి బాగా పడిపోతోంది! మేం అడిగినదానికి సమాధానం చెప్పు!

అవ్వ: అయ్యో! మీ ప్రాణాలు తీస్తే నాకేం వస్తుందీ! ఇక సమయం అయిన తర్వాత చీకటి పడదూ మరి! మీరెవరో, ఏంకావాలో చెబితే చేతనయిన సహాయం చేస్తాను మరి!

మాఘు: అవ్వా! ఈయన ధారానగరానికి రాజయిన భోజరాజుగారు. నేను ఈయన ఆస్థానకవిని, మాఘుడంటారు నన్ను! మేము వనవిహారానికి బయలుదేరాం! కవితాగోష్ఠిలోపడి దారి తప్పిపోయాము! రాజనగరుకు వెళ్లేదారి చెబుదూ!...

అవ్వ: క్షమించండి!—అయినా, ఈ మాట ముందే చెబితే బావుణ్ను! (అభినయిస్తూ) ఇదో, అలా తిన్నగా వెళ్ళి అటు తిరగండి! రాజనగరు వస్తుంది

భోజ: వెళ్ళొస్తాం!

అవ్వ: మంచిది!

(అవ్వ వెళ్లిపోతోంది.)

భోజ: మాఘా! ఈమె సామాన్యురాలు గాదుసుమా! రేపు ఈమెగురించి గుర్తుచెయ్యి! మంచి బహుమానం పంపుదాం!

మాఘు: చిత్తం! [తెర]

(సుబ్బారావు శాస్త్రి)

# నిమ్మ షర్బత్

చీటికీ, మాటికీ వేడిపానీయం పుచ్చుకోవడం వలన, మనఆరోగ్యం చెడిపోవచ్చు. కాఫీలు త్రాగడం నాగరికతాచిహ్నమని చాలా మంది అనుకుంటారు. అలవాటైనవాళ్లైనా కాఫీ ఉదయం ఒక్కసారి త్రాగవచ్చు. ఆపైన సాధ్యమైనంతవరకు మనం పుచ్చుకోవడంకాని, ఇతరుల కివ్వడంగాని మానుకుంటే దేహారోగ్యానికే కాక - దేశ సౌభాగ్యానికికూడ మంచిది. మన శరీరానికి ఏది ఆరోగ్యమో అది చూచుకోవాలి. మిట్టమధ్యాహ్నముువేళయినాసరే యింటి కెవరైనా వస్తే ఒకమాటా మంతీలేకుండా, ముందు బొగ్గుల కుంపటీ, కాఫీ, పంచదార డబ్బాలూనా? ఆ వచ్చినవారు వెళ్తాం, వెళ్తాం అని తొందరపడటం, ఇంటామె ఆదరా బాదరా పొగలుకక్కే కాఫీ తెచ్చిస్తే, వారు దాన్ని త్రాగి, లోపలవేడి, బయటవేడి రెంటితో సతమతమవడం—ఇవన్నీ మన ఇండ్లలో అలవాటయినవి. మరి ఇంటికి "ఎవరైనావస్తే

**ఉత్తరాలు:**

# ఆవుపాలు

ఎ. వి. రమణమ్మ (హౌరా)గారు. ఆవుపాల గురించి 6-2-57 తేదీ ఆంధ్ర వారపత్రికలో వ్రాసిన వ్యాసము నేను చదివాను. నాకు అయిదుగురు బిడ్డలు. అయిదవ శిశువు మగశిశువు. లివరు అను జబ్బు ఎరుగనే ఎరుగను. ఈ శిశువు ఒక సంవత్సరము పెరిగి ఖులాసాగా ఆడుకుంటున్నాడు. ఆవుపాలు చిన్నప్పటినుంచీ అలవాటు. చేశాను. నీళ్లుకలిపి గోరువెచ్చగా ప్రతి వాల్గు గంటలకు పట్టేదానిని. బిడ్డడు ఏపుగా ఎదిగి ఆడుకుంటూ ఉండేవాడు సంవత్సరం వరకూ. ఒకనెల దాటిన పిమ్మట బిడ్డనికి పెంకులాగ గుండెక్రింద కుడిప్రక్క కట్టినది. పాలు బాగుగానే త్రాగేవాడు. కాని దినదినమూ సన్నగిల్లి బలహీనుడు కాసాగాడు. మాకు వాడికగా ఇచ్చే ఆయుర్వేద వైద్యుడికి చూపించాము. ఆవుపాలు వద్దు అనీ, హార్లిక్సు, బార్లీ పట్టవలసినదనీ చెప్పారు. అయితే నాకు ఆవుపాలలో (నమ్మకమైనవి) దోషములేదని వెర్రినమ్మకము. అవే పోస్తూ వచ్చాను. అదివరకీపాల వాడుక అనుభవము లేదు. కాని సొసైటీ వారు సప్లయి చేసే పాలు వాడేదాన్ని. మాపాప అలాగే క్రమంగా చిక్కిపోతూ వచ్చాడు. మందులు త్రాగి త్రాగి తగ్గినట్లే యుండి, చివరకు ఫిబ్రవరి 8న చనిపోయాడు. డాక్టర్లు లివరు తగ్గిపోయి నీరు వచ్చిందన్నారు. మరీ వ్యాధి లివరుకు సంబంధించినదో, వేరో తెలియదు. ఏమైతేనేమి బిడ్డ దక్కలేదు. లివరుకు మందులెన్నో పోసినాము. పట్లు వేయించినాము. గడపగడప తిరిగినాము. మంత్రాలు వేయించినాము. ఈజబ్బునునివారించడానికి ఇంతవరకూ ఏశాస్త్రజ్ఞుడూ మార్గముకనుక్కున్నట్లు కనబడదు. పాలు మాత్రమే త్రాగి పెరగవలసిన పసిపాప లివ్యాధికి గురికావడం భరింపరాని విషయము. మేము వాడిన మందులు అన్నీ నిష్ప్రయోజనమైనవి. ఒక్క ఆవుపాలుతప్ప మావానికి ఏ ఇతర ఆహారము లేనేలేదు. తినేవాడు గాదు కూడాను. చివరకిలా ఒకసంవత్సరము ఎనిమిది మాసములు పెరిగి చనిపోయాడు. ఆవుపాలు పోయుటవల్ల లివరు వగైరా జబ్బులు వచ్చినవా అనిపిస్తోంది నాకు. నిర్లక్ష్యము చేశానేమోయని మనసు పీకుతోంది. ఈ ఆవుపాల మంచి చెడ్డలు, — లివరువంటి జబ్బులు రావడానికి వీటిలో ఏ కొంత అయినా దోషం ఉండడమే కారణమా అన్న విషయాలను శాస్త్రజ్ఞులు వైద్యులు పరిశోధించగలరని ఆశిస్తున్నాను. ★

కాళ్ళకుర్తి సరోజినీదేవి (నెల్లూరు).

* * *

## నిమ్మ షర్బత్ చేయు విధం

కాఫీ యివ్వొద్దు, టీవద్దు అంటే - మరి ఏమి పెట్టివ్వాలి వచ్చినవారిని ఊరికే పంపడమా?"

మనకు పండ్లు పుష్కలంగాదొరుకుతాయి. నిమ్మ, నారింజా, మామిడీ, వీటితో షర్బత్‌లు చేసి యివ్వవచ్చును. ఇపుడు నేను చెప్పబోయేది నిమ్మ షర్బత్. దీనిని ఒకసారి చేసిపెట్టుకొనవచ్చును. మామూలుగా గ్లాసు నీళ్ళలో ఒక చెక్క నిమ్మరసం పిండిచక్కరవేసి కలిపి ఇచ్చే లైమ్‌జ్యూస్ బాగానే వుంటుంది. కాని ఒక్కొక్క సమయంలో నిమ్మకాయలు బజారునుండి సమయానికి ఇంటికిరాకపోతే ఖంగారు పడవచ్చు. కొన్ని సమయాలలో డజను అణా బేడకు దొరుకుతవి. అదే నిమ్మకాయఒకటి అణాకు అమ్మేరోజులు కూడ ఉన్నవి. నిమ్మకాయలు చవుకగా దొరికేరోజుల్లో షర్బత్ చేసుకుని, నిలువఉంచుకుంటే రెండు నెలలు చెడిపోకుండా వుంటుంది. ఒకపాతిక నిమ్మకాయలు తీసికొని కళాయి గిన్నెలోగాని స్టెయిన్‌లెస్ స్టీలు గిన్నెలోగాని తడిలేకుండా రసం పిండుకుని, గింజలు, ముచ్చికలు, లేకుండా సన్నని గుడ్డతో వడియకట్టి వుంచుకోవాలి. గ్లాసురసానికి, నాలుగు గ్లాసుల పంచదార, కళాయిగిన్నెలో పోసి, టీస్పూను ఉప్పువేసి కొంచం నీళ్లుచల్లి పొయ్యిమీదపెట్టి పాకంపట్టాలి. పాకం కొద్దిగా ముదురుగా వచ్చినతరువాత, ఈ గ్లాసుడు నిమ్మరసంపోసి కలియబెట్టి పొయిమీదనుండి క్రిందికి దించేయాలి. ఈ రసం పాకంలో పోసేటప్పటికి, నిమ్మ తొనల మాదిరి చక్కని సువాసన వస్తుంది. బాగా ఆరినతరువాత, శుభ్రమైన పొడి సీసాలో యీ షర్‌బత్ పోసి గట్టిమూత పెట్టాలి. ఒక గ్లాసు నీళ్ళకు రెండు టేబుల్‌స్పూన్ల షర్బత్ వేసి కొంచెం ఎసెన్సు, కొంచెం ఐస్ వేసి యిస్తే బాగుంటుంది. తడిమాత్రం తగలకూడదు. వనీలా, పైనాపిల్, మొదలైన ఎసెన్సులు తెచ్చి యింట్లో అట్టేపెట్టుకుని కావలిసినప్పుడు వెంటనే షర్బత్ చేసుకొనవచ్చు. బయటకొన్న సీసాలకంటె ఇంట్లో తయారుచేసుకునే షర్బత్ చాలా రుచిగావుంటుంది. పరిశుభ్రంగా వుంటుంది. పైగా చాలా చవుకలోను తయారవుతుంది. మనం స్వంతంగా యింట్లో చేసుకున్నామనే సరదావుంటుంది. అవునా? తీరిగ్గా వున్నపుడు ఇలాంటివి చేసుకొనవచ్చును. మరి తయారు చేస్తారుకదూ! ★

కొత్తపల్లి రాజ్యలక్ష్మి.
చిన్నగంజాం.

## అదోరకం కోడరికం

మొన్న మాశ్యామల అత్తవారింటినుంచి వచ్చిందని తెలిసి చూడటానికి వెళ్లాను. మాటా—మంచీ అయ్యాక వాళ్లఅత్తగారు కొన్నచీరెలు, నగలు చూపించింది శ్యామల. అవన్నీ చూసి శ్యామలకు మంచిఅత్తగారు దొరికింది. అదృష్టవంతురాలు అనుకున్నాను. తర్వాత ఏదో మాటలసందర్భంలో "నా కాఇంట్లో సుఖంలేదే" అనేసింది శ్యామల. నేను ఆశ్చర్యపడ్డాను. ఇందాక నేను చూసిన నాటికి ఈమాటకు పొసగలేదు. ఎందుకని అడిగాను. శ్యామల వరసన చెప్పుకొచ్చింది. వాళ్ళ అత్తగారిదగ్గర మాట్లాడినా తప్పే, మాట్లాడకపోయినా తప్పే. వాకిటి వరండాలోకొచ్చి కూర్చుంటే సిగ్గులేదంటుందిట. లోపల కూర్చుంటే బూబుకిమల్లె బయటకి రావంటుందిట. మా శ్యామలకు కుట్లు, అల్లికలు అంటే కాస్తపిచ్చి. వాటికి పెద్దగొడవ చేసిందట వాళ్లఅత్తగారు ఈ కుట్లతో బొలెడంత టైమూ, డబ్బూకూడా వృధాఅవుతున్నాయని. ఇవన్నీ చెప్పి ఇట్లా ప్రతిదానికీ సాధిస్తుంటే సుఖం ఎక్కడినుంచి వస్తుందే. మరి బోలెడుడబ్బుపోసి వస్తువులను నీకోసం కొనటంలో ఆవిడ ఉద్దేశం ఏమిటో నాకు

అర్థంకావటం లేదన్నాను నేను. ఏమున్నది. తనకోడలుకు నగలుంటే తనకేగొప్ప అందు కనిలే అన్నది శ్యామల.

మా శ్యామల అత్తగారేకాదు. ఇలాంటి వాళ్లు చాలామంది ఉన్నారు లోకంలో. కోడలుకూడా తమలాంటిదే. ఆమెకూడా ఒకతల్లికన్న బిడ్డేనని అనుకోరు. అందరూ అట్లా ఉన్నారనికాదు. సగంమందికి పైగా సాధించేవారు ఉంటారు. ఆ సాధింపులు ఇంట్లోనే అయితే కొంతమటుకు నయమే. ఎక్కడికన్నా వచ్చినప్పుడుకూడా పమిటి తిన్నగా వేసుకో, జడ బిర్రుగా అల్లుకో, బొట్టుపెద్దదిగా పెట్టుకో, ఏమిటా విధవ వేషాలు బోగంపాపలల్లే, తిన్నగా ఉండక అంటూ తమఅధికారాన్నంతా బయట పెడు తూఉంటారు. ఆ కోడలు ఎలాచేసినాఅందు లో ఏదో ఒకలోటు కనుపిస్తూనే ఉంటుంది వీరికి. అంతగా అప్పటికేమీ దొరక్కపోతే వెనకటివికూడా తవ్వి సాధిస్తారు కొందరు. మొన్న మేము మా బంధువుల ఇంట్లో ఏదో శుభకార్యం జరిగితే వెళ్లాము. అక్కడికి వచ్చిన ఒకావిడ చుట్టాలనందరినీ కూర్చోబెట్టి కోడల్ని సాధించటం మొదలుపెట్టింది. ఆవిడకు ఆరోజున చేసిన తప్పులేమీ దొరకలేదేమో. పెళ్లినాటిమాటలు మొదలుపెట్టింది. వియ్యాలవారు తమకు సరిగ్గా మర్యాదచేయలేదుట. భోజనాలు ఆలస్యంగా పెట్టారుట. అప్పగింతల్లో పట్టుచీరలు పెట్టలేదుట. ఇంకా ఏమేమో చేయలేదుట. కజ్జాకోరులు, అబద్దాలకోరులు, గతిమాలినవాళ్లు, సిగ్గులేనివాళ్లు అని వియ్యాలవారిమీద దాడి సాగించింది. పాపం! పుట్టింటివారిని అట్లా తిడుతుంటే ఆ అమ్మాయిమనసు ఎంత బాధపడిందో. అన్నీ విని మెదలకుండా ఊరుకున్నదా అమ్మాయి. ఇట్లాఉంటాయి కొంతమందితరహాలు. మళ్లీ వీరి మర్యాద ఏమన్నా కారిపోతున్నదా అంటే అదీలేదు. వాళ్ల అమ్మాయిపెళ్లి అయినతరువాత వియ్యాలవారిని ఒక్కనాడు వీరు పిలిచి ఎరుగరు. కాని కొడుకు వియ్యాలవారు తమకేదో దోచిపెట్టలేదని సాధింపులు. ఇలాంటి వాళ్లను మార్చటానికి ఒక్కటే ఉపాయం తోస్తున్నది. విలుంటే వాళ్లమాటలు అసలు చెవిలో వేసుకోకుండానన్నా ఉండాలి. లేకపోతే వేరేనన్నా ఉండాలి. ఇంతకన్నా ఉపాయాలేమీ తోచటంలేదు. ఏమయినా అత్తాకోడళ్లమధ్య సద్భావం లేకపోతే సంసారంలో శాంతిఉండదు.

టి. నిర్మల (కసుకుర్రు)

* * *

## ఎన్నిటికో; ఎన్నటికో

నాయనమ్మగారు కోడలిమీద కోపంతో మనుమడిమీద ప్రేమ చూపలేదని వ్రాశారు తుమ్మల సరోజినీదేవిగారు. అది చదివిన నాకు ఒక సంగతి గుర్తుకి వచ్చింది; కొందరు కన్నతల్లులే తమ బిడ్డల్ని కోపంతో యేమి చేసేది తెలుసుకోలేరు. నాకు తెలిసినామే 6 సంవత్సరాల పిల్లవాడికి ఇనపగరిటె కాల్చి కాలిమీద వాతపెట్టింది. వాడుచేసిన తప్పు ఆరోజు పొద్దుననించి అవి కావాలి ఇవి కావాల అని యేడిపిస్తున్నాడట. ఆ బాధ పడలేక వాతపెడితే కొన్ని రోజులదాక చెప్పినట్లు వింటాడట. భయం వుంటుందట. అందుకని పెట్టేనంది, ఉబుసుపోకకని వెళ్లిన నాతో. గొప్పగా చెప్పింది! పదిహేను రోజులకిగాని ఆవాత మానలేదు. ఒక సంవత్సరం అయినది ఇది జరిగి. ఇప్పటికీ పిల్లవాని కాలిమీద ఆ మచ్చ ఉన్నది. ఇప్పుడు మాయింటి ప్రక్కఆమె "పొయ్యిలో గరిటె పెట్టేను అల్లరిచేస్తే వాత పెడతాను బుద్దిగా కూర్చోండి" అని పిల్లలిని ప్రతిరోజు బెదిరిస్తుంది. ఆమాట విన్నప్పుడల్లా నాకు ఆ పిల్లవాడి కాలువాత గుర్తుకొస్తుంది. కన్నతల్లులే ఈరకంవారు కొందరు ఉంటే ఇహ నాయనమ్మలు ఆరకంవారు ఉంటంలో ఆశ్చర్యంలేదు. నేను కనులార చూచినది వ్రాశాను. కొందరు స్త్రీలు కొన్నివిషయాల్లో పద్ధతులు ఎప్పుడు మార్చుకుంటారో ఊహించలేము.

వి. విజయభారతిదేవి,

(హైద్రాబాదు)

* * *

## కాబట్టే ....

ఈమధ్య హైదరాబాద్‌ను గురించి అన్నపూర్ణరామారావుగారు వ్రాసినదానిపై చాలా విమర్శలు బైలుదేరాయి. వాటిని చదువుతోంటె నిజంగా నాకే ఎంతో బాధగావుంది. ఇంక వ్రాసిన ఆమె ఎంత బాధపడ్డారో పాపం! ఏదైనాగాని, ఎవరైనాగాని వ్రాయాలంటె బాగా ఆలోచించి మరీ వ్రాస్తారు. ముఖ్యంగా యిది వేలకొలది ప్రజలు చదువుతారనే దృష్టి వ్రాసేవారికి ఎప్పుడూ వుంటుంది. అలాంటప్పుడు వారు వున్నది వ్రాస్తారుకాని, కల్పించి, ఊహగానంచేసి వ్రాయరు.

80 రు. ల సామాన్లు పోయాయి అంటె అది గొప్పనా? ఆమాటకొస్తే అవి వారి అజాగ్రత్తవల్ల పోయాయి. అంటే యిది చిన్నతనం కాదా? అలాంటప్పుడు చిన్నతనంగా కన్పించేవి ఎవరైనా పత్రికకు వ్రాస్తారా? ఉన్న సంగతి యిది. కాబట్టే వ్రాశారు.

మంగళ కందూర్ (విశాఖపట్టణం)

* * *



ముదములేని ఆముదము

## ఏమిటి సలహా?

శ్రీమతి దద్దనాల రంగనాయకమ్మగారు ఇచ్చిన సలహాలు చాల బాగున్నాయి. అతి సులభంగా ఆచరించ వీలుగాకూడ వున్నాయి. మనపని మనం చేసుకున్నప్పుడుండే తృప్తి పనివాళ్ళు చేస్తే వుండదు. ఇంతకూ శ్రీమతి అన్నపూర్ణ రామారావుగారి సలహా ఏమిటో తెలిపితే బాగుండును.

కె. పి. బి. (కాళహస్తి)

* * *

## నా వినతి

అనేక కుటుంబములు ఒకసారిగా హైదరాబాద్‌కువచ్చి కాపురముండుటవల నౌకర్ల గిరాకి పెరగవచ్చు. అవసరమును బట్టి ఎంతైన ఇస్తారని వారి అభిప్రాయం అవవచ్చు. అవసరాన్నిబట్టి ఎక్కువ ఇస్తారన్నది అందరెరిగినదే. ఇక, ఛాయాదేవి గారు చెప్పినట్లు స్వల్పవేతనములకే నమ్మకమైన నౌకర్లు దొరుకుటకూడ కద్దు. అటువంటప్పుడు మనము అదృష్టవంతులమే.

ఇంకొక విషయము. 6-2-1957 పత్రికలో మంగళా కందూరుగారు అలంకరణను, లోటివారి అమాయకత్వమునుగూర్చి వ్రాస్తూ మధ్యమధ్యలో, "ఈలాంటి వారు అసహ్యంగ ఉంటారు; ఈలాంటి వారినిచూస్తె నవ్వువస్తుంది; ఈలాంటి వారిని చూస్తె. చిరాకేస్తుంది" అని వ్రాశారు. తోటివనిత ముచ్చటనుచూచి చిరాకుపడటము, నవ్వడము, అసహ్యించుకోవటము మంచిదికాదు.

స్వల్ప విషయాల్లో వాద భేదాలు పడకుండ, వనితాలోకొన్ని సక్రమంగ నడుపుకొందాము.

యు. జయప్రద,

(భజరాజనగర్, ఒరిస్సా.)

("పెరిగి...క్" అనే విషయముపై ఇంతటితో ముగిస్తున్నాము. ॥సం॥)



# చిరస్మరణీయురాలు

బి. ప్రేమలీల, (పెద్దాపురం)

దేశం కాని దేశంలో, మాతృదేశానికి దూరంగా ఫిబ్రవరి 28 వ తారీకున ఒక సాధ్వీమణి, స్వార్థత్యాగిని దివంగతురాలైనది. ఆమెయే శ్రీమతి కమలా నెహ్రూ. ఈనాడామె వర్థంతి. ఆమె స్వర్గస్థురాలై ఎన్నో సంవత్సరాలు గతించాయి. కాని ఆమె పవిత్ర స్మృతి ఆరనిజ్యోతియై కోటి కిరణాలతో ప్రకాశిస్తోంది. సౌభాగ్యానికి సౌందర్యానికి ఆలవాలమైన కాశ్మీర్ దేశపు గారాబుపట్టి కమల. ఆమె శరీర మెంతసుకుమారమో హృదయ మంత సున్నితము. పదిహేడేళ్ల ముగ్ధవయస్సులో నవవధూమణిగ నెహ్రూ కుటుంబంలో అడుగునుంచినది. ఇరువదిఏడేళ్ల వరుడు నెహ్రూజీకి, పదిహేడేళ్ళ వధువు కమలకూ వయస్సులో, అలవాట్లలో ఎన్నో భేదాలు - అయినప్పటికీ వారి వైవాహికజీవితం సుందరతరం, మనోజ్ఞం, ఫలవంతం అయినది. కమలా నెహ్రూ అభిమానవతి. తాను సత్యమని నమ్మినదానిని ఆచరించ చేయడానికి ఏమాత్రం సందేహించెడిది కాదు. రాజకీయములలో పూర్తిగా నిమగ్నుడయిన భర్త యెడల ఏమాత్రం కినుక వహించక-ఆయనకు తగిన సహచారిణియైనది. తన పదునెనిమిదిఏళ్ళ వైవాహిక జీవితంలో నెలలతరబడి ఎడబాటుకు గురిఅయ్యారు దంపతులు. మనోవ్యధ; అస్వస్థత ఆమెను క్రుంగదీశాయి. వాటినన్నిటెని ఓరిమితో సహించినది. చిరునగవుతో అనారోగ్యమును సహితము లెక్కించక భర్త అడుగుజాడలలో నడచి జైలుకేగి వీరనారీమణి అనిపించుకున్నది. దేశ స్వాతంత్ర్యంకొరకు శక్తి కొలదీ పోరాడవలెనని ఆమె ఆశ. కాని బలహీనురాలు. రాజకీయ విషయాలలో పూర్తిగా మునిగిపోయిన భర్త, తనను పూర్తిగా విస్మరించినారని ఆమె ఏనాడూ దుఃఖించలేదు. మీదుమిక్కిలి ఆయనను ప్రోత్సహించినది. భయంకరమగు మృత్యువుతో పోరాడుచు మరణశయ్యమీద ఉన్నపుడుకూడ భర్తకు ఆయన యొక్క విధ్యుక్త ధర్మమును ప్రబోధించినది. వివాహమై పద్దెనిమిది సంవత్సరాలయినా కమల ఎంతో సుకుమారంగా - కన్యాత్వపు సౌందర్యంతో వెలిగిపోతూ చూపరులకు నెహ్రూజీ కుమార్తెలా అగపడేది. జైలులో వుంటూ-అప్పుడప్పుడు తమ ఇరువురి సమావేశాల అనుభవాలను ఆయన ఎంతో హృదయంగమంగ తన ఆత్మకథలో వ్రాసుకున్నారు. కమలా నెహ్రూ అలా కృశించిపోతూనే చివరికి స్విట్జర్లాండులో అంతిమసమయంలో భర్త-కుమార్తెలను చూస్తూనే కన్నుమూసింది. ఆమె మరణం నెహ్రూను ఎంతైనా క్రుంగదీసింది. ఆమె మరణానంతరం ఆమె స్మృతిచిహ్నాలు ఎన్నో వెలశాయి. పనిచేస్తున్నాయి. కాని అన్నిటికన్నా చిరకాలం నిలచేది-విలువైనది, అద్వితీయమైనది నెహ్రూజీ తన ఆత్మకథను ఆమెకు అంకితం చేయడం. ఆనాటి జాతీయవీరుడు ఈనాడు మన ప్రధానమంత్రి. కాని ఆయన ఒంటరి. ఆనాడు తన చేదోడువాదోడుగా నిలచిన సహధర్మిణి ఈనాడు స్వతంత్రభారతదేశ రథసారథిఅయిన ఆయన ప్రక్క లేదు. ఆరోగ్యాన్ని సహితం లెక్కించకుండా, సమస్త సుఖాల్నీ-దేశంకోసం త్యాగంచేసిన శ్రీమతి కమలా నెహ్రూ భారత మహిళామణులకు చిరస్మరణీయురాలు. ★

## ★ తప్పెవరిది? చిక్కెక్కడ? ★

(37-వ పేజీ తరువాయి)

మన్నించితీరాలనీ, ఎవరిమటుకు వారే అనుకొంటారు. కొందరు వయసులో పెద్దలయితే, కొందరు ధనములో, మరి కొందరు చదువులో...ఇలా వుంటాయి గౌరవ కారణాలు.

ఈ వయో, ధన, విద్యాభేదాలు వారి మధ్య సహకారానికి బదులుగా సంఘర్షణలకి దారి తీస్తాయి. ఎవరి దృక్పథమును వారు విడవరు. కనీసం ఇంకొకరి ఆశయాలను అర్థం చేసుకొందికైనా ప్రయత్నించరు. ఇట్టి మనస్తత్వాలు చెల్లుబడి అవుతూన్నంత కాలం గృహకలహాలు తప్పవు. ఒక్క అవిభక్త కుటుంబాలలోనె అననక్కరలేదు. విభక్త కుటుంబంలో మాత్రం భర్తకి, భార్యకి, పిల్లలకి మధ్య సహకారం లేకుంటే ఆ గృహం ఎలా రాణిస్తుంది. "మనం సంఘజీవులం. ఏ ఒక్కరూ, మిగిలిన వారి సహకారం లేందే బ్రతుకలేము" అన్న సాంఘిక సూత్రం అందరికీ తెలిసిందే. అటువంటప్పుడు ఒకే గృహంలో నివసిస్తూన్న వారి మధ్య సహకారం లేకుంటే కలహాలు రావా?

నేటి ప్రజాస్వామ్యయుగంలో అధికారాలు, ఆజ్ఞలు అన్న పదాలను మరచిపోవాలి. నేటిజీవనానికి వలసినవి సామరస్యం, సహకారం మాత్రమే. గృహము ఒక సహకారసంఘముగా మారాలి. అందలి వ్యక్తులందరూ సంఘ సభ్యులే. నిత్య జీవిత కార్యక్రమంలో ఏ చిన్న భేదాభిప్రాయం కల్గినా అందరి ముందరా నిష్కర్షగా చెప్పాలి; అందరూ సానుభూతితో, సబబుగా ఆలోచించాలి. దీనిలో స్త్రీ పురుష వ్యత్యాసం, పక్షపాతబుద్ధి వుండకూడదు. మెజారిటీ పక్ష నిర్ణయాన్ని మిగిలిన వారు మన్నించాలి. చిన్న పెద్ద తారతమ్యం లేకుండా ప్రతివారికి న్యాయం చేకూరాలంటే సంఘసభ్యులందరి సహకారం కావలసివుంటుంది.

సాధారణంగా స్త్రీలు తమ తగాదాలను తామే సరిదిద్దుకోవాలి. స్త్రీలకే పరిమితమైన గృహనిర్వహణాది విషయములలో పురుషుల ప్రమేయం వాంఛనీయంకాదు. వారికి అనుభవములేని విషయములలో వారి ఓటు సవ్యంగా ఉపయోగపడకపోవచ్చును. అత్తాకోడళ్లయినా, ఆడపడుచులైనా, అక్కచెల్లెండ్రయినా, ఒకరిని ఇంకొకరు అర్థంచేసుకోడంలోనే వుంది. సహజంగా ఎవ్వరూ చెడ్డవారుగా, పేచీలకోరులుగా పుట్టరు. వారు పుట్టి పెరిగిన వాతావరణం, మానసిక పరిస్థితులు, ఆర్థికకారణాలు వారిని అలా మార్చివేస్తాయి. తెలివైన స్త్రీలు, అట్టి వారిని అర్థంచేసుకొని, ఆపరిస్థితులనుండి వారిని తప్పించి సరియైనమార్గమున పెట్టేందుకు ప్రయత్నించవలెనేకాని, వారితోపాటు తామూ వక్రమార్గములో నడిచినా, లేక వారిని పరిత్యజించినా, ఒక్క తమ గృహమునకే కాక, సంఘమునకంతకును అపకారం చేసినవారగుదురు. చెడ్డకి మళ్లినంత త్వరగా మంచికి మనసు మారకపోవచ్చు, కాని ప్రయత్నిస్తే సాధ్యం కానిదంటూ వుండదని నా అభిప్రాయం. ★



# జరుగుబాటు



(21-వ పేజీ తరువాయి)

"అవును బాబూ" అన్నది కోటమ్మ.

"మరి ఎప్పుడు రమ్మంటావ్"

"నాదగ్గర చిల్లిదమ్మిడీ లేదు బాబూ. రెక్కలు ముక్కలయ్యేట్టు చాకిరీచేసినా పొట్ట నిండడంలేదు."

"ఆ...దానికేంలే?? నువ్వు తలుచుకుంటే డబ్బు పరుగెత్తుకొంటూ రాదూ?" అన్నాడు షావుకారు.

"ఎట్లావస్తుంది బాబూ?? పనిచేస్తే రాని డబ్బు తలుచుకుంటే వస్తుందా? సుందరావుగారింట్లో నాలుగునెలలు నీళ్లు పోశా. పన్నెండు రూపాయ లివ్వాలి. రేపురా-మాపురా అంటుంది ఆతల్లి. రాఘవయ్యగారింట్లో పెళ్ళికి వంటపనిచేశా. ఆ అమ్మాయికి చక్కటి పిల్లాడుకూడా పుట్టాడు. ఎప్పుడెళ్ళినా రేపు రావే అంటుంది ఆతల్లి..."

"పాపం...అట్టనా. ఇంకా నాకు తెలియనే తెలియదు కోటీ...ఇదుగో ఈ పది రూపాయలూ..."

"వద్దుబాబూవద్దు. ఇట్టనేఉండనియ్యండి నన్ను. నా తంటాలు నే పడ్తా. పనేం చెయ్యకుండా మీ డబ్బు ఎందుకు బాబూ నాకు."

"నీదంతా ఒఠి పిచ్చి. నామాటకు సరేనను. రేపటికల్లా..."

"వద్దు బాబూ...వద్దు. మీరు చాలా మంచివాళ్లు. నన్ను ఇట్టాగే ఉండనివ్వండి నా వొంట్లో ఓపికుండాలి. దేవుడు చల్లగా చూస్తే నాలుగిళ్లల్లో పనిచేసుకుని, నాలుగిళ్లకు నీళ్లుపోస్తే నా పొట్టనిండుతుంది..."

"కోటమ్మా...నీ మంచికే చెప్తే నీకు తెలియడంలేదు. నామాటకు ఒప్పుకో. లేదా వారంరోజులలో కొంప ఖాళీ చెయ్యి. నీ యిష్టం వస్తా మరి" అని షావుకారు వెళ్లిపోయాడు. రుసరుసలాడ్తూ. ఆయనకు కోటమ్మంత కూతురున్నది!!!

షావుకారు వెళ్లిన తరువాత కోటమ్మ బిగ్గరగా చాలాసేపు ఏడ్చింది. ఎవరు వింటారు ఆయేడ్పు? ఎవరికి పట్టిందే? ఆ రోజల్లా తిండి తినలేదు. వళ్లంతా విరగ్గొట్టినట్టు నొప్పి. అయినా అట్టాగే ఊరంతా తిరిగి రైలుస్టేషనుదగ్గిర కొత్తగాకట్టిన ఇళ్లల్లో ఒక గది నెలకు మూడు రూపాయల అద్దెకు సంపాదించింది.

అట్టాగే ఉన్నపూట తింటూ లేని పూట పస్తుపడుకొంటూ రోజులు గడుపుతున్నది కోటమ్మ.

ఇళ్ళకు వెళ్ళి పనిచెయ్యడం చాలా చిక్కుగా ఉంటున్నది. ఇంతవరకూ చిన్నవాళ్ళకే దుర్బుద్ధు లనుకుంటుంటే వయస్సు మీరినవాళ్ళుకూడా అంతేనని తెలిసివచ్చింది.

బజారున తిరిగేవాళ్లంతా ఇంతేనేమోలే అనుకొంటుంటే బయటికి చాలా పెద్ద మనుషులలాగా కనిపించేవాళ్ళల్లో చాలామంది కూడా ఇంతేనని తెలియడానికి ఆట్టేరోజులు పట్టలేదు.

అయినా ఇన్నిరకాల కష్టాలుపడిన తను 'పతిత్తు' అంటే ఎవరు నమ్మతారూ? అదంతా అట్లా ఉండగా ఒంట్లో శక్తి ఉడిగిపోతోంది. నీళ్లు మొయ్యలేకపోతోంది... పిండివిసరడం, ఖారంకొట్టడంవంటి పనులు చెయ్యలేకపోతోంది. చెయ్యకపోతే పొట్ట నిండేదెట్లా? ఏమి చెయ్యాలి? ఏమి చేస్తే ఇతరుల దయాదాక్షిణ్యాలపై అంతగా ఆధారపడకుండా బతకవచ్చని కోటమ్మ చాలా రోజులు ఆలోచించింది......

* * *

ఓనెల నీళ్ళుమోసిన డబ్బులు చేతిలోకి వచ్చినతరువాత...ఒకరోజున ఒక సోలెడు శెనగపిండి తెచ్చింది. అణా ఎండు మిరపకాయలూ, కాని ఉప్పూ తెచ్చింది. రెండు అరటికాయలు తెచ్చింది. సవాపావు సెనగనూనె తెచ్చింది. తిండి వండుకోడం కూడా మానేసి తనకు చేతనైనట్టే బజ్జీలువండి రైలుస్టేషను దగ్గరికి తీసుకువెళ్ళింది. పన్నెండు గంటలకల్లా రూపాయిన్నర వచ్చింది. తన పెట్టుబడిపోను రూపాయి మిగిలింది. అంతే...అట్లాగే రోజూ ఏదో ఒకటి వండి స్టేషనుకు పట్టుకువస్తుంది. బళ్ళవాళ్లూ, రిక్షాలవాళ్లూ, రైలుకెళ్లే వాళ్ళల్లో కొందరూ ఆమెవద్ద బజ్జీలూ, గారెలూ, పుణుకులూ, కారంబూంది కొంటారు. అంతా కొద్ది బేరమే.

కోటమ్మ ముసల్దయింది. అయినా ఆపని మానివెయ్యలేదు. తనకు చేతనైనట్టే ఏదో ఒకటి వండి స్టేషనుకు తీసుకువచ్చి ఇంకా-అంటే అరవయ్యేళ్లు నిండినా-అమ్ముతునే ఉన్నది. అంతేకాని పెద్ద హోటలు పెట్టి భాగ్యవంతురాలు కాలేదు. తిండికిలేక దిక్కులేనిచావు చావలేదని ఆరోజు అయ్యన్నసెట్టి సత్రందగ్గర ఆమెను చూచినప్పుడు తెలుసుకున్నాను.

కోటమ్మను చూడగానే నాలో కలిగిన ఆవేశం నేను వ్రాయలేను. ఎప్పుడయినా మీరు అ ఊరు వెళితే రైలుదిగి, స్టేషనులోంచి బయటికి రాగానే గుర్రబ్బళ్ళూ, రిక్షాలూ ఆగేచోట ఓ చెట్టు క్రింద కోటమ్మను చూస్తారు. అప్పుడు ఎవరినయినా ఆమని షెవరు? అవి అడుగుతారు. ఆమెను ఎరిగున్నవాళ్లయితే మీకు ఈ కథంతా చెప్తారు.

కోటమ్మ కథంతా గుర్తుకొచ్చిన తరువాత నాన్న అంటున్న ఆత్మాభిమానం అంటే యేమిటో, వంశగౌరవం అంటే యేమిటో నామటుకు నాకు కొంతవరకూ అర్థమయినట్లనిపించింది......






# గర్వభంగం

అనగ అనగ పూర్వం
అరవ దేశమందు
అన్ని విద్యలందు
ఆరితేరినట్టి
    అవ్వ ఉండెను.
మాట మంతియందు
దీటురారు నాకని
అవ్వ మనసులోన
    అంకురించె గర్వం.
దూర భూమినుండి
దారి నడచుచుండి
అవ్వ కడుపు మండి
    ఆక లయ్యెనండి.
దూరాన కాంచము
నేరేడు వృక్షము
కాపు బట్టి యుండగ
    దాపు జేరె మెల్లగ.

కొమ్మమీద నెవ్వరో!
గొల్లబాలు డొక్కడు
"అవ్వ - అవ్వ చెప్పమా
    ఆకలితో నుండకుమా!

కడుపు నిండ తినుటకు
ఉడుకు పండ్లు వలయునా!
చల్లబడుట కుదరము
    చల్లనిపండ్లు వలయునా?

పిల్లవాని మాటకు
ఉల్లమందు మురియుచు
చల్లనివే యిమ్మని
    నవ్వుకొనుచు నడిగె నవ్వ.

**దూతలూరి జగన్నాథం**

బాలు డంత కొమ్మను.
చాల ఊపి విడిచెను
రాలిపడెను కుప్పగ
    చాలినన్ని పండ్లు.

పడిన పండ్ల నెత్తి
పక్వమ్ముగ నూది
ఒక్కటొకటె తినగ
    టక్కరి ఆ బాలుడు—

'అవ్వ! అవ్వ! ఏమిటిది
ఊది తినెద వుడుకుపండ్లు?
చల్లనివే కావాలని
    కల్లమాట లాడితివ!

పిల్లవాని మాటలలో
తెల్లమయ్యె నవ్వకు
గర్వపడిన వారికెల్ల
    గర్వభంగ మిల్లె యనుచు!



# కీర్తి - అపకీర్తి

ఔరంగజేబు చక్రవర్తి విలువైన పింగాణీ పళ్లెరాలలోగాని విందు లారగించేవాడు కాదు.

పింగాణీ సామగ్రి తయారు చెయ్యడానికి చైనా దేశం ప్రసిద్ధి కెక్కింది. ఆ దేశంనుండి ఢిల్లీకి వచ్చిన వర్తకులందరూ మొదట చక్రవర్తినే దర్శించి తాము తెచ్చిన విలువైన పళ్లెరాలనూ, పాత్రలనూ పాదుషాకు చూపేవారు. ఆయన కొనగా మిగిలినవే ఇతరులకు దక్కేవి. తనకు చూపకుండా అమూల్యమైన వస్తువు దేనినైనా ఒక వర్తకుడు ఎవడికైనా విక్రయించాడని తెలిస్తే పాదుషా ఆ వర్తకుణ్ణి కఠినంగా శిక్షించేవాడు!

చక్రవర్తి చైనా వర్తకులవద్ద నుండి అప్పుడప్పుడు కొన్న పింగాణీ పాత్రల విలువ ఇరవైయైదు లక్షల రూపాయలని అంచనావేయబడింది. ఆయన రోజూ పండ్లరసాన్ని గ్రోలే కప్పు ఒక్కటే ఇరవైవేల రూపాయలట! ఆ కప్పు పైభాగంలో చుట్టూ ఇస్లాం మత ప్రవక్తయైన మహమ్మదువారి జీవితకథ మనోహరమైన బొమ్మలలో చిత్రింపబడినదట! దాన్ని చూసీ చూడటంతోనే చక్రవర్తి మోజుపడి వర్తకుడు చెప్పిన ఇరవైవేల ధరా చెల్లించి కొనేశాడు.

ఏరోజు కారోజు పాదుషా గారి భోజన మవడంతోనే ఆ పాత్ర సామగ్రినంతనూ కడిగేసి జాగ్రత్త పెట్టడానికి గొప్ప జీతంమీద ఒక ఉద్యోగస్తుణ్ణి నియమించారు. మామూలునౌకర్లైతే ఆ అమూల్య వస్తువుల విలువను గ్రహించలేక అశ్రద్ధగా కడగడంలో ఏ వస్తువైనా చెయ్యిజారి బీటుపడడంగాని బద్దలైపోవడంగాని జరగవచ్చునని, ఆ గొప్ప జీతగాణ్ణి వేశారు.

ఆ జీతగానిపేరు ఖుస్రూ. ఆతని చేతివేళ్లు బలమైనవి; వణుకు లేనివి. ఏపాత్ర పట్టుకున్నా, పడిపోవడం అనేది ఉండదు. ఆ వేళ్ళు మృదువైనవికూడాను. అందుచేత యెంత సున్నితమైన వస్తువైనాసరే చిటికిపోకుండా ఆతడు తోమి శుభ్రపరచగలడు.

కాని ఒకనాడు ఒక ప్రమాదం సంభవించింది. అప్పుడు ఔరంగజేబు రాజధానిలో లేడు. దక్షిణ ప్రాంతాన్ని జయించాలన్న కోర్కెతో దండయాత్రకు వెళ్లేడు. ఖుస్రూ, మధ్య మధ్య పాత్రలను తీసి ముఖమల్ గుడ్డతో తుడిచి పెట్టకపోతే మెరుగు పోతుందని తోచి, ఆ పళ్లెరాలనూ పాత్రలనూ ఒక్కొక్కటే తీసి తుడిచి బోర్లించి

పెడుతున్నాడు. పాదు
రసాన్ని సేవించే పాత్రను
త్తగా పట్టుకు తియ్యబో
ఎక్కడనుంచి వచ్చిం
పాత్రలో ఎర్రతేలొకటి
ముందే చేరి ఖుస్రూ చ
వేలును పుటుక్కుమని అం
చింది. ఆతడా పాత్ర
క్కన జారవిడిచాడు. ఆ
రాతి నేలపైన ఆ విలువై
పడీ పడటంతో ముక్క
పోయింది!

ఖుస్రూ గుండె గతుక్కు
ఔరంగజేబు చక్రవర్తి దక్షి
ణ్నుంచి తిరిగి రావడంతో
సమయంలో 'ఆ కప్పు ఏది
అడుగుతాడు! బద్దలై పో
తెలవడంతోనే ఉరిశిక్ష విధి

ఖుస్రూ తనకు రానున్న
దనుగూర్చి బంధుమిత్రులతో
కుని ఏడ్చాడు. వాళ్ళు 'ఏడి
లాభం? అలాంటి కప్పును
దాన్ని చైనానుంచి
వెంటనే. పాతకప్పు బద్ద
సంగతే తెలియనివ్వకు' అని
చెప్పేరు.

ఖుస్రూ తాతలు సంపా
ఆస్తినీ, భార్య మెడలో వు

**పాలంకి వెంకటరామచంద్రమూర్తి**

# ★ కీర్తి - అపకీర్తి ★

లనూ విసనకాడికి అమ్మేసి, తన సంపాదనలో నిలవేసుకున్న డబ్బుతో సహా మూటగట్టి ఒక వర్తకుడి చేతికందించాడు. 'బాబూ నువ్వు వెంటనే చైనాదేశానికి వెళ్లు. ఇలాంటి కప్పనే కొనుక్కురా' అని పంపేడు.

చక్రవర్తికి దండయాత్రలో విజయం చేకూరలేదు. ఆయన అనుకున్నదానికన్న ముందుగానే రాజధానికి చేరుకున్నాడు. చాలా చిరాకుగానూ కోపంగానూ ఉన్నాడు. మొదటినాడు భోజనం చేసేటప్పుడే కప్ప బద్దలైపోయిందన్న సంగతి తెలిసి ఉగ్రుడై పోయాడు! కాని కొత్తకప్ప చైనా నుండి రాబోతోందని తెలిసి కొంత శాంతించాడు. ఐతేం, ఖుస్రూను మాత్రం వదలలేదు. ఉద్యోగం తీసేసి చెఱలో పెట్టించాడు.

ఖుస్రూ పంపిన వర్తకుడు చైనా నుండి తిరిగిరాలేదు. ఆ కాలంలో ఇండియానుండి చైనా వెళ్లాలంటే నేలమార్గాన్ని మధ్య ఆసియా ద్వారా వెళ్లేవారు. దారిలో బందిపోట్లు ఎక్కువగా ఉండేవి. ఆ వర్తకుణ్ణీ పరివారాన్నీ దారిలో ఎవరో దోచుకుని చంపేసి ఉండాలి.

ఖుస్రూ పెట్టిన గడువు దాటిపోవడంతోనే చక్రవర్తి ఆతణ్ణి రప్పించి, 'నీవు వెంటనే చైనా వెళ్ళి ఆ కప్పను తేవాలి! లేదన్నావా ఉరి కంబం ఎక్కవలసుంటుంది!' అన్నాడు.

ఖుస్రూ చేసేదిలేక బయద్దేరేడు. చక్రవర్తి అతనితో, ఊరు దాటడంతోనే ప్రాణాలు దక్కించుకోడానికి పారిపోదామనుకుంటావేమో జాగ్రత్త! నువ్వు తిరిగి వచ్చేదాకా ఇక్కడ నీ భార్యా బిడ్డలూ ఖైదులో ఉంటారు!' అన్నాడు.

ఖుస్రూ, 'అయ్యో, ఈఉద్యోగం వచ్చిననాడు పెద్దజీతమని మురిసిపోయానేకాని పులినోట్లో తల దూర్చుకున్నానన్న సంగతి తెలుసుకోలేకపోయాను!' అని లోలోపల కుమిలిపోతూ ప్రయాణం కట్టేడు.

ఈ వృత్తాంతం దేశమంతటా పాకింది. దేశంలోనేకాదు చుట్టుప్రక్కల దేశాలకుకూడా తెలిసింది. ఆ కాలంలో పారసీక దేశాన్ని అబ్దుల్‌షా చక్రవర్తి పాలిస్తున్నాడు. ఆయన నిండుకొలువు తీరివుండగా ఇండియానుండి వచ్చిన చారులు, 'విశేషాలేమిటి?' అని ఆయన అడగ్గానే ఖుస్రూ విషాద గాథను తెలియచేశారు.

అబ్దుల్‌షా సంగతంతా విని ఔరంగజేబు క్రౌర్యానికి ముక్కుపై వేలు పెట్టుకున్నాడు. పక్కనున్న వజీరుతో, 'మా భోజనశాలలో అటువంటి పాత్ర ఏదైనా ఉందేమో చూడండి. ఉంటే దాన్ని అంచీల మీద గుఱ్ఱపు రౌతులను పంపి ఆ ఖుస్రూకు అందజెయ్యండి' అన్నాడు.

వజీరు పాదుషా అంతఃపురంలో ఉన్న అమూల్యమైన పింగాణీ సామగ్రినంతా పరిశీలించిచూశాడు. మహమ్మదు ప్రవక్త జీవిత గాథ చిత్రింపబడ్డ కప్ప ఒకటి అందులో కూడా కనపడింది. 'అల్లా దయగలవాడు! ఆ ఖుస్రూ ప్రాణాన్ని కాపాడేడు!' అనుకుంటూ వజీరు ఆ పాత్రను చక్కగా బంగీ కట్టించి చురుకైన దళాధిపతి నొకణ్ణి రప్పించి వప్పగించాడు, 'పదిమంది రౌతులను వెంటబెట్టుకు వెళ్ళు. వాయువేగాన్ని వెళ్లే గుఱ్ఱాలను తీసుకుపో. చైనాకుపోయే రహదారిని వెళ్లి ఆ ఖుస్రూను కలుసుకుని ఈ పాత్రను అందజెయ్యి' అన్నాడు.

ఆ దళాధిపతి ఒక్క నిముషం కూడా ఆలస్యం చెయ్యకుండా తన పరివారంతో చైనా రహదారిని పడి దౌడుతీశాడు. కాని లాభం లేకపోయింది! వాళ్లు చేరక పూర్వమే ఖుస్రూ ప్రయాణంలో జబ్బుపడ్డాడు. మనోవ్యాధికి ఆ వ్యాధితోడై ఆ నిర్భాగ్యుడు మార్గమధ్యంలోనే దిక్కుమాలినచావు చనిపోయాడు.

పానపాత్రను బద్దలు గొట్టేడన్న నేరంమీద ఖుస్రూ జీవితాన్ని నాశనంజేసిన ఔరంగజేబూ, ఆ జీవితాన్ని రక్షించాలన్న సానుభూతితో అటువంటి విలువైన పాత్రనే ఉచితంగా ఇచ్చిపంపిన అబ్దుల్‌షా చక్రవర్తికూడా ఎప్పుడో మరణించి మట్టిలో కలిసిపోయారు. కాని అబ్దుల్‌షా కీర్తి, ఔరంగజేబు యొక్క అపకీర్తిమాత్రం చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయాయి.

★

# రావణుని ఓటమి

శ్రీరాముడు రావణవధానంతరము అయోధ్యకు వచ్చి రాజ్యము చేస్తుండగా అగస్త్యాదిమహామునులు రామదర్శనార్థము వచ్చారు. శ్రీరాముడు వారిని ఉచితవిధంగా సత్కరించాడు. అప్పుడు రావణుని పరాక్రమాన్ని గురించి ప్రస్తావన వచ్చి రాముడు అగస్త్యమహామునిని చూచి,

'స్వామీ! రావణుడు క్రూరుడై మానవులను, దేవతలను బాధించుచుండగా అతనిని ఎదిరించి బుద్ధి చెప్పగలిగినవాడు లేకపోయాడా? సందేహము తీర్చండి' అని ప్రార్థించాడు.

అగస్త్యుడు రావణుని ప్రజ్ఞలను గురించి చెప్పసాగాడు:

రావణుడు బ్రహ్మను గురించి ఘోరమైన తపస్సుచేసి మెప్పించి దేవతలచేతగాని, రాక్షసులచేతగాని, పాతాళవాసులచేతగాని మరణము లేకుండులాగున వరము పొందాడు. శివుని మెప్పించి పాశుపతాస్త్రము పొంది గర్వాంధుడై వీరులైన రాక్షసులను, రాజులను, దేవతలను జయించి భూలోకమంతా తిరుగుతూ ఒకనాడు మహాప్రతాపశాలియైన కార్తవీర్యార్జునుడు ఏలుచున్న మాహిష్మతీపురాన్ని ప్రవేశించాడు. ఆ రోజునసే కార్తవీర్యార్జునుడు తన భార్యలతో జలక్రీడలాడటానికి నర్మదానదికి పోయిఉన్నాడు. మంత్రులవల్ల రాజులేడని తెలుసుకుని రావణుడు వింధ్యపర్వతమును చేరి ప్రకృతి సొంపును చూస్తూ నర్మదానదిని చేరాడు.

అక్కడ అడవి అనేకమైన ఫల పుష్పములతో నిండి రమణీయంగా వుంది. రావణుడు పుష్పకవిమానమును దిగి నర్మదలో స్నానముచేసి శివార్చన చేయాలని తలచి మంత్రులను పంపి పుష్పములను తెప్పించుకుని నదిఒడ్డున శివపూజ చేయసాగాడు.

రామప్రియ

రావణుడు పూజచేస్తున్న స్థలానికి దిగువగా కార్తవీర్యార్జునుడు తన భార్యలతోగూడి జలక్రీడలాడుతూ తన వేయిచేతులతో నర్మదానది ప్రవాహాన్ని అరికట్టి వినోదించసాగాడు. నీరు ఎదురెక్కి గట్లను ముంచుకుని రావణుని పూజాసామగ్రిని తుడిచిపెట్టుకపోయింది. రావణుడు నదీ వైపరీత్యానికి కారణము తెలిసికొనిరండని మంత్రులను పంపాడు. వారు నదివెంట పోయి ప్రవాహాన్ని కార్తవీర్యార్జునుడు అడ్డగించుట చూచి రావణునికి నివేదించారు.

వెంటనే రావణుడు కార్తవీర్యార్జునుడున్న ప్రాంతాన్ని చేరాడు. అక్కడ కాపలాకాస్తున్న అర్జునుని మంత్రులు రావణుని సంకల్పము తెలుసుకుని వారే రావణునితో యుద్ధముచేసి అతనిచేతిలో మరణించారు. ఈసంగతి వేగులవల్ల అర్జునుడు తెలుసుకుని నర్మదనుండి బయటికి వచ్చి కోపించి తనగద తీసికొని రాక్షసులను నుగ్గునూచ చేయసాగాడు. మార్గమధ్యంలో రావణుని అనుచరుడు ప్రహస్తుడనే రాక్షసుడు అడ్డగించగా అర్జునుడు ఐదువందల మూరల పొడవుగల పెద్దగద గిరగిర త్రిప్పి వేయగా ప్రహస్తుడు మూర్ఛపోయాడు. అది చూచి మిగిలిన రావణుని సైన్యము పారిపోయింది.

అప్పుడు కార్తవీర్యార్జునునికి రావణుడికి ఘోరమైన యుద్ధము ప్రారంభమయింది. వారిద్దరు ఒకరితో ఒకరు గదాయుద్ధము చేయసాగారు. అందు అర్జునుడు మహాభారమైన గదతో రావణుని ఎదురు రొమ్మున బలముగా కొట్టాడు. కాని రావణుని హృదయము పగులుటకు బదులు గద రెండుముక్కలయింది. రావణుడు ఆ దెబ్బకు తూలి వెనుకకు వెళ్లి పడ్డాడు. తటాలున అర్జునుడు తన వేయి చేతులతో రావణుని బలవంతముగ బంధించి సింహనాదము చేశాడు. మూర్ఛపోయి వున్న ప్రహస్తుడు తెప్పరిల్లి అర్జునుడి చేతులలో చిక్కివున్న రావణుని అవస్థనుచూచి మండిపడుతూ రాక్షససైన్యములను చేర్చుకుని

## రావణుని ఓటమి

నానావిధాయుధములను అర్జునుని మీద విసరసాగారు. కాని అర్జునుడు వాటిని మధ్యలోనే చెల్లాచెదరుచేసి రావణునితో రాజధానిని చేరాడు.

దేవతలు, అర్జునుడు రావణుని గాలిని మూటగట్టినట్లు గట్టాడని తమలో తాము చెప్పుకొనుచుండగా పులస్త్యమహాముని విన్నాడు. పులస్త్యుడు రావణునికి తాత. మనమునియందలి ప్రేమచేత వాయువేగంతో మాహిష్మతీ నగరాన్ని చేరాడు. పాదచారియై వస్తున్న ఋషీంద్రుని చూచి ద్వారపాలకులు అర్జునుని కెరిగించారు. వచ్చినవాడు పులస్త్యమహాముని అని తెలుసుకుని అర్జునుడు ఎదురువచ్చి తోడ్కొనిపోయి అర్ఘ్యపాద్యాదులిచ్చాడు.

'స్వామీ! ఎంత తపస్సు చేసినా తమ దర్శనము గాదు. అటువంటి మీరు దర్శనమిచ్చి నా జన్మ సఫలము చేశారు. ఈ రాజ్యము, మేము మీవారము. మీరు దయచేసిన కార్యమేమో ఆనతీయండి' అని వినయంగా పలికాడు.

పులస్త్యుడు కుశలప్రశ్నలు వేసి, అర్జునుని పరాక్రమాన్ని పొగడినాడు.

'సముద్రములు, వాయువు ఎవరికి వెఱచి కదలక మెదలక వుంటాయో అట్టివాడైన రావణుడు నీకు బద్ధుడైనాడు. వాడు నా మనమడు వాడి కీర్తి నీచే జయింపబడినది. నిన్ను యాచిస్తున్నాను. నా కోర్కె చెల్లించి రావణుని విడిచిపెట్టు' అని కోరాడు.

మునీంద్రుని కోర్కెను శిరసా వహించి, రావణుని విడిచి అగ్నిసాక్షిగా వానితో మైత్రి కల్పించుకున్నాడు. పులస్త్యుడి పుణ్యమా యని, అర్జునుడి చేతిలో చావవలసిన రావణుడు విడుదల పొంది సిగ్గుతో మొగము ముడుచుకుని, తాతను పూజించి లంకకు పోయాడు.





## "గారాబం"

(12-వ పేజీ తరువాయి)

వచ్చేశారేఁ?' అంది. నేనింకా వెళ్ళిన చోటే ఉంటాననీ, ఆమె రాత్రి నాతో చెప్పినట్టు అడగవలసిన విషయాలనుగురించి, వ్యవహారాలనుగురించి తర్జనభర్జనలు చేస్తూ, అక్కడ ఉండిఉంటానని ఆమె ఊహించుకొంటూ ఉండాలి.

"చిట్టిబాబొచ్చాడా?" అని గర్జించాను.

"ఆ, వా డెక్కడికెళ్లాడు?" అని మారుప్రశ్నించింది.

"ఏడీ?"

"అన్నం తింటున్నాడు."

అమ్మయ్యా—సుదీర్ఘం అయిన నిట్టూర్పు విడిచాను. ఉత్తరీయంపోగా కొయ్యకి తగిలించాను. నూతివగ్గరి కెళ్లి, కాళ్లు కడుక్కొని వస్తూ పెరుగుబువ్వ తింటున్న బాబుని చూచాను. 'ఎంతపని చేశావురా! కొంప తీసేశావు' అనుకొంటూ గదిలో కొచ్చాను. బట్టలుమార్చుకొని వంటింట్లోకి వెళ్లి పీట మీద చతికిలబడ్డాను.

శ్రీమతి వెండికంచం ఉంచి అన్నం వడ్డిస్తోంది. నేను మౌనంగానే ఉన్నాను. అప్పటికే చిట్టిబాబు భోజనం పూర్తి అయింది. వాడు చల్లగా హాలులోకి జారుకున్నాడు.

నేను అన్నం కలుపుతున్నాను. శ్రీమతి నెయ్యి వేస్తూ "అప్పుడే వచ్చేశారేఁ?" అని ప్రశ్నించింది. నేను మౌనం దాల్చాను.

"ఎవరెవ రొచ్చారు? కర్మ ఎవరు చేస్తున్నారు? పోయేటప్పుడు విధాయకులందరూ దగ్గరే ఉన్నారా?" నేనేమీ సమాధానం చెప్పటం లేదు.

"ఎవ రెవరి కేమేం చెప్పాలో అన్నీ చెప్పేశారా? ఆయనస్థిరాస్తి, కూతుళ్లందరికీ సమంగా వాటా వేశారా"?

ప్రత్యుత్తర మియ్యలేదు నేను. శ్రీమతికి కోపమో, విసుగో మరేదో కలిగుండాలి.

"ఏమిటండీ మాట్లాడరు?" స్వరంలో కొంచెం నిర్లక్ష్యం ధ్వనించింది.

"ఏం చెప్పమంటావు? నాకు ప్రొద్దుట్నుంచీ మతి లేదు" అన్నాను.

"అదేమిటి?" ఆశ్చర్యం ప్రకటించింది.

"ఔను. ప్రొద్దుట రైలు కదిలింది మొదలు ఇప్పుడు చిట్టిబాబుని సురక్షితావస్థలో చూచేదాకా నా ప్రాణానికి కుదురుంటే ఒట్టు." అని జరిగిందంతా పూసగ్రుచ్చినట్లు చెప్పాను.

"బా—గా—నే—ఉంది." మూతి ముడిచింది శ్రీమతి.

హాలులో మా సంభాషణంతా వింటున్న చిట్టిబాబు పకోలున నవ్వాడు.





„అదీ కథ నువ్వు తొడుక్కున్న గుడ్డలు నీవి కాకపోతే మరేం ఫరవాలేదు ఎరువు తెచ్చుకో, లేకపోతే సెకండ్ హాండ్ సరుకుల షాపులో చవగ్గా కొనుక్కో, సత్తా ఉంటే, ఎక్కడన్నా ఎత్తుకురా, ఇంకేం చెయ్యి, సూటు వేసుకుంటే చాలు నీకు అద్భుతమైన మర్యాదలూ జరుగుతాయి లేకపోతే నీకేసి చూసేవాడు లేడు నువ్వెంతవాడివైనా సరే"

చార్లీ చాప్లిన్ అనుకరణ అనిపించే ఫక్కీలో "అలంకరణ" చేసుకున్న రాజ్ కపూర్ "రిపోర్టర్" సెట్ మీద నిలబడి రిపోర్టర్లకి ఈ సూక్తులు పంచిపెట్టాడు

సి. ఎం. త్రివేదీ నిర్మిస్తున్న ఈ చిత్రం రాజ్ కపూర్ తాజాచిత్రం వ్యక్తికన్న వేషానికే ఈ లోకంలో విలువ ఎక్కువన్న నైజాన్ని తాపీగా గ్రహించుకున్న పత్రికా విలేఖరి కథను ఇందులో చిత్రిస్తారట

పృథ్వీరాజ్ కపూర్ ప్రార్థనను చిత్రిస్తూ ఈ చిత్రానికి ప్రారంభోత్సవం జరిపారు.

ఈ ఉత్సవం తరువాత, పృథ్వీరాజ్, తమ స్వంత చిత్రం "పైసా" సెట్ పైకి వెళ్ళారు ఆర్. కె. స్టుడియోలో ఒక సెట్ మీద పృథ్వీరాజ్ చిత్రం తయారవుతూ ఉంటే, మరోచోట రాజ్ కపూర్ తాజా చిత్రం "అబ్ దిల్లీ దూర్ నహీఁ" షూటింగ్ సాగుతోంది. ఈ చిత్రానికి దర్శకుడు అమర్ కుమార్.

* * *

ఇది నిజమా?"

నిక్షేపంవంటి నిజం చలన చిత్రాలలో కొత్తదనం కావాలంటే, కొత్త మనుషులు రావాలన్న నిజాన్ని ఇక్కడి నిర్మాతలు నిజంగా గ్రహించారన్న సంగతి నిజమని రోజుకోసారి రుజువవుతోంది.



నందీవారి "సౌభాగ్యవతి" లో సావిత్రి.

# బొంబాయి సినిమాలేఖ

ఈ చలనచిత్ర రాజధానిలో సర్వత్రా కొత్తవారు కాలు మోపుతున్నారు పాతికేళ్ళ చరిత్రలో ఏనాడూ ఎరగనంతమంది కొత్తవారు ఈరోజున చిత్రనిర్మాణంలో ప్రముఖ కార్యాలు నిర్వహిస్తున్నారు సమర్థులనిపించుకుంటున్నారు కొద్దిమంది మాత్రం ఇది నిజమా" అని మెల్లిగా, అనుకొంటున్నట్లు అంటున్నారు

దీనికి జవాబు అన్నట్టుగా చెప్పతగ చిత్రం ఒకటి అదే పేరుతో—"యే సచ్ హై" మొన్న అశోక్ స్టుడియోలో ప్రారంభం అయింది ఈ చిత్రం దర్శకుడు నవయువకుడు కుమార్ కుల్‌దీప్ అతనికిదే దర్శకత్వ నిర్వహణలో తొలిసారి

ఈ చిత్రంలో శ్యామ నాయకిగా నటిస్తోంది వర్ధమాన నటి మంజు మరో ముఖ్య భూమిక నిర్వహిస్తోంది

## 'రాక్ అండ్ రోల్' గిరాకీ

కొన్నాళ్ళ క్రితం హాలీవుడ్ నుండి బట్వాడా అయిన "రాక్ అరౌండ్ ది క్లాక్" అనే చిత్రంలో వినబడ్డ 'రాక్ న్ రోల్" నృత్య సంగీతం బొంబాయి చిత్రాలు బోలెడింటికి భిక్ష పెట్టింది నిర్మాతలూ, దర్శకులూ, సంగీత దర్శకులూ ఆ మట్లుమీద మహా మోజు పడుతున్నారు

అసలీనాడు, ఇక్కడి సంగీత దర్శకులు దాదాపు అందరూ, దాదాపు అన్ని పాటలకీ వరసలు విదేశీ రికార్డులనుండి సంగ్రహిస్తూనే ఉన్నారు మెచ్చతగ్గ విషయం వారి చాకచక్యం. పాశ్చాత్య బాణీని తీసుకుని,

# ★ బొంబాయి సినిమా లేఖ ★

దాన్ని "భారతీయం"చేసి, అపైన కొస్త అక్కడా కొస్త యిక్కడా మెరుగులు దిద్ది "సైక్లో" అంటున్నారు

ప్రస్తుతం, మంచి గిరాకీలో ఉన్న బాణీ ఈ "రాక్ న్ రోల్"దే "యే షన్ హై" చిత్రం సంగీత దర్శకుడు ఎస్ హరిదర్శన్, ఒక పాట పల్లవికి ఈ మట్లు వాడాడు ఆతర వాత, దేశ దేశాల వరసలు వినబడతాయనుకోండి అలాగే, అలంకార్ చిత్ర్ వారు నిర్మిస్తున్న "బారిష్"లో పాటలకి ఇదే వరవడి



"వద్దంటే పెళ్ళి"లో చలం.

## అశోక్‌కుమార్ కొత్త భూమిక

"రిపోర్టర్" చిత్రానికి ప్రారంభోత్సవం జరిగిన శ్రీ కాంత్ స్టుడియో (చెంబూర్) లోనే జోగేల్కర్ కొత్త చిత్రం "కారిగార్" తయారవుతోంది ఇందులో అశోక్‌కుమార్, నిరూపరాయ్ నటిస్తున్నారు

అశోక్‌కుమార్ ఇందులో హాలీవుడ్ "గాంగ్‌స్టర్" వేషం వేయబోవటం లేదు, నిరూప దేవతగానూ సాక్షాత్కరించబోవటం లేదు చాలా రోజులకి, కొంత కొత్త తరహాలో వీరి భూమికలు రూపొందించారు మరో విశేషం ఇందులో గళ్లలుంగీ వేసుకు కోరమీసాలు మేలేసుకుంటూ తిరిగే రౌడీ విలను గాని, సూటూ బూటూ వేసుకు 'పైప్' కాలుస్తూ తిరిగే తరహా దుర్మార్గుడు గాని ఉండకపోవడం అలాగని ఆద్యంతం హీరో ఈలవేస్తూ తిరుగుతాడనుకో నవసరం లేదు ముక్కుకు సూటిగా నడుచుకొని, న్యాయంగా బతకాలని ప్రయత్నించి కష్టాలుపడ్డ వ్యక్తికథ ఇది

"ఈ సమరంలో అతడి పాలిట విలన్ ఏ వ్యక్తీ కాదు, కేవలం దురదృష్టమే" అని నిర్మాత జోగేల్కర్ చెప్పారు. ★

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)

శర్వాణీ పిక్చర్స్‌వారి "అక్కచెల్లెళ్లు" చిత్రంలో సూర్యకాంతం, రమణారెడ్డి, కృష్ణకుమారి, సి. ఎస్ ఆర్

విజయవారి "మాయాబజార్"లో మాయాశశిరేఖను చూసి వేజారైన సుయోధనసూనుడు, అతగాడి బలగం.

 

# సినిమా వార్తలు



ఆర్, ఆర్ పిక్చర్స్‌వారి ద్విభాషా చిత్రం "కార్తవరాయుడికథ" వాహినీలో తయారవుతోంది

ఎన్ టి రామారావు, ముక్కామల, ఆర్. వి కృష్ణమూర్తి రాజనాల, వి ఎన్ శర్మ, రమణారెడ్డి, బాలకృష్ణ, పద్మనాభం రామకోటి, కన్నాంబ, బి ఎస్ సరోజ, గిరిజ, సురభి బాలసరస్వతి పాల్గొంటున్నారు కి శే జోగారావు ఇందులో ఒక భూమిక నిర్వహించాడు

ఈచిత్రానికి శ్రీ మద్దిపట్ల సూరి మాటలూ, శ్రీ దేవులపల్లి వెంకట కృష్ణశాస్త్రి పాటలూ వ్రాశారు. సంగీత దర్శకుడు జి రామనాథన్. ఛాయాగ్రహణం రాజా బాదర్ కళ గంగ.

దర్శకుడు శ్రీ రామన్న సంయుక్త దర్శకుడు శ్రీ ఐ ఎన్ మూర్తి ఇప్పటికి 11 రీళ్ళ



దాంపత్యంలో విద్య.

చిత్రం ఎడిటింగ్ సహా పూర్తి అయింది.

## కృష్ణలీల

శ్రీకృష్ణభగవానుడి పేరు చెప్పి కొత్తగా రెండు తెలుగుచిత్రాల నిర్మాణం సాగుతోంది.

ఒకటి శ్రీ రాజ రాజేశ్వరీ (శ్రీ కృష్ణ తులాభారం) వారి "కృష్ణమాయ" జెమినీ స్టుడియోలో ఈ చిత్రం తయారవుతోంది. నాగేశ్వరరావు, జమున, రేలంగి, సూర్యకాంతం, సూరిబాబు పాల్గొంటున్న ఈచిత్రానికి శ్రీ సి ఎస్ రావు దర్శకత్వం నిర్వహిస్తున్నారు

రచన శ్రీ రావూరు సత్యనారాయణ. సంగీత దర్శకుడు శ్రీ టి వి రాజు

రెండో చిత్రం రాజ్యం ('హరిశ్చంద్ర') పిక్చర్స్‌వారి "కృష్ణలీలలు" దీనికి మాటలు శ్రీ సదాశివబ్రహ్మం, పాటలు ఆరుద్ర వ్రాస్తున్నారు దర్శకత్వం శ్రీ సి పుల్లయ్య నిర్వహిస్తున్నారు సంగీత దర్శకుడు సుసర్ల దక్షిణామూర్తి

## రామాంజనేయ యుద్ధం

మొన్ననే ప్రారంభమయిన మరో పౌరా



సారథీవారి "పెద్దరికాలు" చిత్రంలో రాగిణి నృత్యం.

# సినిమా వార్తలు

శ్రీకం కాశీనాథ్ ప్రొడక్షన్స్‌వారి "రామాంజనేయ యుద్ధం" ఇందులో రాముడు అమర్‌నాథ్, అంజనేయుడు జంధ్యాల గౌరీనాథ (పెద్దమనుషులు) శాస్త్రి

ముక్కామల కృష్ణమూర్తి, సూర్య (సువర్ణమాల) నారాయణ, శ్రీరంజని, మాలతి ఇతర ముఖ్యభూమికలు నిర్వహిస్తున్నారు

ఈచిత్రానికి రచయిత శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావు సంగీతదర్శకుడు జంధ్యాల లక్ష్మీనారాయణ నృత్య దర్శకుడు వెంపటి సత్యం కళ. కోట ఛాయాగ్రహణం పి ఎల్ రాయ్.

శ్రీ ఎస్ ఎస్ ఆచార్యదర్శకత్వం నిర్వహిస్తున్నారు నిర్మాత శ్రీ కె సుబ్రహ్మణ్యం స్టుడియో రేవతి



"తాయ్‌కు పిన్ తారం" అనే తమిళచిత్రం మొన్న 'మాతృశపథం' పేరిట, తెలుగువ్యాఖ్యానంతో ఆంధ్రలో విడుదల అయింది ఆ చిత్రంలో టి. ఎస్. బాలయ్య, సురభి బాలసరస్వతి.

## అల్లావుద్దీన్

జైశక్తి ప్రొడక్షన్స్‌వారు అల్లావుద్దీన్ కథను తెలుగు తమిళ భాషలలో భారీఎత్తున నిర్మిస్తున్నారు

అ మస్య, మాంత్రికుడు ఎస్ వి రంగారావు, అల్లావుద్దీన్ నాగేశ్వరరావు పాల్గొన్న కొన్ని సన్నివేశాలను వీరు కాశ్మీరు లోయలో చిత్రించటం విదితమే.

ఈ చిత్రంలో ఆపిల్లల వేలంపాట 'ఆట'ని చిత్రించడానికై, మొన్న హుషారైన పాట ఒకటి వాహినీలో రికార్డు చేశారు సంగీతదర్శకుడు శ్రీ రాజేశ్వరరావు దీనికి, స్పానిష్, ఈజిప్షియన్, చైనా, అరేబియన్, భారతీయ బాణీలలో మనోహరమైన రీతిన వరసలు కూర్చారు, 'అలనాటి అరేబియన్' బజారులలో బానిస వ్యాపారాన్ని ఈ పాటతో చిత్రిస్తారట

(54-వ పేజీ చూడండి)

# అదీ - ఇదీ

మర్ఫీ రేడియో కంపెనీ, మెట్రో గోల్డ్విన్ మేయర్ వారూ కలసి నిర్వహించిన గాయకుల పోటీలో బొంబాయికి చెందిన మహేంద్రకుమార్ కపూర్, బెంగాలీయువతి ఆరతీముఖర్జీలు ప్రథమ స్థానాలు సంపాదించుకొన్నారు ఈ రూపేణా, సినిమా సంగీతప్రియులకు అతీతమైన రీతిన, చలనచిత్రసీమలో రెండు క్రొత్త కంఠాలు వినిపించే అవకాశం ఏర్పడింది ఇందుకు పోటీ నిర్వాహకులు అభినందనీయులు

ఈ పోటీలో యోగ్యులయిన వారిని ఎన్నిక చేసిన ఐదుగురు సంగీత దర్శకులూ, కొకరు తమ తమ చిత్రాలలో ప్లేబాక్ పాడే అవకాశం ఇస్తారు ఈ దర్శకులు నౌషాద్ అలీ, అనిల్ బిశ్వాస్, సి రామచంద్ర, మదన్‌మోహన్, వసంత్ దేశాయ్

ప్రాంతీయ పోటీలలో మద్రాసులో ఉత్తమ గాయకుడుగా కె బి కె. మోహన రాజు, (విజయవాడ) పద్మా సుబ్రహ్మణ్యం ఎన్నిక అయ్యారు.

ఫిబ్రవరి 14 న బొంబాయిలో శ్రీ ఎస్ కె పాటిల్ అధ్యక్షతన సభ జరిగింది పోటీ నిర్వాహకులను, గెలుపొందిన యువతీ యువకులనూ శ్రీ పాటిల్ అభినందించారు

అఖిల భారత పోటీలో బొంబాయి అబ్బాయి, బెంగాలీ అమ్మాయి గెలిచి, హిందీ చిత్రాలలో పాడడానికి ఎన్నిక కావడం సంతోషకరం అందులో ఆశ్చర్య పడాల్సినదేం లేదు హిందీచిత్రాలను ప్రధానంగా దృష్టిలో ఉంచుకుని జరిగిన పోటీలో దక్షిణభారత గాయకులు, అగ్రతాంబూలం అందుకోకపోవడం అంతకన్న ఆశ్చర్యకరం గాదు.

అయితే, జరుగతగినది వివిధ ప్రాంతీయ పోటీలలో ఔను అనిపించుకుని, బొంబాయి ఫైనల్స్‌కు వెళ్లిన మిగతా 14 గురు యువతీ యువకులకు, ఆయా ప్రాంతాల చలనచిత్రాలలో పాడే అవకాశం ఇచ్చి ప్రోత్సహించడం అవసరం.

కాశీనాథ్ ప్రొడక్షన్స్ వారి "రామాంజనేయ యుద్ధం"లో శ్రీరాముడుగా అమర్‌నాథ్.

మర్ఫీ మెట్రో సంఘం పోటీలో ఇదాక కత్తు కాకపోయినా, జరిగిన ఈ పోటీవల్ల

'నాట్య భారతీ ప్రొడక్షన్స్' కు ఇటీవల రాజమండ్రిలో ప్రారంభోత్సవం జరిగింది ఈ సంస్థ పేరిట డా॥ జి. రాజారావు త్వరలో నే మద్రాసులో ఒక చిత్రం నిర్మించబోతున్నారు. (పటంలో ఎడమనుండి కుడికి) [illegible]

[illegible] డా॥ రాజారావు.

## అదీ ఇదీ

కోరికిన ఈ యువతీ యువకులను వదలి వేయడం వాంఛనీయం కాదు. కొత్తవారికి అవకాశాలు ఇస్తామనేవారు, ఇవ్వచ్చుననే వారు కూడా శ్రద్ధగా ఆలోచించ తగు విషయం

* * *

### "సతీ ఫలానా"

దేశాయ్ ఫిలింస్ వారి "సింహళ ద్వీప్ కే సుందరి" చిత్రానికి పౌరాణిక పరిమళం గుబాళించే విధంగా "సతీపరీక్ష" అని నామకరణం చేశారు

అమలులోఉన్న బాక్సాఫీస్ సూత్రాల రీత్యా "సతీ ఫలానా" బాపతుపేర్లు అఖండమైన హంగులు.

విశేషం ఏమిటంటే, ఈ చిత్రాన్ని దర్శకుడు నానూభాయ్ వకీల్ 24 రోజుల్లో (షూటింగ్) పూర్తిచేశారు.

చిత్రం నిడివి తగ్గించడంద్వారా డబ్బు పొదుపుచేయబోవడం తగదనుకు నేవారు, నిర్మాణం ఇలా త్వరగా సాగించివేసి, ఈ విధంగా ఆ కార్యాన్ని సాధించ వచ్చునని ఋజువైంది. ఉన్నంతలో ఘనమైనపని.

* * *

హాలీవుడ్ నటి ఎలిజబెత్ టేలర్, గత మాసం ప్రముఖ నిర్మాత మైకెల్ టాడ్ ('అరౌండ్ ది వరల్డు ఇన్ 80 డేస్') ను వివాహం చేసుకుంది. ఎలిజబెత్ కొంత కాలంక్రితం నిక్ హిల్టన్ అనే కోటీశ్వరుణ్ణి పెళ్ళాడి కొన్నాళ్ళక్రితం మైకెల్ వెల్డింగ్ అనే బ్రిటిషు నటుడిని పెళ్ళాడి, ఈసారి టాడ్‌ను వివాహం చేసుకుంది వరుడికి కూడా ఇది మూడో పెళ్ళే

ప్రముఖ బ్రిటిషునటుడు రెక్స్ (అన్నా అండ్ ది కింగ్ ఆఫ్ సయాం) హారిసన్‌కు అతడిభార్య మొన్న హఠాత్తుగా విడాకుల తాఖీదు పంపించిందట పదమూడేళ్లు కాపరం చేసినతరువాత, ఆవిడ కనుగొని, కోర్టుకు కనుబరచబోతున్న సత్యం. "మా యిద్దరి తత్వాలకూ పొసగదు" ★



పారమౌంట్ వారి 'బర్డ్స్ అండ్ బీస్' చిత్రంలో మిట్జీగేనర్.

## సినిమావార్తలు

[52 వ పేజీ తరువాయి]

వేలంవేయబడే పిల్లలే ఒకరి తరవాత ఒకరు తమ అందచందాలగురించి చెప్పుకుంటూ ఈ పాటలో తలోచరణం పాడుతారట.

స్పెయిను జవరాలు మంచి ప్రియురాలు అన్నవైనాన్ని వెల్లడిచేస్తూ స్పానిష్ సుందరి పాడే పాటను స్వర్ణలత పాడింది

ఈ చిత్రానికి మాటలూ పాటలూ ఆరుద్ర వ్రాశారు దర్శకుడు టి. ఆర్. రఘునాథ్. అసోసియేట్ పి వేణుగోపాల్.

## అక్కచెల్లెళ్లు

శర్వాణీ పిక్చర్స్‌వారి సాంఘికచిత్రం "అక్కచెల్లెళ్లు" వాహినిలో తయారవుతోంది శ్రీరంజని, కృష్ణకుమారి, సూర్యకాంతం, లక్ష్మీకాంత్, అమర్‌నాద్, రమణారెడ్డి ప్రభృతులు పాల్గొంటున్నారు. రచన శ్రీశ్రీ, ఆరుద్ర. సంగీతం పెండ్యాల నాగేశ్వరరావు, దర్శకత్వం సార్వభౌమ, అమానుల్లా నిర్వహిస్తున్నారు. ★

# ★ న్యూఢిల్లీ లేఖ ★

(5-వ పేజీ తరువాయి)

ఎవరికైనా ఉత్తమమైన వయస్సు 60 ఏళ్లని రచయిత ఇందులో వ్రాస్తున్నాడు. అరవై ఏళ్లు మించినవారిని ఉద్యోగంలో వుంచడం నిరాశా. నిస్పృహాలకు, ఈర్ష్యకు, రాజీనామాలకు హేతువవుతుందని యీ రచయిత హెచ్చరిక చేస్తున్నాడు. ఇందువల్ల ప్రతిభావంతులైనవారు అనేక మంది మరుగున పడిపోవడం కూడా జరుగుతుందంటున్నాడు. అనేక శాఖలలో ఈనాడు అసామర్థ్యం కొట్టవచ్చినట్లు కనబడుతున్నదంటే, ఏదో ఒకవ్యక్తి, లేదా, కొందరువ్యక్తులు ఆయా శాఖలపై అధ్వర్యంవహిస్తేనేతప్ప ప్రయోజనం లేదనేదురభిప్రాయం పాతుకుపోవడమే కారణం. దేశ పరిపాలనా నిర్వహణంలో "యువకులకు స్థానం ఇవ్వాలనే వాదన ఒకవైపు వినవస్తున్నమాట నిజమే; మరొకవైపు వయస్సుమీరినవారు కాలపరిమితి దాటిపోయిన తర్వాతకూడా ఉద్యోగాలలో తిష్టవేసేట్లు చేయడంకూడా జరుగుతున్నది. అటు ఇటు గాని ఈ అనిశ్చయధోరణి ఫలితంగా పరిపాలనాసామర్థ్యం దెబ్బతింటున్నది.

* * *

ఇండియన్ సివిల్ సర్వీస్ (ఐ.సి.ఎస్.) ఉద్యోగవేతనాల నిబంధనలను ప్రభుత్వం సవరణచేసింది. ఈ సవరణలు ఆయా ఉద్యోగులు సెలవుమీద విదేశాలలో వున్నప్పుడు ఇవ్వవలసిన వేతనాలకు, విదేశ ప్రయాణానుమతులకు సంబంధించినవి. వీరందరికీ ప్రత్యేక ఉద్యోగ నియమావళి వర్తిస్తుంటేది. ఏ ఐ. సి. ఎస్. ఉద్యోగి అయినా విదేశాలలో వుండడం సంభవిస్తే, అతడు తన జీతాన్ని నిర్ణీతమైన మారకం రేటు ప్రకారం (1928 జులై 5వ సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఆదేశానుసారం కేంద్ర ఆర్థికశాఖ ప్రకటించిన నియమం ప్రకారం) ఆ దేశపు డబ్బులో తీసుకోవచ్చు. ఈ నియమం రద్దవుతున్నదనీ, ఇకమీద అట్టిఉద్యోగి రూపాయలలోనే జీతం తీసుకోవలసి వుంటుందనీ, అవసరమైతే ఎప్పటికప్పుడు ఆయాదేశాలలో అమలులోవుండే మారకపు నిబంధనలప్రకారం మార్చుకునే బాధ్యత ఆ ఉద్యోగిదేననీ ప్రభుత్వం ప్రకటించారు. సెలవులోవుంటే ఏ సివిల్ సర్వీస్ ఉద్యోగికీ స్టెర్లింగ్ పౌన్లలో జీతాలుఇచ్చేదిలేదని ప్రభుత్వంస్పష్టపరిచింది. కీ॥ సర్దార్ పటేల్ ఈ ఉద్యోగులకు గతంలో ఇచ్చిన పవిత్ర వాగ్దానం ఒకటి ఇప్పుడు ఈవిధంగా రద్దయిపోయిందన్నమాట!

* * *

న్యూఢిల్లీలో త్వరలోనే ఒక పెద్ద జంతు ప్రదర్శనశాలను ఏర్పాటు చేయబోతున్నారు. భారత దేశ విజ్ఞానాభివృద్ధిశాఖ ఖాతాలో ఈ జంతుప్రదర్శనశాలకయే కొత్త ఖర్చును ప్రభుత్వం చేర్చబోతున్నదన్నమాట. ఈ అదనపు వ్యయాన్నికూడా ప్రభుత్వానికి పన్నులు చెల్లించే సాధారణపౌరుడు ఇకమీద భరించవలసి వస్తుందన్నమాట. "నీ అభిమాన జంతువుల సంగతేమిటో చూసి తెలుసుకో" అనే కొత్త నినాదం ప్రచారంలోకి వస్తుందన్నమాట. లండన్‌లో ప్రపంచ ప్రసిద్ధమైన జంతుప్రదర్శనశాల ఒకటి వుంది. దాని నిర్వహణ బాధ్యత అంతా ప్రైవేట్ వ్యక్తులదే. దీనిమీద బాగా లాభాలుకూడా వస్తున్నవి. సర్ స్టాంఫర్డ్ రాఫిల్స్, సర్ హంఫ్రీడేవీ మొదలైన విశ్వవిఖ్యాత శాస్త్రవేత్తల ఆధ్వర్యాన బ్రిటిష్ జంతుశాస్త్రాభివృద్ధి సంఘం ఒకటి ఉదాత్త లక్ష్యాలతో 1826లో ఏర్పాటైంది.తర్వాత దానికి బ్రిటిష్ ప్రభుత్వ పరిగణన లభ్యమైంది. ప్రత్యేక జంతు ప్రదర్శనోద్యానాలనుకూడా ఇదే సంఘం స్థాపించింది. జంతుశాస్త్ర పరిశోధనలో అమోఘమైన అభివృద్ధి సాధించింది. ఈ శాస్త్ర పరిశోధనాభివృద్ధికి కావలసిన డబ్బు జంతు ప్రదర్శనశాలను చూడడానికి వచ్చే ప్రేక్షకులు చెల్లించే రుసుంద్వారానే వస్తున్నది.

రీజెంటు పార్కులో వున్న జంతు ప్రదర్శనశాల నిర్వహించడానికి ఎంతోఖర్చు భరించవలసి వస్తున్నది. ఇక్కడ జంతువుల పోషణకు కావలసిన ఆహారపదార్థాలకే సాలీనా 90 వేల పౌన్లు ఖర్చవుతున్నది. ఒక పెద్ద ఏనుగు రోజుకు ఒక హండ్రెడ్ వెయిట్ (టన్నులో 20-వ వంతు) మేత మేస్తుంది. ఇదిగాక అది తినే ఓట్లధాన్యం, తవుడు, పండ్లు, కాయగూరలు మొదలైనవాటిసంగతి సరేసరి. వీటన్నిటికీ ఒక్కొక్క ఏనుగుకు సాలుకు 400 పౌనులు ఖర్చు అవుతుంది. ఒక్కొక్క సింహం రోజుకు పది లేక పన్నెండుపౌనుల మాంసం తింటుంది; దీనికి ఏడాదికి 200 పౌన్ల ఖర్చు.

జంతు ప్రదర్శనశాలాభిమానులైనవారు చాలావరకు ఈ ఖర్చును స్వయంగా భరిస్తుంటారు. జిరాఫీలకు ఓక్ చెట్ల ఆకులు, కొమ్మలు అంటే మహాఇష్టం. ప్రదర్శనశాలలోవున్న జిరాఫీలకు ఇందుకోసమయేఖర్చు భరించడానికి ఒక "లార్డ్" పూచీ పడ్డాడు. "కీవి" అనే ఒక న్యూజిలెండు పక్షి (పక్షేగాని ఎగరలేదు!) వానపాములను మనం "సేమియా" తిన్నట్టు మహాసరదాగా తినేస్తుంది. ఈ వానపాములను పట్టితీసుకురావడానికి అయే ఖర్చు అంతటినీ మరో "మిత్రుడు" భరిస్తున్నాడు. ఒక్కొక్క "కివీ" పక్షి ఏడాదికి 300 పౌనుల తూకంవరకూ వీటిని గుటకాయి స్వాహా చేస్తుంది! జంతువుల ఆహారంకోసం మిడతలు, ఈగలు మొదలైన కీటకాలను ప్రత్యేకించి పెంచడానికి కూడా ప్రదర్శనశాలలోనే సదుపాయాలున్నవి. ప్రదర్శనశాలకు ఏడాది మొత్తంమీద 100 టన్నుల మాంసం, 14 వేల కోడిగుడ్లు, 13,400 పైంట్ల పాలూ కావాలి.

ప్రదర్శనశాలమీద వచ్చే రాబడితోనే ఈ ఖర్చులన్నీ భరించడమేగాక, లాభం కూడా ఆర్జిస్తున్నారు. 1955 లో ఈసంఘానికి రీజెంటు పార్కు ప్రదర్శనశాలమీద, టిక్కెట్లఅమ్మకంద్వారా 2,10,000 పౌనుల ఆదాయం వచ్చింది. విరాళాలద్వారా 21 వేల పౌనులు, గైడ్‌పుస్తకాలు, సావినీర్లు అమ్మడంవల్లనైతేనేమి, ప్రదర్శనశాలలోనే వున్న హోటలువల్లనైతేనేమి మరో 25 వేల పౌనుల రాబడి వచ్చింది. ఒక టీ·పార్టీ జరిపి దానిలో చింపాంజీలు పాల్గొనేట్లు చేశారు. ఈ విందుకు అసంఖ్యాకంగా అతిథులు వచ్చినందువల్ల, ఒక్క టిక్కెట్లద్వారానే 1000 పౌనుల ఆదాయం వచ్చింది. ఏనుగులు, ఒంటెలు మొదలైనవాటిమీద ప్రేక్షకులు ఎక్కి విహరించడానికి అవకాశం కల్పించారు. ఇందువల్ల దాదాపు 5 వేల పౌన్లు సేకరించగలిగారు. ఈ విధంగా రీజెంటు పార్కు "జూ" 1955లో మొత్తం 2,95,000 పౌన్లు ఆర్జించింది. ఈ రాబడిలో ఖర్చు 2,81,000 పౌన్లుమాత్రమే. విప్స్నేడ్‌లో వున్న మరో జంతు ప్రదర్శనశాలకూడా 1,10,000 పౌన్లుఆర్జించి, 98 వేలపౌన్లు మాత్రమే ఖర్చుచేసింది. అక్కడ బ్రిటన్‌లో పరిస్థితి ఆ విధంగావుంటే, ఇక్కడ మన పరిస్థితి సాధారణ పౌరుడికి బరువుచేటుగా తయారవుతున్నది! ★

# ★ బుడుగు! చిచ్చుల పిడుగు! ★

(7-వ పేజీ తరువాయి)

ముడుచుకుని ఏడూ పాపా ఏడూ పాపా, నీకు రూపాయిస్తా అని చెప్పుతున్నారు.

అంతట్లోకీ నాకు అయిడియా వచ్చేసింది.

అంతట్లోకీ యింకో పెద్దవాడు ఘుబగబా వచ్చేశాడు.

వచ్చేసి యింకా ఏడవలేదా అన్నాడు కోపంగా

లేదండీ అని చెప్పారు డైరెక్టరూ, సినిమామ్మ ఇలా ముహం పెట్టి

ఛేఛుడు! హూ! అనేసి కొప్పడేశాడు ఆ కొత్తవాడు

ఏడిశావు ఫో నేను యేడవను అనేశాడు ఆ పిల్లాడు

అప్పుడు వాడికి కోపం వచ్చేసింది ఏడూ పాపా మంచి దానివి అని చెప్పాడు నవ్వుతూ

పెద్దవాళ్లకి కోపంవస్తే నవ్వుతారులే.

అయినా పాప యేడవలేదు.

ఇం కెలాగ? టైమైపోతోంది అని కొప్పడాడు కొత్తవాడు

టైమైపోతే బోల్డు బోల్డు రూపాయిలూ కాణీలూకూడా అయిపోతాయట. ఇప్పుడు ఆ కొత్తవాడే అస్సలు సినిమా వాడుట. ఇలాని నాన చెప్పాడు.

వాడికి ఇంకా ఛాలాకోపం వచ్చేసింది.

హూ అనేసి, ఇలా జుట్టు పీక్కున్నాడు కాని వాడికి జట్టు లేదుగా ఉత్తిగుండు. అందుకని, ఇంకా కోపంవచ్చి ఈ పాప అస్సలు వద్దు అనేశాడు అప్పుడు.

మరి ఇంకోళ్లని పిలవనా అన్నాడు డెరక్టరు.

ఎందుకు అస్సలు ఒద్దు అనేశాడు కొత్త వాడు కోపంగా

మ రెలాగండీ రాముడికి రెండు కొడుకులుగదా అంది సినిమామ్మ

యేంకొడుకులే ఒక్క కొడుకు చాలూ, వీడు అస్సలు ఒద్దూ ఫో అనేసి వాడు ఘుబగబ వెళిపోయాడు

అప్పుడు నాన్న లేచి సినిమా అయిపోయింది ఇంటికెళ్ళిపోదాం అన్నాడు

బామ్మకూడా సరేఅందికాని, బాబా రేమో ఇంకో సినిమా చూద్దాం అని ఏడిచాడు.

సరే పదనాన్నా అని చెప్పాను నేను.

అక్కడ ఓ చెట్టుకింద ఒక సీత పాపం నిఝంగా ఏడుస్తోంది వాడెవడో రౌడీ యిలా నిలబడి, హు అని ప్రెపేటు చెప్పేస్తున్నాడు దానికి. వాడు బీడీకూడా కాల్చుతున్నాడు.

నాకే బయంవేసిందిలే. కాని పాపం ఆ సీత నన్ను వదులు నన్ను వదులూ అని ఏడుస్తోంది వాడు వదల్నా వదల్నా హూ హూ అంటున్నాడు.

అంధరూ యిలా బయపడి చూస్తున్నారు.

ఆ సీతని రక్షించా లనుకున్నాను కాని కొంచెం బయంవేసిందిలే

బామ్మకి కూడా ఆ సీతమీద జాలేసింది

పురేయ్ గోపాళం, నువ్వైనా చెప్పరా ఆ పిల్లని వాడు అల్లరి పెడుతున్నాడూ, వాళ్లిలా చూస్తారేవిటీ అనేసింది

నేను కూడా యింక రక్షించేద్దామ్లీ అనుకున్నాను.

ఏయ్ సీతా మా నానతో చెప్తానను, మా నానతో చెప్తాననూ అని చెప్పేశాను.

కాట్ అనేసి అక్కడున్న మొగాళ్లంధరూ ఘాట్టిగా అరిచేశారు. హడ్డిలి పోయానులే

అంతట్లోకీ, ఆ సీతా రౌడీ అంధరూ నవ్వేశారు.

ఉత్తుత్తి ఏడుపేనా అని నేను హాచ్చర్యపడిపోయేశాను.

ఆ రౌడీ నా దగ్గిరకొచ్చేసి, ఎవర్రా నువ్వు ఫోకిరీ అన్నాడు

నువ్వెవర్రా ఫోకిరీ కొాళేస్తాను అని చెప్పాడు.

అప్పుడు వాడు ఘుబుక్కుని యిలా వంగి (వాడు కొంచెం ఎత్తులే నాకన్నా) నవ్వేసి బెల్లకాయ కొట్టాడు

ఈ పెద్దాళ్లెపుడూ యింతే

మన్ని చూసి బయపడ్డపుడు యిలా నవ్వేసి వెళిపోతారు యేవిటో

అంతెందుకు ఇప్పుడు సినిమాలో ఈఠో యిలా నించుని ముందస్తుగా నన్ను పెళ్ళి చేసుకో అంటాడా.

దానికి బయం వేస్తుందిగా. అప్పుడది ఇలా నవ్వేసి వెళ్ళిపోతుందా అప్పుడు వీడు గాఠిగా పాటపాడేస్తాడు అది వాడిలిపోయి పరిగెట్టుతుంది ఇంకో పాట పాడుతూ.

ఈఠో కూడా పరిగెడుతాడుగా.

పరిగెడతారు అనకూడదుట. డాన్సు అనాలి అని బాబాయి చెప్పాడు.

యేం సీత ఇలా డాన్సు చేస్తుందా ఈఠో ఇంకా గబగబా డాన్సు చేస్తాడా. ఎంత గబగబా అయినాసరే అది దొరకదులే. కొంచెంసేపటికి ఇంక డాన్సు చెయ్యలేక ఆగిపోతుంది.

అప్పుడు ఈఠో వచ్చి, నను పేమించుతావా అంటాడు గదా.

పేమించుతావా అంటే నాకు తెలీదు.

బాబాయికీ తెలీదుట.

ఎవరికీ తెలీదు. అని నాన చెప్పాడు.

యేం, అప్పుడు సీత పేమించుతాను అంటుంది.

నిజంగానే అంటాడు ఈఠో. అలాని సీత చెయ్యి గాఠిగా పట్టుకుంటాడు

నిజంగానో కాదో చూట్టానికని, మళ్ళి పాటపాడతాడు చెయ్యిపట్టుకుని. ఇంక సీత పారిపోలేదుగా.

అప్పుడు సీత వాడివేపు యిలా చూస్తుంది.

యింక ఏడిపించకూడదని వాడు పాట మానేస్తాడు.

(ఇంట్రవెల్)



'దేవిదయాళ్ పరిశ్రమల' డైరెక్టర్ శ్రీ హరికిషన్‌దాస్ అగ్రవాల్ కుమార్తె సౌ॥ కుమారి కాంతాబహన్‌కు, మోడీపరిశ్రమ అధిపతి శ్రీ హెచ్. ఎస్. మోడీ కుమారుడు చంద్రప్రకాష్‌మోడీకి ఫిబ్రవరి 16న బొంబాయిలో వివాహం జరిగింది.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.

